# కథలు పది

ఆదివిష్ణు

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ - 2.

# అంకితం

అన్నయ్యా
వొదిన
వాళ్ళద్దరికి

—ఆదివిష్ణు.

# కృతజ్ఞత

దీన్లో కథల్ని మొదటిసారిగా
ప్రచురించి నన్ను ప్రోత్సహించిన
ఆంధ్ర సచిత్ర వారపత్రిక, భారతి-సాహిత్య
మాసపత్రిక, జ్యోతి - మాసపత్రిక సంపాదకులకు

—రచయిత

# ఇందులో:

కలల కథ

శ్రీమతి రాధమ్మ

శ్రేయోభిలాషులు

నాకు తెలిసిన కథ

ముగ్గురు ప్రేమికులు

ఎందుకు?

తప్పు

మనిషి పగ

జగన్నాథం ప్రేమించాడు

బ్రతకనివ్వండి

అను మొత్తం పది కథలున్నాయి.

# కలల కథ

బెజవాడ నగరంలో అద్దెకి గదులు దొరకడమనేది గొప్ప సమస్య అని ఈ ఊళ్ళో కాపురముంటున్న వాళ్ళకి తెలుసు. మా వాళ్ళ కేం తెలుసు? సొంత ఊళ్ళో స్వర్గంలాటి సొంత ఇంట్లో కూర్చుని 'అయిబాబోయ్ అంత అద్దే' అని ఆశ్చర్యపోతే వాళ్ళకి నేనేం చెప్పేది? ఈ ఊరు అలాటిది. ఇక్కడ అద్దెలు అలాటివి. ఆఫీసుకి దగ్గర్లో గది కావాలంటే, అందునా అన్ని సదుపాయాలూ గలదై వుండాలంటే అంత అద్దె ఇవ్వక తప్పుతుందా?

గది దొరకడమే చాలనుకుంటున్న నాలాటివాడిని ఇటు రాముడూ, అటు ఇల్లుగలావిడా, ఇద్దరూ చిత్రవధ చేయడం ప్రారంభించేరు. ఈ హింస గదిలో చేరిన మొదటి నెలనుంచీ ప్రారంభమైంది.

'తెలుగువాడు గడపదాటి కానివూళ్ళో ఉద్యోగం చేయలేడ'నే నానుడి నాపట్ల అక్షరాలా నిజమని ఒప్పుకుంటాను. దానికి తగ్గట్టు ఈ గొడవొకటి నా మనసుని పాడుచేయడానికి.

ఇల్లుగలావిడ నోరు మంచిదికాదని రాముడు నాకు పాఠాలు చెప్పక–

---

1964, మార్చి — భారతి

ల్లేదు. ఆ మహాత్తర విషయం నాకూ తెలుసు. పదిగంటల తర్వాత గదిలో లైటు కనుపిస్తే ఆవిడ గొంతు చించుకుని మరీ జగడానికి రావడమనేది రాముడి కొక్కడికే కాదు. నాకూ బాధగానే వుండేది. కానీ రాముడికి సర్దుకుపోవడం చాతకాదు. అదేమంటే—

'నీకు పౌరుషంగానీ, చీమూ నెత్తురుగానీ లేవూ' అవటాని నామీద విసుక్కునేవాడు. నామీద విసుక్కుంటే ఫర్వాలేదు. ఒక ఊరివాళ్ళం, ఒకే ఊళ్ళో ఉద్యోగం చేస్తున్నవాళ్ళం, పైపెచ్చు రూమ్‌మేట్స్ కావడాన వాడిని క్షమించగల హృదయ వైశాల్యం నాకు లేకపోలేదు. కానీ ఆవిడెవరు? (కాళికాదేవి అంటాడు రాముడు.) ఆవిడ నోరు పారేసుకుంటే వీడూ నోరు చేసుకోవడమేనా? రాముడికోపం చూస్తుంటే ఒక్కోనాడు నాకే భయంగా వుండేది. పొరపాటున ఆవిడమీద చేయి చేసుకుంటే వీడి గతేంగాను? అనే దిగులూ వుండేది. నేనెంత వారించినా వినేవాడు కాదు.

జ్ఞాపకానికి నిలిచిన రోజు! ఇక్కడ ముచ్చటించక తప్పదు. ఆనాడు తలనొప్పిగా వుండటంచేత ఒకగంట పర్మిషన్ పెట్టి గదికొచ్చి కూర్చున్నాను. ఒళ్ళంతా నొప్పులు. లేచి నించోడానిక్కూడా ఓపిక చాలటంలేదు....కొంచెం జ్వరం లాటిది గూడా వచ్చినట్టుంది. ఇలాటి సమయాల్లో నిద్ర బాగా పనిచేస్తుందని ఒకనాటి స్వానుభవంవల్ల తెలుసుకున్నాను. అందుచేత నిద్రకోసం కళ్ళు మూశాను. కానీ ఫలితం దక్కలేదు. నిద్ర రాలేదు. పైగా విసుగ్గా వుంది. ఓపిక గనక వుంటే ఆ పళాన లేచి లీలామహల్లో సినిమా చూసేద్దును.

అయిదయ్యింది. తలుపు దగ్గర చప్పుడైంది. పడుక్కునే తల తిప్పి ఆవేపు చూశాను. రాముడు హడావిడిగా వచ్చాడు. వచ్చీ రావటంతోనే వాడి ట్రంకు పెట్టె బేడా సర్దుకున్నాడు. బైట నించున్న జట్కా

సాయెబుని పిలిచి అతని సాయంతో వాటిని బండిలో వేయించాడు. ఆనకి నాముందు నిలబడి, చేతులు దులుపుకుంటూ అన్నాడు :

"కొత్తగది కుదుర్చుకు వచ్చాను. మీ ఆఫీసుకి 'మరీ' దగ్గర్లో వుంది. ఇవ్వేళే వస్తున్నామని చెప్పాను. రావాలనుకుంటే రా! లేదూ— ఈ రాక్షసి అభిమానానికి బలైనా నాకేం అభ్యంతరంలేదు. మంచి రూమ్మేట్లు దొరకరనే అపనమ్మకం నాకు లేదు. ఏదో ఒకమాట తేల్చి చెప్పు తొరగా"

తల దిమ్మెత్తేలా ఆశ్చర్యపోయాను.

మరేమీ మాటాడలేదు. లేచి నిలబడి బట్టలు మార్చుకున్నాను. రాముడు గర్వంగా నవ్వేడు. వాడెప్పుడూ అలాగే నవ్వుతాడు. నవ్వి అన్నాడు

"స్నేహితులకేం చాలామంది వుంటారు. కానీ నీలాటి ఆత్మీయుడూ, చెప్పిన మాటని ఆలకించి తగిన విధంగా నడుచుకునే బుద్ధిమంతుడూ దొరకడం అరుదు. అందుకు గర్వంగా వుంది నాకు"

ఆపైన వాడంతట వాడే నాపెట్టే, హోల్డాలూ వగైరా సర్దేడు.

కొత్త రూములో కాలుంచే వేళకి జ్వర తీవ్రత ఎక్కువైంది నాకు. హోల్డాలు పరిచి నడుం వాల్చేను. సామానంతా అద్దంలా శుభ్రంగా రాము దొక్కడే సర్దేడు. తర్వాత నన్ను పరామర్శించేడు —

"ఏమిటా షేక్స్పియర్ పోజూ! మార్చేయ్; చూడలేక ఛస్తున్నాను"

"నావాంట్లో బాగోలేదోయ్!"

వాడు ఖంగారుపడిన మాట వాస్తవం. నా నొసటిపైన చేయి వేశాడు; ఉలిక్కిపడ్డాడు.

"జ్వరం బాగావుంది" అన్నాడు. నవ్వి ఊరుకున్నాను.



ఆ రాత్రి వాడు నాకుచేసిన పరిచర్యలు తల్చుకుంటే ఇప్పటికీ రాముడిమీద జాలివేస్తుంది నాకు. ఏవో మాత్రలు తెచ్చాడు; పాలు తెచ్చాడు. కన్ను మూయకుండా రాత్రింతా నా పక్కనే కూర్చున్నాడు

వాడికెందు కింత శ్రద్ధ ?

తెల్లవారుతూనే నవ్వుతూ పలుకరించేసరికి వాడి మొహంలో గంపె డానందం ప్రకాశించింది.

"మొత్తానికి హడలకొట్టావు. శుభమాని కొత్త రూములో చేరితే...."

"అదేం కాదులే ! పాత రూంలోనే కొంచెం తలనొప్పిగావుంది" వాడు చిన్నబుచ్చుకోడం యిష్టంలేదు నాకు.

ఆ ఉదయంగానీ మా రూమూ, పరిసరాలూ చూడటం సంభవించింది కాదు పైగా ఆరోజు ఆదివారం కావడాన తీరుబడి చిక్కింది.

మూడు అంతస్థుల మేడ తాలూకు మూడో అంతస్థులో చివరిగది మాది. ఇక్కడ మొత్తం నాలుగు గదులున్నాయి. నాలుగింట్లోనూ మాలాటి 'కుర్రజాతే' అద్దెకుంటున్నారు. రెండో అంతస్థులో కొన్ని కాపురాలూ, క్రింది భాగంలో మరికొన్ని కాపురాలతోపాటు ఇల్లుగల వాళ్ళూను మొత్తానికి హిందూదేశానికి స్పెసిమన్‌గా వుంది ఈ భవనం. రాముడు దానికో చక్కటి నామకరణమూ చేశాడు. 'జాగ్ తేరహో' బిల్డింగులు ! నవ్వొచ్చింది.

మాపక్క రూముల్లోని జనాభా అందరినీ పరిచయం చేసుకున్నాడు రాముడు. వాళ్ళకి నన్నూ పరిచయం చేశాడు. మావాడి కలుపుగోలుతనం కొత్త కాదు నాకు. ఎంత సీమనుంచి వచ్చిన దొరనైనా ఇట్టే ఆకట్టుకోగల గుణం రాముడికున్న అర్హతల్లో మొదటిదీ ముఖ్యమైనదీను.

హోటల్లో భోంచేసి రూమ్‌లో కొచ్చి కూర్చున్న తర్వాత సిగరెట్టు కాలుస్తూ అన్నాడు వాడు—

"దిక్కు-దిక్కు-మంటూ ఏమీ తోచక వచ్చాం ఆ పాత గదిలో. ఇక్కడ చూడు కావలసినంత కాలక్షేపం !"

ఎంత స్నేహితులమైనా అన్నింటిలోనూ ఏకాభిప్రాయం వుంటుందంటే నే నొప్పుకోను. అందుకే వాడి కామెంటుని పట్టించుకోలేదు.

ఈ 'భవనం'లో కాపురముంటూన్న మనుషులూ వాళ్ళ వివరాలూ చాలా చెప్పాడు. గడిచిన ఈ కొద్ది గంటల్లో వాడు సేకరించిన ఈ వివరాలు ఆశ్చర్యాన్ని కలిగించినా. వాటికి నేనంత ప్రాముఖ్యత ఇవ్వలేదు.

అగ్గిపెట్టె కోసం పక్క రూమాయన రావడంతో రాముడి నోటికి తాళం పడింది. అగ్గిపెట్టె యిచ్చి వచ్చి నతన్ని కూర్చోపెట్టించాడు. అతని పేరు ఆనందరావు. గుమాస్తాయేగానీ వాలకం చూస్తుంటే అతని ఉద్యోగం చప్పున చెప్పడం తెగింపే మరి. మావాడికి తగిన నేస్తం. నిజమే– లేకపోతే నేనంటూ ఒక క్రీచర్ అక్కడ వున్నాననే యిది మరిచి కేవలం వాళ్ళిద్దరే మాట్లాడుకోడ మేమిటి ?

చాలా విషయాలు మాటాడుకున్నారు. చివరికి హాలీవుడ్ చిత్రాల మీదికి వచ్చింది సంభాషణ. మహానటుల పేర్లూ, వాళ్ళ నటనాకౌశలమూ, వాళ్ళ జీవిత విశేషాలూ వగైరాలు వాళ్ళ సబ్జెక్టు. అక్కడ్నుంచి కేవలం సినిమాల గురించే చెప్పుకున్నారు. మావాడు మహత్తర కళాఖండం గురించి చెబుతే ఆనందరావు ఫరెవర్ పిక్చర్సు గురించి ఉద్ఘాటించేడు. ఆ ప్రేక్షక మహాశయుల లో కొత్తరకమైన టేస్టు అభినందించక తప్పదు.

అకస్మాత్తుగా ఆనందరావు టాపిక్ మార్చేడు. వాళ్ళ రూమ్మేటు పైన దండయాత్ర ప్రారంభించేడు.

గుమాస్తాల్లోనూ 'రకాలు' లేకపోలేదుట. రెండొందలు పుచ్చుకునేవాడూ, తొంభై రూపాయలు సంపాయించేవాడూ ఇద్దర్నీ కలిపి

'గుమాస్తా' లనడం ఆనందరావుకి మంట. వాళ్ళ రూమ్‌మేటు రెండో రకం గుమాస్తాట. నాన్ గాగ్రిడ్యుయేటు. వచ్చే నాలుగు డబ్బుల్నీ జాగ్రత్తగా చూచి వాడుకోడం. (లేకపోతే చస్తాడా!) అవసరాలు సైతం వాయిదా వేయడం అతని లక్షణాలట. అతనితో తన స్నేహం — తన ఉత్సాహాన్నీ. పరుగులుతీసే తన సరదాలనీ చంపేస్తున్నదిట.

చెప్కొద్దూ - ఆనందరావుపట్ల నాకు చిరుకోపం కలిగింది. ఇంత తలతిక్కగా మాటాడే మనుషులమీద నాకు గౌరవ ముండదు. అతను చెప్పేది శ్రద్ధగా వింటూ రెండో సిగరెట్టుని ఆఫర్‌చేసిన రాముడి మీదనూ కోపమొచ్చింది.

మొదట్నుంచీ ఒక పద్ధతికి అలవాటుపడిన వాడిని. నా అభిప్రాయాలు కుండ బద్దలుకొట్టినట్టు మొహం ముందు చెప్పగల నేర్పు లేదు నాకు. అది పిరికితనమన్నా ఒప్పుకోను.

వాళ్ళ మాటలు పూర్తయిన తర్వాత ఇద్దరూ మాట్నీకి ప్రయాణమయ్యారు. నేను రాలేకపోతున్నందుకు చాలా చింతిస్తున్నట్లు ఆనందరావు స్వయంగా సెలవిచ్చాడు.

ఇద్దరూ సినిమాకి వెళ్ళిన తర్వాత ఆనందరావు రూమ్‌మేటుని చూడాలనిపించింది. కానీ ఆ తలుపుకి తాళంవేసి వుంది.

మర్నాడు ఆఫీసునుంచి వచ్చే వేళకి ఆనందరావు వాళ్ళ గుమ్మం ముందు కుర్చీలో కూర్చుని ఆకాశంలోకి చూస్తున్నాడు వెంకటరెడ్డి!

ఆకాశంలోకి చూస్తోన్న (లేక) రెండు చేతుల్లోనూ తలను దాచుకుని విచారిస్తోన్న (లేక) శూన్యంలోకి చూపు నిలిపిన.... గుమాస్తాలు చదివినా, చూసినా నవ్వుగా వుంటుంది. క్షమించాలి. భవదీయుడిని మినహాయించి మాట్లాడటం అన్యాయమే మరి.

వెంకటరెడ్డి గాగ్రిడ్యుయేటు కాని కుర్రవాడు! సినిమాలూ, సర

దాలూ యిష్టంలేని యువకుడు! తొంభై రూపాయలకు ఊడిగంచేస్తున్న ఒకానొక నెలుసు! ఆనందరావు ఆనందాన్ని ఖూనీచేసిన హంతకుడు!

ఎదటివాడు తెలీకముందు అతని గురించిన ఆలోచనలు వేరు. పరోక్షంగా తెలిసిన తర్వాత కలిగే అభిప్రాయం వేరూను. ఎంత వద్దనుకుంటూన్నా రెడ్డి పైన ఆనందరావు ఉపన్యాసం గుర్తుకొస్తూనే వుంది.

నా గది తలుపు తీస్తుండగా రెడ్డి నావైపు చూసేడు. పలుకరింపు చిహ్నంగా చిన్నగా నవ్వేను. అతనూ నవ్వేడు. అతని నవ్వులో 'కళ' లేదు. కాదంటే అతన్ని మరో కోణంలోంచి చూడటం నాకు చాతకానట్టు చెప్పాలి.

గదిలోకి వెళ్ళాను. బట్టలు మార్చుకొని మళ్ళా బయటకొచ్చాను. ఈసారి రెడ్డి చూపు మేడంత యెత్తు పెరిగిన బాదంచెట్టుపైన నిలిచి వుంది. ఆ ఆకులమాటున దేన్నో వెతుకుతూ ఆలోచిస్తున్నాడు. నవ్వుకున్నాను మళ్ళీ.

అతనేమి ఆలోచిస్తుంటాడు? గ్రాడ్యుయేటు కాలేకపోయేనేమిటానా? తనకొచ్చే తొంభై రూపాయలు చాలడం లేదేమాననా? రెండొందల జీతగాళ్ళ జీవిత మెట్లుంటుందనా? దేన్ని గురించి ఆలోచిస్తున్నాడు?

బాగుంది ఎంతైనా. రెడ్డిని చూస్తుంటే నాకూ ఆలోచనలు వచ్చేస్తున్నాయి. నేనూ ఓ కుర్చీ తెచ్చుకుని మా గదిముందు వేసుకుని ఆకాశంలోకి—ఈ ఆలోచన రాగానే ఫకాలున నవ్వేశాను.

రెడ్డి ఉలిక్కిపడి నవైపు చూశాడు. ఆ చూపులో తత్తరపాటు వున్నది. అతనలా చూస్తున్నప్పుడు సిగ్గుపడిపోయాను. ఎందుకలా నవ్వేనా అని బాధపడ్డాను.

క్షణాల తర్వాత అతనే పలుకరించేడు.

"మీదే ఊరండీ?"

గతుక్కుమన్నాను. రెడ్డి చాతుర్యం అర్థమైంది. విశాఖపట్టణం నుంచి వచ్చేరా అని అడగడం పాతపద్ధతి. అదేగా అతని అభిప్రాయం? కోపమొచ్చింది. కానీ అణచుకుని మాఊరు పేరు చెప్పాను.

"అదృష్టవంతులు" అన్నాడు రెడ్డి.

"ఎందుకనిట?"

"చాలా దగ్గర్లో వున్నారు"

తెలూపాను.

"మీఊరు చెప్పారు కాదు" అడిగేను.

అతను చెప్పేడు. కానీ ఆపేరు నే నెప్పుడూ వినలేదు. జాగ్రఫీ చదివినా అంత తొరగా తెలిసేపేరు కాదది. చిత్తూరు జిల్లాలో మారుమూల కుగ్రామం.

ఆ రోజుకి అతన్తో మాటాడింది అదేను.

నా కీ విధంగా పరిచయమైన రెడ్డి చాలా కొద్దిరోజుల్లో ఆప్తమిత్రుడై పోయాడు. అతను చాలా ఆహ్లాదకుడు. అతని ఆలోచనలు చిత్రంగా వుంటాయి. వినేవాడు రెడ్డిమీద జాలి చూపించగలడు. రెడ్డి కలలుకనే మనిషి. ఆ కలల్ని తను భద్రపరచుకోడు. గుండెల్లో దాచుకోడు. ఎదటి వాడికి విపులీకరించి చెబుతేనేగాని తృప్తి కలగ దతనికి.

రెడ్డిని గమనించిగానీ,నా మొహమాటంవల్లగానీ నే నతని కలలు వింటూ జాలి చెందేవాడని. అదే మా రాముడు గానీ, ఆనందరావుగానీ వింటే రెడ్డిని గేలిచేసి వుండేవారన్నది నిజం.

ఒకొక్కనాడు అనేవాడు రెడ్డి—

"ప్రేమించడం నాకు చాతనవుతుం దంటారా? అసలు ఆ లక్షణాలు నాలో వున్నాయంటారా?" అని. నవ్వేవాడిని. 'తమ్ముడూ! ఇదే మరోడిని అడుగుతే వాడు నిన్ను మోసేయగలడు జాగ్రత్త' అని చెప్పేందుకు నా నోరు ఆడేదికాదు.

ఒక్కోనాడు అనవసరంగా బోరు కొట్టేసేవాడు. సొంత ఊరుని ప్రేమించని మానవుడు యీ ప్రపంచంలో ఎవడున్నాడు ? కాబట్టి, తరచూ మా ఊరు వెళ్ళి వస్తుండేవాడిని. అమ్మా, నాన్నా, ప్రాణంపెట్టే మిత్రులూ, జ్ఞాపకంలోంచి చెరిగిపోని మా కాలేజీ—నాయరు బడ్డీకొట్టు, సినిమా థియేటర్లూ, బజారు ఇవన్నీ నాకు చాలా యిష్టమైనవని చెబితే ఎవడూ ఆశ్చర్య పోనక్కర్లేదు. కానీ అదేమి ఖర్మమో మా ఊరి గురించి ఎన్నిమాట్లు చెప్పినా, రెడ్డి మళ్ళా కొత్త ఊరు గురించి అడిగినట్టు అడుగుతూండేవాడు. ఒకమాటు, రెండుమాట్లు, పదిమాట్లయినా అతని పద్ధతిలో మార్పు రాలేదు. నేను మా ఊరు వెళ్ళి వచ్చిన ప్రతీ తడవా 'సముద్రం బాగుంటుందా ? సరుగుడు చెట్లు ఎలా వుంటాయి ? మీ కా ఊళ్ళో బ్రహ్మాండంగా తోస్తుంది కదూ ?' ఇలాంటి డిటో ప్రశ్నలు వేస్తూండేవాడు. కొత్తలో అవుతే చెప్పడానికి నాకూ సరదాగానే వుండేది గానీ రాను రాను చిరెత్తుకొచ్చేది. ఏమిటీ చచ్చు పరామర్శలు ? సముద్రం బాగోక ఎలా వుంటుంది? అక్కడ సరుగుడు చెట్లు రోజు రోజుకీ మారుతూంటాయా ? అక్కడికీ రెడ్డిని మా ఊరికి ఆహ్వానించేను. కానీ రాలేనన్నాడు. అకాడికి ఈ విషయసేకరణెందుకు ?

ఇదీ నా ప్రశ్న. ఒకనాడు తెగించి అడిగేశాను.

"మా ఊర్ని గురించి చెప్పడానికి నాకేం అభ్యంతరం లేదు గానీ, రోజూ అడిగిందే అడగడం, చెప్పిందే చెప్పడం నాకేం నచ్చదు. పోనీ మా ఊరు రమ్మంటే రారు. ఏమిటి మీ ఉద్దేశం ?" అని.

అతను ఖంగున జవాబు చెప్పలేదు గానీ, కాసేపు మౌనంగావుండి ఆ తర్వాత కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. అదిరిపడ్డాను. క్షమించమని అడిగి మా రూములోకి వచ్చేశాను.

రెడ్డితో నా స్నేహం రాముడికి నచ్చలేదు. సమయం వచ్చినప్పు

రల్లా నా కి విషయమే హెచ్చరిస్తూ వుండేవాడు. వాడి సలహాని కొట్టి పారేయడం అలవాటైంది నాకు.

మళ్ళా రెండురోజుల వరకు రెడ్డి నాకు కనుపించలేదు. కొంచెం బాధగానే వున్నది నాకు. ఒకనాడు గాంధీనగరం సెంటర్లో దాదాపు సాయంత్రిం ఆరున్నర సమయాన రెడ్డి పాత పుస్తకాల దగ్గర నించు న్నాడు. అతని దగ్గరికి వెళ్ళేను. పలుకరించేను. కనుపించడం లేదేమని అడిగేను. అతని జవాబు విని ఆశ్చర్యపోయాను. అతనన్న దిది :

"నిజం మాష్టారూ ! నేను మిమ్మల్ని విసిగిస్తున్నాను. చాలా అన వసరమైన విషయా లడిగి మిమ్మల్ని కష్టపెట్టేను. ఇంకా నా పద్ధతి మార్చుకోవాలి. అందుకే బాగ రాత్రి పదేంతవరకూ ఆఫీసులోనే గడి పేస్తున్నాను. కానీ....అక్కడగూడా నన్ను అపార్థం చేసుకుంటున్నారు మాష్టారూ ! ఆఫీసులో కూర్చునేది ఆఫీసరు మెప్పు సంపాయించాలని కాదు"

అతని భుజం తట్టి అన్నాను.

"మీరు చాలా మంచివారు రెడ్డీ ! రండి. అలా పార్కులో కూర్చుందాం"

అప్పు డతని మొహంలో నిండిన ఆనందం నాకు బాగా జ్ఞాపకం. పార్కులో కొచ్చి కూర్చున్న తరువాత చెప్పాడు —

"మా ఊరు మీ ఊరంత అందంగా లేకపోయినా నాకూ మా ఊరంటే యిష్టమే. కానీ అది చాలా దూరం. బోల్డు ఛార్జీ లవుతాయి. పైగా మా యిల్లు నరకం. తెలిసిన వాళ్ళెవరూ నన్ను పలుకరించరు. అలాంటప్పుడు నేనెలా మా ఊరు వెళ్ళేది ? వెళ్ళినా నాకేం తోస్తుంది ? చెప్పండి మాష్టారు !"

నేనేమీ జవాబివ్వకపోయినా అతని పరిస్థితి ఊహించగలను. మళ్ళా అతనే అన్నాడు.

"మిమ్మల్ని చూస్తుంటే నాకు ఈర్ష్యం. ఎంచక్కా సరదాగా మీ ఊరెళ్ళి హాయిగా అక్కడ గడిపి తిరిగొస్తారు. మీరు మీ ఊరు గురించీ. మీ వాళ్ళని గురించీ చెబుతూంటే నాకు ఆనందంగా వుంటుంది"

పిచ్చిరెడ్డి! ఎంత పసివాడివయ్యా నువ్వు!

"నేను చాలా దురదృష్టవంతుణ్ణి మాస్టారూ! నాన్న లేడు. అమ్మ వుంది. మా అమ్మ యిప్పటికీ వాళ్ళవంచి చాకిరీ చేస్తుంది. మా అమ్మకి సుఖంలేదు. పెళ్ళికాని చెల్లెలూ. చదువుకోవాలనే కోరికున్న తమ్ముడూ. చెడిపోయిన అన్నయ్యా. అందరూ అన్నీ సమస్యలే. అన్నయ్య తాగుతాడు. జూదగాడు. వదిన్ని కొడతాడు. అమ్మని డబ్బివ్వమని బాధపెడతాడు. చెప్పండి మాస్టారూ! నే నెలా ఆ యింట్లో వుండను? అది యింటి విషయం. పోతే నా స్నేహితులు. వాళ్ళందరూ వ్రయోజకులు. పెళ్ళిళ్ళు చేసుకున్నారు. చదువుకునే రోజుల్లోనే నన్ను వెధవ అనేవారు. ఇప్పుడు వాళ్ళకి నే నెక్కడ కనిపిస్తాను?"

చాలు. రెడ్డి యింకేమీ చెప్పకపోయినా అత ననుభవించే నరకం నే నూహించగలను. అందుకే అతను కలలు కంటున్నాడు. అందుకనే అతను చిత్రమైన మనిషిలా, పిచ్చి మాలోకానికి 'నమూనా'గా కనిపించేడు.

ఆ రాత్రి రెడ్డిద్వారా మరో విద్డూరం విన్నాను. అతని రూములోంచి ఒక నెక్లెసు తీసుకొచ్చి చూపించేడు. ఎలా వుందని అడిగేడు. నిజానికది చాలా బావుంది.

"దీన్ని మా చెల్లి గురించి కొన్నాను. అతి కష్టంమీద సంపాదించిన ఈ ఒక్క వస్తువూ చెల్లి మెళ్ళో వేయడానికి నోచుకోలేక పోతున్నాను. ఈ నగ అన్నయ్య కంటబడితే....వొద్దు మాస్టారు. మాయింట్లో వాళ్ళెవరూ సుఖపడటానికి నోచుకోలేదు. అంతే. అన్నీ అలా జరగా

ల్సిందే. తప్పదు. నే నిక్కడ రెండు పూటలా భోంచేస్తున్నాను. మీలాటి మంచి స్నేహితుడితో కబుర్లు చెబుతూ కాలం గడుపుతున్నాను. నేను.... చాలా విషయాలు మరిచిపోవాలి. స్వార్థమైతే కావచ్చు గానీ మావాళ్ళ గురించి నే నసలు బాధ పడకూడదు"

పడుకున్నే ముందు రెడ్డి మాటలు గుర్తుకొచ్చేయి. ఎదటివారి గురించి తన బ్రతుకుని పాడుచేసుకోడానికి ఎవ్వడూ ఒప్పుకోడు. తన లాంటి వాళ్ళ ఓ పక్కన దూమ్మంటూ కాలాన్ని నెట్టేస్తుంటే జీవిత మనే ఈ పరుగు పందెంలో అవకాశముండి కూడా ఓడిపోడానికి రెడ్డే కాదు — ఎవ్వడూ ఒప్పుకోడు.

* * *

ఒంట్లో బాగుండక వారం రోజుల సెలవుమీద మా ఊరు వెళ్ళాను. తిరిగొచ్చిన మొదటిరోజు. ఆఫీసునుంచి రావడంతోనే రెడ్డి కోసం చూశాను. గది తలుపులు తీసి వున్నాయి గానీ గదిలో రెడ్డి లేడు. గదిముందు వుండవలసిన కుర్చీ కూడా లేదు. వారం రోజుల్లోనే రెడ్డి అలవాట్లు మారిపోతాయని నాకేం తెలుసు ?

డాబామీద పిట్టగోడ వారగా కుర్చీలో కూర్చున్న రెడ్డి పిలుపు విని తలెత్తి చూశాను. రెడ్డి మొహం కలకలలాడుతోంది. అతను టెరిలిన్ షర్టులో హుందాగా వున్నాడు. అతని వేళ్ళ మధ్య సిగరెట్టు వెలుగు తోంది.

అతని దగ్గరకు వెళ్ళేను.

అతను లేచి నిలబడ్డాడు. పిట్టగోడ వారగా నించున్నాడు. ఆ నించోడం ఠీవిగా వుంది. సిగరెట్టు అందంగా కాల్చుతున్నాడు. మును పెప్పుడో పోగొట్టుకున్న అలంకరణ తాలూకు విశేషాలన్నీ అతన్ని ప్పుడు ఆవరించినట్టున్నాయి.

"హౌ ఆర్ యూ సార్ !" అన్నాడు రెడ్డి.

ఆ ఏకమైన పరామర్శకి కొంచెం బెదిరాను. స్వస్థత చిక్కినట్టు చెప్పేను.

"నిలబడే వున్నారు; కూర్చోండి. హేవ్ యువర్ సీట్"

"పర్వాలేదు. మీరే కూర్చోండి"

"ఇందాకట్నుంచీ కూర్చునే వున్నాను. ఐ లైక్ టు స్టాండ్ ఓన్లీ; మీరు కూర్చోవాలి"

రెడ్డికంటే తాగినవాడు నయమనిపించింది. కూర్చోక తప్పింది కాదు. ఈలోగా అతను సిగరెట్టు దమ్ము ఒకటి పీల్చాడు. పొగని ఆకాశంవైపు వదిలి, పెదాలను అందంగా నాలికతో తుడుచుకుంటో—

"మీతో చాలా విషయాలు మాటాడాలి! రేదర్ చెప్పుకోవాలి"

సరిగ్గా నే నూహించిన విధంగానే ఈ మార్పు కేదో కథ వున్నదన్నమాట!

అతను చెప్పాడు.

"పది రోజుల క్రితం ఒక అమ్మాయిని చూసేను" మాట నాపి నా దగ్గరిగా వచ్చి "చాలా అందమైన పిల్ల. వెరీ బ్యూటిఫుల్. ఒంటరిగా ఇంకా గడపలేను. నాకు పార్టనర్ కావాలి. మా యిద్దరికీ మరెవ్వరితోనూ ప్రమేయం వుండరాదు. ఎన్నాళ్ళనుంచో నాలో మెదులుతూన్న యీ కోరికకి పది రోజుల క్రితం ఓ రూపం ఏర్పడింది. రెండు రోజుల క్రితం ఓ నిశ్చయానికి వచ్చాను. ఐ వాంట్ టు మేరీ దట్ గర్ల్"

ఇన్నాళ్ళూ మా రాముడినీ, ఆనందరావునీ చాతకాక ద్వేషించానేమో! రెడ్డిలాటి మనుషులేం చేయాలి? రెడ్డి కేవలం కలలుకనే మనిషే అనుకున్నాను. కార్యసాధనకి నడుం కట్టేంత ధీమా అతనికి లేదనీ అనుకున్నాను.

"లేవండి" అన్నాడు పొలికేకతో రెడ్డి. లేచాను.

నా మొహంలో చూపు నిలిపి చాలా సీరియస్‌గా చెబుతోన్నట్టు—

"మనముందు మేడలో రెండో కిటికీ వుంది. అంతే నావీపు తిన్నగా నన్నమాట. చూశారా. ఆ కిటికీ వూసల్లోంచి చూస్తే మీకో చక్కటి అమ్మాయి కనిపించింది కదూ. ఆ పిల్లే! ఆమెనే నేను పెళ్లాడ బోయేది. సరిగ్గా చూసి మీ సలహా చెప్పండి" అన్నాడు రెడ్డి.

సభ్యత కాదని తెలిసినా చూడటం జరిగింది. ఆమె ఆకారం కని పించగానే తల దించుకున్నాను. అలాటి పరిస్థితిని రెడ్డి నాకు కలుగజేసి నందుకు కొంచెం కోపమూ వచ్చింది. అందుకే అన్నాను.

"మిస్టర్ రెడ్డీ! ఇవన్నీ మీ సొంత విషయాలు. పైగా నాకీ ప్రేమ విషయాల్లో బొత్తిగా అనుభవంలేదు. నాలాటి వాడి సలహా లడ గడంగానీ. నాతో మీ ప్రేమ కథలు చెప్పడంగానీ యిష్టంలేదు నాకు. ప్రేమ మినహా మరేదైనా మాటాడాలనుంటే నన్ను పలుకరించండి. లేదూ....గుడ్‌బై" నాలుగు మాటలూ వడ్డించి డాబా దిగి వచ్చేశాను. అయినా రెడ్డి దిగలేదు.

రెడ్డి వ్యవహారం యిలా తయారయ్యింది. పోతే మా రాముడ్ని గురించి — ఎప్పుడూ నవ్వుతూ. పేలుతూ వుండే నిక్షేపంలాంటి కుర్రాడు బెంగతో చస్తున్నట్టు. సినిమాలూ సరదాలూ మాని రూములో కూర్చుని గోళ్ళు గిల్లుకుంటున్నాడు. అదేమనడుగుతే సమాధానం రాదు. నన్నే కాదు. అతని జాతిమనిషి ఆనందరావుని గూడా చాలామాట్లు నిరుత్సాహ పరిచాడు. ఆఫీసూ. గదీ ఈ రెంటినీ అంటిపెట్టుకుంటున్నాడు రాముడు.

ఒకనాడు రూము కొచ్చేసరికి రాముడికీ, రెడ్డికీ మధ్య తగాదా తారస్థాయిలో వుంది. ఇద్దరూ ఒకర్నొకరు ఇంగ్లీషులోనూ,మధ్య మధ్య తెలుగులోనూ తిట్టుకుంటున్నారు. రాముడు నన్ను చూచి గబగబా మా గదిలోకి వచ్చాడు.

"ఈ గదిని మనం వెంటనే ఖాళీ చెయ్యాలి" అన్నాడు.

బిత్తరపోయాను.

"నీకే చెప్తూంట....ఈ గదిని ఖాళీ చేయాలి. అదీ యిప్పుడే ఈ క్షణమే.మళ్ళా మనం పాత గదిలోకి పోదాం. అన్నీ మాటాడే వచ్చాను. తొరగా తెములు"

నాకు చిరెత్తుకొచ్చింది. ఏమిటి వీడి వరస ?

"నీకేం మతి పోలేదుగదా రాముడూ? మళ్ళా ఏ మొహం పెట్టుకు పాత గదికి పోతాం ? పైగా ఆ యింటావిడ రాక్షసి గూడాను"

"అయినాసరే. నామాట విని వచ్చేయ్"

"నేను రాను. నీ యిష్టమొచ్చినట్టు తలూపడానికి నేను గంగిరెద్దును గాను"

"అంతేనా ?"

"అంతే"

ఆ రాత్రి వాడు నాతో మాటాడలేదు.భోజనానికి వెళుతున్నప్పుడు కూడా పిలువలేదు. ఆరోజు మొదలుకొని నాలుగు రోజులు అదే వరుసగా మౌనవ్రతం పాటించేడు రాముడు. రాముడికీ, రెడ్డికీ తగాదా ఎందుకు వచ్చిందో ? ఏ కారణంవల్ల రాముడు గది మారిపోదామని అంటున్నాడో ? అటు రెడ్డినీ గానీ, ఇటు రాముణ్ణి గానీ అడగలేక పోయాను.

ఒకరోజు థియేటర్లో ఆనందరావు ఒక్కడే అగుపించాడు. ఇంటర్వెల్లో టీ తాగుతూండగా అతనే పలుకరించేడు. మాటల మధ్యలో రాముడు రెడ్డిల విషయం కదిలింది. అతను బిగ్గరగా నవ్వి మెల్లిగా అన్నాడు.

"వాళ్ళ మధ్య లవ్ ఎఫైర్లో పడ్డారు మాస్టారు! రెడ్డికి ప్రేమించ

దం తెలీదనీ, అందు కతను తగదనీ మీహాడి అభిప్రాయం. నువ్వేం బోడి సలహా లివ్వక్కర్లేదని రెడ్డి. ఐతే ఫార్సులేండి"

రెడ్డి వ్యవహారంలో రాము డెందుకు తలదూర్చా లసలు ? ఆ రాత్రి పడుక్కునేముందు అదే అడిగాను రాముడ్ని. అతను వినిపించుకో నట్టు తలని అటువైపు తిప్పుకున్నాడు. కొంచెం బాధపడ్డాను.

"మనం పసిపిల్లలం కాదు రాముడూ ! ఇలా ఎన్నాళ్ళని నాతో పంతం కడతావ్ ? నే చేసిన తప్పేమి టసలు ?"

"ఎవరైనా సరే నా మాట వినకపోతే నాకు కోపం"

"అవతలివాళ్ళా నీలాటివాళ్ళేనని ఎందు కనుకోవు ?"

"అనుకోను"

నవ్వొచ్చింది. నవ్వేశాను.

రాముడు లేచి కూర్చున్నాడు. నావైపు తీక్షణంగా చూస్తూ—

"నీకేం తెలీదసలు. రెడ్డి ఎంత అల్లరి చేస్తున్నాడో నువ్వేం పట్టించుకోడంలేదు. వాడి వెకిలిచేష్టలు చూస్తుంటే నాకు తల తిరిగి పోతుంది. అందికే నా కి రూములో వుండ బుద్ధిపుట్టడంలేదు"అన్నాడు.

రాముడ్ని మొదట్లో అర్థం చేసుకోలేక పోయినందుకు చింతిం చేను. మళ్ళా ఏమీ మాటాడలేదు.

ఆ ఉదయం రాముడు వాళ్ళ బేంక్‌నుంచి ఫోన్ చేశాడు. వాడికి బదిలీ అయిందిట. ఒంగోలు వేశారుట. రాత్రి బండికి వెళుతున్నాట్ట.

పిడుగుపడి నట్టయింది నాకు. ఏడుపు వచ్చింది.

ఒకగంట పర్మిషన్ తీసుకుని పెందరాళ్ళే రూముకొచ్చేను. పుట్టెడు దిగులు కడుపులో పెట్టుకుని. రూము దగ్గర అంతమంది జనాన్ని చూసే సరికి భయం కలిగింది. విషయం తెలిసి విస్తుపోయాను. రెడ్డి రాసిన ప్రేమలేఖని పట్టుకుని నడివీధిలో అతని పరువు తీసేస్తున్నారు జనం.

అతను తలొంచుకు నిలబడి వున్నాడు. నన్ను చూసీ చూడనట్టు నటించేడు. ఎవరో ముసలాయన రెడ్డినీ, అతని వ్యక్తిత్వాన్నీ కడిగిపారేస్తున్నాడు పదుగురిలోనూ.

గదిలోకి వచ్చి తలుపులు వేసుకున్నాను. ఒక గంట తర్వాత వాతావరణం చల్లబడ్డది కాబోలు, వీధిలో మాటలు తగ్గేయి. కిటికీలోంచి కిందికి చూశాను. రెడ్డి ఒక్కడూ నడుచుకుంటో వెళ్ళిపోతున్నాడు. ఎందుకో అతనిమీద జాలి కలిగింది.

పనిమనిషి తలుపు తడితే తలుపు తీశాను. ఆమె చాలా చెప్పింది. రెడ్డి ప్రేమించిన పిల్ల మొన్నీ మధ్యనే వాళ్ళ చిన్నాన్న గారింటికి వచ్చిందిట. పెళ్ళయిన రెండో నెలలో ఆమెకి వైధవ్యం ప్రాప్తించిందిట. ఆ పెళ్ళి గూడా ప్రేమించి చేసుకున్నదిట. మనసు కుదుటబరచుకునేందుకు సొంత ఊరు వదిలి చిన్నాన్న గారింటికి వచ్చిందిట.

రెడ్డి మొదటి ప్రేమ యిలా తగులడినందుకు, నలుగుర్లోనూ అతను నగుబాటు పాలైనందుకు ఓ పక్క కోపమూ, మరోపక్క జాలీ కలిగాయి.

రాత్రి ఏడు గంటలకు రాము వొచ్చాడు. పెట్టే బేడా సర్దుకున్నాడు. వాడివెంట స్టేషనుకి వెళ్లేను. స్టేషను దగ్గర పడుతుందనగా అన్నాను.

"నీకిలా అకస్మాత్తుగా ట్రాన్స్ఫరవడం నాకు విచారంగా వుంది రాముడూ!"

"ఈ బదిలీకి ఒక కారణం నువ్వే!" అన్నాడు.

ఉలిక్కిపడ్డాను.

"అవును. పాత రూములో చేరితే నాకు ఒంగోలు ప్రయాణం తప్పందేది కాదు. పాత రూముకి రానన్నావ్. ఒంగోలుకి ట్రాన్స్ఫర్ కోరాను"

"కాదు. నువ్వేదో దాస్తున్నావ్. దీన్లో నాదేం తప్పులేదు. రాము మారడంలేదనే చిన్న కారణాన్ని ఆధారం చేసుకుని ఊరొదిలి వెళ్ళిపోయేంత పిచ్చివాడవు కాదు నువ్వు" అన్నాను.

"నువ్వో కారణ మన్నానేగాని, కేవలం నువ్వే అనలేదు. రెండో కారణం అదిగో ఆ పిల్ల. రెడ్డి ప్రియురాలు"

అర్థంకాలేదు నాకు.

"పెళ్ళిచూపుల్లో ఆమెను చూసేను. నన్ను చేసుకోడాని కిష్టపడలేదామె. మొహం ముందే ఆ మాట అన్నది.నన్ను అవమాన పరచింది"

"ఇప్పుడామె విధవట. తెలుసా ?"

"తెలుసు. అందుకే ఆమెను రోజూ చూడలేక ఛస్తూండేది. ఆమెను చూస్తే నాకు కోపం, జాలి, దయాను. రెడ్డి ఆమెను ప్రేమిం చాడు. అతడు ఫూల్. అవతల వాడిని అర్థం చేసుకునేందుకు ప్రయత్నించ డసలు" అన్నాడు రాముడు ఉద్రేకంగా. వాడి కనుకొలకుల్లో నీళ్ళు నిలిచాయి.

స్టేషన్ చేరుకున్నాం. రైలొచ్చింది. రాము దెక్కాడు. చివరి మాటగా అన్నాడు—

"బెజవాడలో మన చివరోజులు చేదుగా గడిచేయి. మరిచిపో. వెనకటి మన తియ్యటి స్నేహాన్నే గుర్తుపెట్టుకో. నీలాటి మంచి స్నేహితుడ్ని వదిలి దూరంగా పోతున్నానంటే నాకు సరదా కాదు. నా మనసూ అలాటిది కాదు. నీ మాట వినివుంటే, ఆ పాత గదిలోనే వుంటే, ఆమె నాకు కనిపించేదీ కాదు. రెడ్డి నాకు తెలిసేవాడూ కాదు. నేను ఒంగోలూ వెళ్ళేవాడిని కాదు. పోనీలే.... అయ్యిందేదో అయ్యింది.నన్ను క్షమించు"

రైలు కదిలింది. చెయ్యూపుతూ నిలబడ్డాను.

స్టేషన్నుంచి వస్తూ దార్లో భోజనం ముగించి మరీ రూము

కొచ్చాను. రెడ్డి గది తలుపులు బార్లా తెరిచి వున్నాయి. ఆనందరావు రెడ్డి నేదో అంటున్నాడు. గుమ్మం దగ్గిరికి వెళ్ళాను. ఆనందరావు నన్ను చూచి నిలబడ్డాడు. రెడ్డి హోల్డాయిమీద బోర్లా పడుకున్నాడు. ఆనందరావు అన్నాడు.

"రెడ్డి తాగొచ్చేడు. నా కేవిటో భయంగా వుంది. నే నింకా భోజనం చేయలేదు. నా కేం తోచకుండా వుంది. మీ రిక్కడ కూర్చోండి. భోంచేసి యిప్పుడే వస్తాను"

నా జవాబైనా వినకుండా ఆనందరావు వెళ్ళిపోయాడు.

అయిదు నిముషాలపాటు గుమ్మం దగ్గరే నుంచున్నాను.

మతివున్న మనిషి తాగుతే అలవాటంటారు. బెదిరిపోయిన మనిషి తాగుతే అతని పిరికితనానికి ప్రకృటి మందంటారు. ఏమైనా తాగేవాళ్ళవి పూల్పని చాలామంది అంటారు. రెడ్డి తాగాడు. మరోప్పుడైతే అస హ్యించుకునేవాడినే.

అతని దగ్గరిగా వెళ్ళాను. అతన్ని తట్టాను. రెడ్డి నావైపు చూసేడు. మరుక్షణమే ఘొల్లున ఏడ్చేశాడు. నా రెండు చేతులూ పుచ్చు కున్నాడు.

"క్షమించండి మాస్టారూ! తాగేను. మీతో మాటాడటానికి అర్హత లేదు.... పేర్మించడం చాతకాదు నాకు....గుండెల్ని కోసే అవమానం పొందేను....చివరికి....చెల్లెలికోసం కొన్న నగనికూడా తెగనమ్మి.... నా స్వార్థానికి. నా సరదాలకి....

అతని మాటల్ని అతని దుఃఖం మింగేసింది. పసిపిల్లవాడిలా, గుండె లవిసేలా ఏడుస్తున్నాడు. ఆ ఏడుపుకి అంతంలేదు.

జీవితంలో మొదటిసారిగా తాగుబోతులమీద జాలి కలిగింది.

* * *

ఉదయం పనిమనిషి చెప్పింది - రెడ్డి ప్రియురాలూ, వాళ్ళ చిన్నాన్నగారూ ఆ యిల్లు ఖాళీ చేశారుట.

ఆనందరావు చెప్పాడు - తనకో చీటీ రాసి ఆ అర్ధరాత్రి ఎక్కడికో వెళ్ళిపోయాడుట రెడ్డి!

నా గుండెల్లో బరువు నిలిచింది. అప్పటికప్పుడే పాత గది కుదుర్చుకునేందుకు 'రాక్షసమ్మ'గా రింటికి బయలుదేరేను.

o——o

# శ్రీమతి రాధమ్మ

రాధమ్మ అభిమానం పూర్తిగా దెబ్బతిన్నది!

సుబ్బయ్యశెట్టి అంతలేసి మాటలంటుంటే వారు కాబట్టి సహించి ఊరుకున్నారు. అదే మరొహళ్ళయితే శెట్టి అహంకారానికి, అతని తొందరపాటుకీ తగిన బుద్ధి చెప్పి వుండేవారు.

మంచితనమూ, సహనమూ వారిలో మూర్తీభవించాయి గనక, సౌమ్యులు గనక బ్రతికిపోయాడు శెట్టి.

తన పిచ్చిగానీ—ఆలోచించి చూస్తే శెట్టివల్ల నేరమేమీ కనుపించదు. డబ్బు యివ్వవలసినవాడు అప్పిచ్చినవాడికి లోకువేగదా! అనుకున్న వాయిదాకి అప్పు తీర్చకపోతే అవతలి వాళ్ళు నోరు మూసుకూర్చోడానికి అదేమైనా ధర్మం చేసిన పైకమా? కాదుగదా! అతనూ చెమటోడ్చి సంపాదించినదే నాయె.

ఎవర్ననుకుని ఏం లాభం? మాట పడవలసిన రోజొచ్చింది గనక మాటపడ్డారు.

రాధమ్మకి భర్తమీద జాలి వేసింది.

1064, జనవరి — భారతి

సమస్య లన్నింటినీ ఆయన గుప్పెట్లో దాచిపెట్టుకున్నారు. సంసారాన్ని గుట్టుగా సాగించేరు. ఇంట్లో ఏనాడూ గూడా 'ఇది లేదనే' వదానికి తావివ్వలే దాయన। బాబు చదువూ, సావిత్రి పెళ్ళి, రాజు బి. ఏ. అతని పెళ్ళి....ఇవన్నీ ఆయ నొక్కరి చేతిమీదుగానే జరిగాయి. ఎలా జరిగాయి?

తలుచుకుంటూంటే రాధమ్మకి భయంగా వుంది. అందుకే వారంటే రాధమ్మకి జాలీ, కొండంత గౌరవమున్నూ।

చివరి కీ నాటికి శెట్టికి చులకనయ్యారు.

రాధమ్మ కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

"ఇదిగో నిన్నే। నా పెన్నేమైందో కనిపించడం లేదోయ్?" రాఘవరావు భార్యని పిలిచేడు.

ఆయ నప్పుడే శెట్టి మాటలు మరిచిపోయేరు కాబోలు।

"వాడు....బాబు పట్టుకుపోయేదేమో।రాత్రి అడిగేడు కూడాను.... నిన్నే ఒకమాటిలా రావోయ్।"

రాధమ్మ అతని గదిలోకి వెళ్ళింది.

"రాత్రేమయ్యిందో తెలుసా? వాడి పెన్ను పోగొట్టుకున్నాడు కాబోలు - 'ఒకమాటు మీ పెన్నిస్తారూ।' అని అడిగేడు బాబు. లేదు పొమ్మని కసురుకున్నాను. ఇది అదను కాదనుకున్నాడో యేమో। ఉదయం కొట్టేసి వుంటాడు. ఇది వాడిపనే"

"అనవసరంగా వాడినెందు కనుమానిస్తున్నారూ। ఎక్కడ పెట్టారో జాగ్రత్తగా వెదికి చూడండి" అన్నది రాధమ్మ.

"రెండు రోజుల క్రితం వాళ్ళ రాజు బాబాయిని పెన్ను కొనిపెట్టమని అడిగేడుట గూడాను" తన అనుమానాన్ని బలపరుచుకుంటో అన్నాడు రాఘవరావు.

రాజు పేరు వినగానే రాదమ్మకి కోపం వచ్చింది.

"అతని ఖర్చులు అతనికే చాలవుగానీ, వీడికో పెన్నుగూడా కొనిస్తాడా ఖర్మం"

"ఊఁ.....సర్లే....ఇంతకు నా పెన్నేమయ్యిందో...." రాఘవరావు మాట పూర్తికాలేదు. లక్ష్మి గుమ్మం దగ్గర నించుంది. ఆమె చేతిలో పెన్నూ వుంది.

"సచ్చారే....నీదగ్గ రున్నదా!" అన్నాడు రాఘవరావు నవ్వుతో.

"ఉత్తరం రాద్దామని మీ టేబిల్‌మీద పెన్నుంటే తీశాను" అన్నది లక్ష్మి.

"చూశావుగా లక్ష్మి, మీ బావగారి హంగామా! ఏమి తెలుసుకోకుండానే బాబుని తిట్టేశారు"

"ఏమిటోయ్ నీ బడాయి! వాడికి పెన్నుతో అవసరం గనక, వాడేమైనా తీశాడేమో అన్నాను. ఇది తప్పా, నువ్వు చెప్పమ్మా!"

లక్ష్మి ఏమీ మాటాడలేదు. పెన్నిచ్చి వెళ్ళిపోయింది.

కోటు తొడుక్కొంటూ భార్యతో అన్నాడు రాఘవరావు.

"ఏమిటోయ్! ఆపిల్ల అలాగున్నదీ?"

"............"

"రాజుగాడు ఏమైనా అన్నాడా? అవునవును. నేనూ గ్రహిస్తూన్నాను. ఈ మధ్య వాడు బాగా మారిపోయాడు. ఆపిల్ల గురించి ఏమీ పట్టించుకోడంలేదు"

"షికార్లూ, సరదాల్తో అతనికి తీరుబడి వుంటేగదూ!"

"చాల్లే ఊరుకో"

"ఒక విధంగా పాడుచేసింది మీరు. తల కెక్కించుకూర్చుంటే అతనికి ఇంటి బాధ్యతలేం తెలుస్తాయి? ఉద్యోగం వచ్చి సంవత్సరమైనా, ఒక్క కానీ ఇంట్లో యిచ్చిన పాపాన పోలేదు"

"మొదలెట్టావ్ డబ్బు గొడవ"

"ఆ శెట్టి...."

"రాధా !" అతనికి కోపం వొచ్చింది. "నీకేమైనా మతి పోతోందా ? ఇలాటి విషయాలు వాడి చెవిని పడగూడదు. వాడు వట్టి అర్భకుడు. కాకి నలుపూ, కాగితం తెలుపూ అనుకునే బాపతు. ఇవన్నీ వాడికి తెలిస్తే, మనసు పాడై పోయి పిచ్చాడిలా రోడ్లవెంట తిరుగుతాడు"

"పెళ్ళయింది. తండ్రి కాబోతున్నాడు. ఇంకెప్పటికండీ అతనికి బాధ్యత తెలిసేది ?"

"పోనీలే ! నే నున్నంతకాలమైనా వాడు విశ్రాంతగా బ్రతకనీ ! నీకు తెలీదు రాధా ! వాడు మా అమ్మకి ముద్దుల కొడుకు. సర్లే.... ఇప్పుడివన్నీ ఎందుకూ ? అన్నట్టు ఆ పిల్లని ఒక కంట కనిపెట్టు. ఉత్తమనిషి కూడా కాదు. అవతల వాళ్ళ పెద్దవాళ్ళు మనల్ని నమ్ముకున్నారు.... చూడూ - నే నొకమాట చెప్తా విను. రాజుకి ఒక నలుసు కలుగుతేనే గానీ వాడికి బాధ్యతలు తెలీవు. అంతవరకూ వా డిష్టమొచ్చినట్టు జరగనివ్వు. సరేనా? మరి నే నొస్తాను. వేళయింది. వస్తా మరి" హడావిడిగా వెళ్ళిపోయాడు రాఘవరావు. మళ్ళా రాత్రికిగాని ఇంటిమొహం చూడడు. ఆయనకు విశ్రాంతి లేదు.

రాధమ్మ నిట్టూర్చింది.

ఇలాంటి మంచి మనుషులకి దేవు డెప్పుడూ సాయంచేస్తాడు. ఇంత మంచితనం అందరికీ వుంటుందా ? రాధమ్మ తన అదృష్టానికి పొంగిపోని రోజు లేదు. కానీ....

రాధమ్మ వద్దనుకుంటూనే శెట్టిని లోలోన తిట్టుకుంది.

తన యింట్లో అడుగుపెట్టే నాటికి అత్తగారు మంచంమీద వున్నారు. రాజూ, సావిత్రి చిన్నపిల్లలు. పెళ్ళయిన రెండేళ్ళకి బాబు

పుట్టాడు. అత్తగారు కన్నుమూశారు. అప్పట్నుంచీ భర్తకి బాధ్యతలు పెరిగాయి. ఆయన కాబట్టి సరిపోయింది. మరొకాళ్ళయితే స్వార్థానికి లొంగి సావిత్రినీ, రాజునీ అన్యాయంచేసి వుండేవారు.

సావిత్రికి పెళ్ళి చేయడంతో ఒక పెద్ద బరువు దించుకున్నట్ట యింది. రాజు బి. ఏ. పాసయ్యాడని తెలీడంతో రాధమ్మ ఉబ్బి తబ్బిబ్బ యింది. భర్తకి కొంత బాధ్యత తీరినట్టు భావించింది. రాజుకి చక్కటి ఉద్యోగం వున్నఊళ్ళోనే దొరకడంతో ఆమె ఆనందం అవధుల దాటింది. అతని పెళ్ళి వైభవంగా చేశారు.

చెట్టంత తమ్ముడుండికూడా వారు శెట్టితో మాటపడ్డారు.

శెట్టి మాటలు మళ్ళా తలపుకి రాగానే ఆమె మనసు కలత చెందింది. తెప్పరిల్లింది. గబగబా దొడ్లోకి వెళ్ళింది. లక్ష్మి నీళ్ళు తోడ టం చూచి అదిరిపడింది రాధమ్మ.

"లక్ష్మి ! ఇలారా !"

కొంగుతో చేతులు తుడుచుకుంటో లక్ష్మి వచ్చింది.

"నీ కెన్నిసార్లు చెప్పాలి బరువు పనులు చెయ్యొద్దని ! మధ్యా హ్నం అక్కమ్మ వచ్చిన తర్వాత ఆ పనులన్నీ చూసు కుంటుందిలే"

లక్ష్మి మాటాడకుండానే లోపలికొచ్చి కూర్చున్నది. దొడ్డి తలుపు గడియవేసి తానూ లక్ష్మి దగ్గరకొచ్చి ఆమె పక్కనే కూర్చున్నది.

"రాజు కొడుకుని ఎప్పుడు చూస్తామా అని మా అందరికీ తొంద రగా వుంది లక్ష్మి !"

లక్ష్మి మౌనంగా తల దించేసుకున్నది.

"ఆయ నంటూంటారు—వాళ్ళింట్లో మొదటి కాన్పు మగపిల్లలే నుట" రాధమ్మ మెల్లిగా నవ్వుతూ అన్నది. అప్పటికీ లక్ష్మి ఏమీ మాటా డక పోడంతో, ఆమె మొహంలోకి తీక్షణగా చూచింది రాధమ్మ. తర్వాత ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుంటూ—

"నువ్వు గనక ఆడపిల్లని కన్నావో-అన్నదమ్ము లిద్దరి మొహాలూ వాడిపోతాయి. మా సావిత్రికి అందమైన కోడలు మాత్రం దక్కుతుంది. వాళ్ళ చెల్లెలి ఆశ తీరుస్తావో, అన్నదమ్ముల కోరికనే ఖాయపరుస్తావో ఒక్కమాట చెప్పు. వినాలని వుంది"

అప్పటికీ లక్ష్మిలో చలనం కనుపించలేదు. రాధమ్మ కొంచెం కలతచెందింది. దగ్గరసా జరిగి అడిగింది....

"ఈమధ్య నువ్వదోలా వుంటున్నావు"

"............"

"ఏమీ దాచుకోవద్దు"

"............"

"రాజు నిన్నేమైనా అన్నాడా ! చెప్పు నాతో. అతన్ని నే కోప్పడతాను"

"............"

"ఏడాది క్రితం అతను బాబులా చదువుకునే కుర్రాడు. ఇప్పటికి స్నేహితులనీ, సరదాలనీ వుంటాయిగదా. ఆ మాటకొస్తే రాజులాటి కుర్రవాళ్ళంతా యింతే !"

"అదేం కాదక్కా !"

"మరింకేవిటమ్మా !....ఓహో, అర్థమైంది. అదా విషయం ! పిచ్చిపిల్ల ! మనం ఆడవాళ్ళం. పుట్టింటిమీద మమకారం అసహజమేమీ కాదు. ఉండు-మీ బావగార్తో చెప్పి నీ ప్రయాణానికి ఏర్పాటు చేయిస్తాను. సరా: నువ్వు మరి నవ్వాలి. నీ నవ్వు బాగుంటుందనే రాజుకి నిన్ను చేసుకోడానికి కష్టపడ్డాను తెలుసా. మరి నవ్వు"

"అక్కా !" లక్ష్మి కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

రాధమ్మ గతుక్కుమంది.ఆమె గుండెల్లో భయం నిండిపోయింది.

లక్ష్మి తల నిమురుతో "భయపడకు లక్ష్మీ! మేమందరమూ వున్నాం. మీ బావగారు రాజానేమీ అనకనేగాని సమయమొస్తే అతని చెవులొంచి నువ్వు చెప్పినట్టు చేయించగలరు. ఏం జరిగిందో చెప్పమ్మా. నన్ను బెంగారు పెట్టకు"

లక్ష్మి చెప్పింది —

"ఆయన దాచమని ఏభయి రూపాయ లిచ్చేరు. మంచి చీరేదైనా కొనిపెట్టరూ అని అడుగుతే 'ఇప్పుడు నీ సరదాలే కావలిసి వచ్చాయి. ఆ డబ్బిలా యివ్వు పిచ్చి పిచ్చి కోరికలు...." పూర్తిగా చెప్పలేక మొహాన్ని చేతుల్లో దాచుకుని ఏడ్చింది.

రాజాని. అతని కఠుకు స్వభావాన్నీ అసహ్యించుకున్నది రాధమ్మ.

"నీకు తెలీదక్కా! ఆ యేభై మర్నాటికి ఆయన దగ్గరుండవ్"

రాధమ్మ రాజామీద మండిపడింది.

"డబ్బు నిలా నీళ్ళలా ఖర్చుపెడితే ముందు తన గతేంగాను? మే మతన్ని వత్తిడి చేయడంలే దనేగా యీ దుబారా! పొద్దున శెట్టి గారి...."

"నేనూ విన్నాను"

"శెట్టిగారి అప్పెలాగో తీరుస్తాము. కొంప తాకట్టుపెట్టో, నా నగ లమ్మో ఎలాగోలా ఆ అప్పు తీరుతుంది. కాని....ఈ మనిషి మారేదెలా? భార్య ముచ్చటపడి చీర కొనిపెట్టమని అడుగుతే చీత్కరిస్తాడూ? ఇలా గైతే పుట్టబోయే పిల్లవాడి కోరిక లెలా తీరుస్తాడు? ఇతన్ని వాళ్ళ నాన్న గారూ యిలాగే పెంచారా? ఆతను రానీ — నిలబెట్టి అడుగుతాను"

"వద్దక్కా. నే చెప్పినట్టు తెలిస్తే యింకా మండిపడి పోతాడు" అన్నది లక్ష్మి భయంగా.

"మరెంతకాలమని నోరుమూసు కూర్చోమంటావ్? ఛ...."

రాజా కెప్పుడు బుద్ధి వస్తుందిరా భగవంతుడా! పోనీలే లక్ష్మీ! నువ్వు బాధపడకు. మీ బావగారితో చెప్పి బ్రహ్మాండమైన చీర తెప్పిస్తాను"

"వద్దక్కా. వద్దు. నన్నిలాగే ఉండనివ్వు"

లక్ష్మి లేచి తన గదిలోకి వెళ్ళిపోయింది.

రాధమ్మ బాధపడ్డది. పెళ్ళయిన కొత్త రోజులు యిలాగేనా గడుస్త! అన్నదమ్ముల మధ్య వాళ్ళ అభిప్రాయాలూ, ఆచరణలూ ఉత్తర దక్షిణ ధృవాల దూరంలో ఉన్నాయనుకున్నది రాధమ్మ.

మధ్యాన్నం భోజనాలైన తర్వాత బాబు కాలేజీనుంచి వచ్చేడు. వచ్చి వాళ్ళ బాబాయి తనకి కొనిచ్చిన పెన్ను గురించి చాలా చెప్పేడు. అది పదిహేడు రూపాయిల పెన్నుట. వాళ్ళ ప్యూనుచేత తనకి పంపించాడుట.

రాధమ్మ విసుక్కుంది. బాబు ముందే వాళ్ళ బాబాయిమీద మండి పడింది. వాడిది సహించలేకపోయాడు. వాళ్ళమ్మ మాట కెదురు నిలిచాడు. వాడు కాలేజీకి వెళ్ళిన తర్వాత రాధమ్మ అన్నది.

"పెన్ను కొనివ్వగానే వాళ్ళ బాబాయి దేవుడై పోయాడు"

— మధ్యాన్నంపూట ఒక గంటసేపైనా కన్ను మూయడం రాధమ్మకి అలవాటు. కానీ, ఆరోజు ఆమె నిద్రపోలేదు. మనసునిండా రాజా నిలిచిపోయేడు. అతని భవిష్యత్తు గురించి ఆమెకు భయంగా వున్నది.

అకస్మాత్తుగా ఆమెకో ఆలోచన వచ్చింది. గబగబా లక్ష్మి దగ్గరకు వెళ్ళింది. గుమ్మం దగ్గరే కూర్చుని లక్ష్మిని పిలిచింది. ఈవేళప్పుడు రాధమ్మ నిద్ర మానుకుని తనని పిలవడంతో ఆశ్చర్యపడ్డది లక్ష్మి.

"రాజా మా అందరిలో ఉండటంవల్లనూ, వాళ్ళన్నగారు అతనికి బాధ్యతలేమీ అప్పగించకపోవడంతోనూ అతనిలా విచ్చలవిడిగా ఖర్చు చేస్తున్నాడు. నిజమంటావా?"

లక్ష్మి తలూపింది.

"నువ్వు నన్ను అపార్థం చేసుకోనంటే నీకో సలహా చెప్తాను. చేస్తావా ?"

"...................."

"తప్పనిసరైతే అతని బాగుకోసం మన మేదైనాసరే చేసితీరాలి. ఇవ్వాళ మనం ఒక చిన్న నాటక మాడదాం"

"నాటకమా !"

రాధమ్మ ఫకాలున నవ్వేసింది —

"మరే, నిజంగా నాటకమే. రాజు యింటికి రావడం చూచి, నువ్వూ నేనూ తగాదా పెట్టుకుందాం"

"తగాదానా !" మరింత ఆశ్చర్యపోయింది లక్ష్మి.

"వేరింటి కాపురం కావాలనుకుంటే, అది ఆడవాళ్ళవల్లనే సాధ్యమవుతుంది. దీన్లో కొంచెం నీ సహాయం అవసరం"

"అక్కా !"

మళ్ళీ నవ్వేసింది రాధమ్మ.

"పిచ్చిపిల్లా ! భయపడకు. రాజు బాగుపడాలంటే, అతనికి బాధ్యతలు తెలియాలంటే యిది చాలా మంచి పద్ధతి"

"నువ్వు చాలా చిత్రంగా మాటాడుతున్నావక్కా ! వారికి వారై తెలుసుకోవాలేగాని యిలా వేరుపడటాలూ నా బొందిలో ప్రాణముండగా జరుగనివ్వను. ఇలాటి దేవత నొదిలి దూరంగా బ్రతకడం నా చాత కాదు" అన్నది లక్ష్మి గాద్గదికంగా.

రాధమ్మ కరిగిపోయింది. లక్ష్మిని హృదయానికి హత్తుకున్నది. ఆమెను బుజ్జగించింది. అక్కడ్నుంచి లేచి వచ్చేస్తూ అనుకుంది—

"ఇంత మంచిపిల్లనా రాజుకోసం దూరం చేసుకోవాలని నేను ఆలోచిస్తి !"

—మూడు గంటలకి కాఫీ తాగిన తర్వాత అప్పుడే వచ్చిన సావిత్రి ఉత్తరం చదివింది రాధమ్మ.

"ప్రియమైన అమ్మాజీ!

లోగడ నేను రాసిన ఉత్తరానికి జవాబు రాయనేలేదు. ఈ ఉత్తరానికైనా జవాబు వ్రాస్తావని తలుస్తాను. సంక్రాంతి పండుగకు మేము మీ తావుకి రావలయుననుకుంటున్నాము. కావున మీరు తగు జాగ్రత్తలు తీసుకొనగలరు.

పెద్దన్నయ్య ఆరోగ్యం ఎలా వున్నది? మొన్నొనాడు నిద్రలో అన్నయ్య గురించి కలువరించానుట. దాంతో వారు యిప్పటికీ నన్ను గేలి చేస్తూనే వున్నారు. అన్నయ్య నెప్పుడు చూస్తానా అని తొందరగా వుంది. ఆ వచ్చే సంక్రాంతి త్వరగా రాకూడదూ? చిన్నొదిన సంగతులేమిటి? ఆవిడ ఆరోగ్యం జాగ్రత్త అని చెప్పవలెను. రాజన్నయ్యకి మంచీ-చెడూ తెలియవు.

చిరంజీవి భాస్కరం యిప్పుడిప్పుడే అల్లరి చేస్తున్నాడు. తాత, అక్క అంటున్నాడు. వాడిని అన్నయ్యలకు చూపించాలని తొందరగా ఉన్నది. బాబు చదువెలా ఉన్నది. వాడి పరీక్షల్లో పాసైతే బహుమానం యిస్తానని చెప్పవలెను. యింతే సంగతులు—

రాధమ్మ లక్ష్మితో అన్నది—

"ఈ ఉత్తరం చదువు. సావిత్రి మనసెంత మంచిదో తెలుస్తుంది. నిజం లక్ష్మి - మగపిల్లల కంటె ఆడపిల్లలకే మమకారం ఎక్కువ."

"అవుతే - సంక్రాంతికి ఆవిడగారి అల్లరి ఒక ప్రత్యేకతన్న మాట" అన్నది లక్ష్మి చిన్నగా నవ్వుతో.

రాధమ్మ కూడా నవ్వేసింది.

"నువ్వూ చూస్తావ్‌గా—వనపిట్టలా ఇరవైనాలుగ్గంటలూ అబుర్లు. ఆమె చేసిన వంకాయ కూర మొదలుకొని, వాళ్లాయన చేయించిన నెక్లెసు వరకూ చెప్పిందే చెపుతుంది. పసిపిల్లలా నన్నొదిలి క్షణమైనా ఉండలేదు. సావిత్రి కూడా మొన్న మొన్నటివరకూ రాజూ అంతే—"

రాజు విషయం వచ్చేసరికి, క్షణం క్రితం లక్ష్మికున్న ఉత్సాహం చప్పున చల్లారిపోయింది. ఇది గమనించి రాధమ్మ నొచ్చుకుంది.

ఆరోజు రాత్రి ఎనిమిది గంటలకుగాని రాజు యింటికి రాలేదు. బైట సైకిలు దిగి "అమ్మాజీ" అని పిలిచేడు. ఆ పిలుపుతో గుమ్మం వరకూ వెళ్ళిన రాధమ్మ మళ్ళా వెంటనే వెనక్కి తిరిగి గబగబా తన గదిలోకి వెళ్ళిపోయింది. ఇది గమనించేడు రాఘవరావు. ఇప్పటివరకూ రాధమ్మ తనకి బోధించిన తమ్ముని వైనం జ్ఞాపకాని కొచ్చింది. కళ్ళ జోడు తీసి మొహాన్న యింత కోపం పులుంకుని గుమ్మంవైపు చూసేడు. సైకిలు గోడ కానిస్తూ అన్నయ్య నుద్దేశించి -

"అమ్మాజీ ఏది?" అని అడిగేడు.

"చాలా పెందరాళే వచ్చావోయ్" — దెప్పి పొడిచేడు రాఘవ రావు.

"యివ్వాళ ఆఫీసువని హడావిడిగా ఉంది. అమ్మాజీ ఎక్కడ?"

"నాకు తెలీ కడుగుతాను. అంతెక్కువ పని ఏచ్చిందేవిటా మీ ఆఫీసులో?"

"లాస్టువీక్ కదూ! స్టేటుమెంట్సు డ్రాఫ్ట్ చెయ్యాల్సి వచ్చింది."

తమ్ముడు చెప్పేదాంట్లో నిజం లేకపోలేదని సమాధాన పడ్డాడు, రాఘవరావు.

"అయినా నీ పద్ధతేం బాగోలేదురా అబ్బీ!" అన్నాడు నిష్ఠూరంగా.

తేలిగ్గా నవ్వినట్టు మొహంలో మార్పు తెచ్చుకున్నాడు రాజు.

"సర్లే. ముందు భోజనం చెయ్యి. యిదిగో రాజు వచ్చాడోయ్!" అనేశాడు యథాలాపంగా. తర్వాతగాని గుర్తుకురాలేదు. యింట్లో ఆడ వాళ్ళు రాజుపైన సాగించబోయే దండయాత్ర. వెంటనే మాట మార్చి— "మీ వదిన నీ మీద కారాలూ, మిరియాలూ నూరుతోంది."

"ఎందుకనిట!"

"ఏమో. ఆవిడ్నే అడుగు" ఆ విషయంలో తనకేమీ సంబంధం లేనట్టు మళ్ళా కళ్ళజోడు పెట్టేసుకుని సీరియస్‌గా పేపరు చదివేస్తున్నాడు రాఘవరావు.

మామూలా నుంచుండిపోయాడు రాజు. తలుపువాటుగా నిలబడ్డ లక్ష్మి తన కంట పడ్డది.

"అమ్మాజీ !" మళ్ళా పిలిచేడు.

"ఏవిటా గావు కేకలూ? వింటూన్నవాళ్ళకి చెవుడొచ్చిం దను కున్నావా ?" కోపంగానే అనేసింది రాధమ్మ గదినుంచి బయటికొస్తూ.

రాజు కిది కొత్తనిపించింది.

"మరేంలేదు. నాకు ప్రమోష నొచ్చింది" అనేశాడు గభాలున.

పేపరు చదువుతూన్న అన్నయ్యా, తలుపువాటున నిలబడ్డ లక్ష్మి, రాధమ్మా, బాబూ అందరి మొహాల్లోనూ ఆనందం మెరిసింది.

"నే నీ శుభవార్త చెప్పడానికొస్తే మీరేమో...." చిన్నబుచ్చు కుంటో అన్నాడు రాజు.

"అబ్బే ! అదేం కాదురా ! మీ వదినకి...." అన్నయ్యేదో సర్ది చెప్పబోయాడు గాని అంతలోనే రాధమ్మ అతని మాట కడ్డుపడింది.

నే నొకటి చెప్తాను విను రాజూ ! నీకు ప్రమోష నొచ్చిందంటే మా అందరికీ సంతోషమే గాని నువ్వు ఈ యింటి విషయాలు పట్టించు కోడం లేదంటే బాధగా ఉంది. ఆలోచించే జ్ఞానం నీకుంది. మాతో

చెప్పించుకోడం ఏమంత మంచిదికాదు. తర్వాత నీ యిష్టం...అన్నట్టు ఈ శుభ సమయంలో మీ ఆవిడకి ఒక మంచి బహుమానం ఆ పిల్ల కిష్టమైనది యివ్వు. లేమా-నువ్వు పైకమిస్తే మీ అన్నగారితో చెప్పి నేనే ఏదోఒకటి కొనిస్తాను. అర్థమయ్యిందా. సరె....ముందు స్నానం చెయ్యి. వెళ్ళు" అన్నది రాధమ్మ.

అతను వెళ్ళిన తర్వాత భర్త నుద్దేశించి అన్నది.

"చూసేరా! అతని ప్రమోషను విషయం నాలో చెప్పడాని కెంత యిదైపోయేడో!"

"అవునవును. నీ సమయస్ఫూర్తికి మెచ్చుకోవచ్చు.వాడికి రెండు వడ్డించనూ వడ్డించావూ, లక్ష్మికొక్కవలసిన బహుమానమూ ఏర్పాటు చేశావు. అలా వుండాలి దక్షతంటే" భార్య తెలివికి మురిసిపోయేడు రాఘవరావు.

భోజనాలు ముగిశాయి.

అప్పటిగ్గాని రాజు అసలు సంగతి చెప్పలేదు —

"పుట్టి పెరిగిన ఊరుని, మిమ్మల్నీ వదిలి దూరంగా పెళ్ళాలంటే నాకు దిగులుగా వుంది అమ్మాజీ!"

రాధమ్మ ఉలిక్కిపడ్డది.

"ఏమిటా్రి నువ్వన్నది?" రాఘవరావు ఖంగారుగా అడిగేడు.

"ప్రమోషన్‌తోబాటు బదిలీ గూడా వచ్చింది. రాజమండ్రి వేశారు" రాజు దిగులుగా చెప్పేడు.

ఆ రాత్రింతా అన్నదమ్ము లిద్దరూ ట్రాన్స్‌ఫర్ విషయమై మాటాడుకున్నారు. రాధమ్మ వాళ్ళ మాటల్లో కలుగజేసుకోలేదు. ఆమె నొచ్చుకున్నది. ఏనాడూ లేనిది, ఈరోజు వేరింటి కాపురం గురించి లక్ష్మితో చెప్పింది. తథాస్తు దేవత లుంటారన్నది నిజమేనేమో!

రాజు వెళ్ళిపోతాడు. ఇది రాధమ్మ భరించగలదా ?

రాజు ఒక్కడే రాజమండ్రి వెళ్ళాడు. ఇల్లు కుదుర్చుకున్న తర్వాత లక్ష్మిని తీసుకెడతానని చెప్పేడు. అతను వెళ్ళబోయేముందు, ఇంటి గుమ్మం దిగి రాధమ్మవైపు ఓ క్షణంపాటు చూసేడు. ఏమను కున్నాడో ఏమో మళ్ళా వెనక్కి తిరిగొచ్చి రాధమ్మ పాదాలకు నమస్కరించేడు. కళ్ళనిండా నీళ్ళు నింపుకుని గాద్గదికంగా అన్నాడు.

"నన్ను క్షమించు అమ్మాజీ!.... వెళ్ళొస్తాను"

పిచ్చి తండ్రి....

అతని వినయాన్నీ, తనపట్ల అతనికి గల గౌరవభావాన్నీ తెలుసు కుంటూంటే రాధమ్మకి ఆనందంగా వుంది.

అతనెక్కిన రైలు ఈ పాటికి కదిలి వుంటుందని అనుకోగానే దుఃఖమూ పెల్లుబుకుతోంది.

మమకారం పెంచుకోకూడదు. కూడదు. అన్నింటికీ అతీతంగా బ్రతకాలి. చిత్రమైన తన ఈ నిశ్చయానికి వెంటనే సిగ్గుపడింది. కళ్ళు తుడుచుకుని లక్ష్మివైపు చూచింది. ఆ పిల్ల కిటికీదగ్గర కూర్చుని వేప చెట్టు వేపు చూస్తోంది. రేపు ఈ లక్ష్మిని తీసుకుపోతాడు రాజు. సావిత్రి రెండేళ్ళ క్రితమే వెళ్ళిపోయింది. యిక మిగిలేది—తను, బాబూ, వారు. బాబు కాలేజీకి, వారు ఆఫీసుకి వెళ్ళాలి. యింత యింట్లోనూ బిక్కు బిక్కు మంటూ ఒకర్తే సాయంత్రం వరకూ గడపాలంటే తనపాలిటి శిక్ష !

రాజుని రైలెక్కించి వారొచ్చారు కాబోలు. వీధిలో ఎవర్తోనో బిగ్గరగా మాటాడుతున్నారు. వెంటనే రాధమ్మ వీధిగుమ్మం దగ్గరకొచ్చి నిలబడ్డది. రాఘవరావు ఇంట్లోకొస్తో అన్నాడు—

"రాజు నా తమ్ముడు. లక్షకీ కోటికీ అలాటివాడు ఒక్కడుం

టాడు. యిదేమైనా గ్రహించావా నువ్వు. పైగా - వాడిగురించి నాకు ఫిర్యాదులు చేశావు. నాచేతగూడా వాడికి మాటనిపించావ్" రాఘవరావు ధోరణికి రాధమ్మ ఆశ్చర్యపోయింది.

"ఏమైందిప్పుడు ?" కుతూహలంతో అడిగింది.

"స్టేషన్లో రైలెక్కబోయేముందు అడిగేడు—'వదినకి నామీద కోప మెందుకొచ్చిందీ' అని. నేను అన్ని విషయాలు చెప్పేను. వాడు బాధపడిపోతూ లేని నవ్వు మొహాన్న అంటించుకుని చెప్పేడు— ఈ ఏడాదిపాటూ యింట్లో డబ్బివ్వకపోడానికి కారణమేమిటో తెలుసా ?

"………"

"వాడికొచ్చే జీతాన్ని బేంక్‌లో దాస్తున్నాట్ట."

"దాచడమా ?" మరింత ఆశ్చర్యపోయింది రాధమ్మ.

"ఆ…. అక్షరాలా దాపడమే. వెయ్యి రూపాయలు పోగుచేశాడు. శెట్టి అప్పు నెల రోజుల్లో పైసలు చేస్తానన్నాడు. ఇప్పుడైనా వాడి బుద్ధి అర్థమయ్యిందా రాధా? వాడినా మనం అనుమానించడం ?"

"మరి…. మరీ విషయం మనతో చెప్పాడుగాదే యిన్నాళ్ళూ."

"చెబితే — ఆ డబ్బుని మనం వాటికనీ, వీటికనీ, ముచ్చట్లూ, మురిపాలకనీ తగలేస్తామని వాడి భయంట. అందుకే చివరికి లక్ష్మికి కూడా ఈ రహస్యం చెప్పలేదుట. యిక వెళ్ళు. తీరుబడిగా కూర్చుని వాడిని అవమానించినందుకు విచారించు. వెళ్ళు" రాఘవరావు విసురుగా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

యిదంతా వింటూన్న లక్ష్మి కళ్ళింతవి చేసుకుని రాధమ్మవైపు చూచింది.

"అక్కా !" అన్నది బాధగా.

రాధమ్మ కొంగుతో కళ్ళొత్తుకున్నది.

"నేను....నేను చాలా మూర్ఖురాలిని అక్కా! వారిని అపార్థం చేసుకున్నను" అన్నది లక్ష్మి పశ్చాత్తాప పడుతూ.

"యిన్నేళ్ళు పెంచిన నేనే రాజుని అర్థంచేసుకోలేక పోయాను" రాధమ్మ పేలవంగా నవ్వేస్తూ అన్నది.

౦—౦

# 'శ్రేయోభిలాషులు'

వారం రోజులనుంచీ డైరీలో కాగితాలు ఖాళీగా వున్నాయి. రాయడానికి వార్తంటూ దొరకడంలేదు జానకిరామయ్యగారికి. దానికి తోడు బద్ధకం ఒకటి జతయ్యింది.

వెనుక పేజీలు తిప్పడం మొదలుపెట్టారు.

'ఈ రోజు అసలేం తోచడంలేదు. పిల్లల ఆరోగ్యం ఎలావుందో ఏమో. బొత్తిగా ఉత్తరాలు రాయడమే మానుకున్నారు. రేపు నాలుగు చివాట్లు పెడుతూ ఉత్తరాలు రాయాలని వుంది'

మరికొన్ని పేజీలవెనక—

'పొద్దుటనుండి జోరున వర్షం. ఇంట్లోకాలు బయట పెట్టలేదు. అంతా వెలితిగా వుంది. ఇంకా ఎన్నాళ్ళు ఈ బ్రతుకు వెలిగించాలో ఏమో !'

'పెద్దబ్బాయి ఉత్తరం రాశాడు. ప్రమోషన్ ఎక్స్పెక్ట్ చేస్తున్నాట్ట. వాడికేం-రాజాలాటి మనిషి. అదృష్టవంతుడు. వాడి భవిష్యత్తుమీద నాకు మంచి నమ్మకంవుంది. పోతే-నా దిగులంతా చిన్నాడిమీదనే'

---

1963, ఫిబ్రవరి—భారతి

'కోడలికి సుస్తీగా వుందని రాశాడు చిన్నాడు. వస్తుథా ఆ పిల్ల అనారోగ్యప్పిల్ల. సరైనమందులు వాడుతున్నాడో లేదో. అయినా వాడు ఆ ఉద్యోగం చెయ్యకపోతే కలిగే నష్టమేమిటో నా కర్థంకావటం లేదు'

చాలా పేజీలు తిప్పారు. ఏ పేజీలోనూ ప్రత్యేకత కనుపించడం లేదు. బ్రతుకంతా చప్పగా, చేదుగా వున్నట్టుంది. ఎందుకనోమరి—

ఒక్కోసారి జానకిరామయ్యగారి ఆనందానికి అవధులుండవు. జీవితంలో తీపిదనమంతా తన ఒక్కడి సొత్తని మురిసిపోతారు. అప్పు డనుకుంటూ రాయన—

'మరో పాతికేళ్ళు బ్రతికితే ఎంత బావుండును'

గోడగడియారం నాలుగుసార్లు మూలిగింది.

కాలానికి కళ్ళేంలేదుట. తన పరిచయస్థుల్లో ఎవరో అంటూండే వారు. ఎవరన్నదు ? ఎవళ్ళో, జ్ఞాపకానికి రావడంలేదు. ఎవరైనా—ఆ మాటన్నవాడు యోగ్యుడేను. చాలా బాగా చెప్పాడు. ఇలా ఒక్కోగంటా ఖర్చైపోతే చివరికి-ఛా.... ఇవ్వాళేమిటీ ఆలోచనలు ? చేతినిండా పని లేకపోతే యింతేమరి.

తను సర్వీస్‌లో వుండగా ప్రతివాడూ అనేవాడు 'ఆనెస్టు ఆఫీసర'ని.సరిగ్గా వేళకి ఆఫీసుకి వెళ్ళేవాడు. బాగా రాత్రివకిన తర్వాతగాని యింటికి వచ్చేవాడుకాదు. ఆఫీసుపనితప్ప, అప్పట్లో మరో వ్యాపక మంటూ వుండేదికాదు.

బాగా జ్ఞాపకం - ఆఫీసులో సుందరమనే 'స్టెనో' ఉండేవాడు. కుర్రాడు. కొత్తగా పెళ్ళయింది. త్వరగా యింటికి చేరుకోవాలని ఉండేది. కాని – సాక్షెత్తెను ఫైళ్ళు ముందేసుకు కూర్చుంటే, ఆఫీసరునాదిని ఎలా వెళ్ళగలడు. వెళ్ళాలనివుంది, వెళ్ళాలని అడగలేక

దిగాలుపడిపోయి పనిచేస్తుండేవాడు. 'ఈ పీడ ఎప్పుడు విరగడౌతుందిరా భగవంతుడా ?' అని అతను చాలాసార్లు అనుకునే వుంటాడు. పాపం—

మరో విషయం ...చాలామంది గుమాస్తాలు, తోటి ఆఫీసర్లు గూడాను, తనని ఛండశాసనుడని అనుకునేవారు. నిజమే మరి—డ్యూటీ ఫస్టనే జాతివారి ప్రముఖులు, సోమరితనం దూరంగా వుండుకోమని ప్రతి వాడికీ చెప్పేవారు. పనిచెయ్యనివాడి ప్రాణాలతోటి, మంచిదారిలో పెట్ట డానికి సర్వవిధాలా ప్రయత్నించేవారు. అవకతవక వేషాలువేస్తే తగిన శిక్ష విధించేవారు. అలాంటప్పుడు తను ఛండశాసనుడు కావడంలో ఆశ్చర్యంలేదు.

కాని తన మనసుని తెలుసుకోడానికి 'ఏ పూటా' ప్రయత్నించ లేదు.

ఈ తత్వం బాగా అలవాటైపోయింది. స్ట్రిక్ట్ ఆఫీసరంటే యమ ధర్మరాజుకి ఏజంటులా చూస్తుంటారు. యిన్ని స్కేండల్స్ వాడినెత్తిన రుద్దుతారు.

తన యిన్నేళ్ళ సర్వీసులోనూ - ఆ ఒక్క ఏకాం౦బెంటే తనకు నచ్చాడు. అసలూ - అతనిప్పుడు ఎక్కడున్నాడు-యెంతమంది పిల్లలో, ప్రయోజకులైయ్యారో లేపో - పాపం - ఇరవై నాల్గంటలూ ఆఫీసుపనిలోనే మునిగి ఉండేవాడు. ఒక్కోసారి భోజనానిక్కూడా వెళ్ళేవాడుకాదు. అప్పుడు తనకి జాలివేసేది. తను వెళ్ళమని చెప్తేగాని యింటికి వెళ్ళేవాడుకాదు.

అదీ అలాఉండాలి. ఉద్యోగస్థుడైనతర్వాత డ్యూటీకంటె మిం చింది మరొకటిలేదనేవాడే పైకొస్తాడు. దొంగఎప్పుడూ దొంగలాగానే స్థిరపడిపోతారు.

దొంగలంటే గుర్తుకొచ్చింది. విశ్వనాథం తన తోటి ఉద్యోగేగా,

ఏమయ్యిందతనికి. అతనిముందు అతన్ని అందరూ పొగిడిపారేసేవాళ్లు. వెనకమాటున బూతులు తిట్టేవారు. విశ్వనాథం వస్తుథా అమాయకు డేమో, వాళ్ళమాటలన్ని నమ్మాడు. నిజంకాబోలని వుబ్బిపోయాడు. వాళ్ళంతా వట్టి దొంగలు, చాతకాని వెధవలూ అని తెలుసుకోలేక పోయాడు. ఫలితం అనుభవించాడు.

అందుకనే 'పనిదొంగల్ని' ఎప్పుడూ నమ్మకూడదు. మాటలు చెప్పకు ప్రతికేవాళ్ళకి వాత పెడుతూనేవుండాలి. అప్పటిగ్గాని బుద్ధిరాదు వెధవలకి.

అయినా యిప్పుడీ విషయాలన్నీ ఎందుకసలు ?

గతించింది గుర్తు చేసుకుంటూంటే చాలా బాధగానూ, హాయి గానూ, చేదుగానూ, తీపిగానూ.........

"ఇదిగో నిన్నే ! కాస్త కాఫీ తగలెద్దూ. తలనొప్పితో ఛస్తు న్నాను."

ఈ యింటావిడ వట్టి బద్దకంమనిషి. అవతల మగాడికి ఎప్పుడు ఏదికావలసి వుంటుందోనన్న జ్ఞానంకూడా లేదు. ఏదైనా, చెప్తేనేగాని, అదీ కాస్త ఆలస్యంగాగాని చెయ్యడం చాతకాదు. అబ్బబ్బ....ఇలాంటి మనిషితో యిన్నేళ్ళకాపురం ఎలా....

"నిన్నే....చెవిటిమాలోకం....పిలిస్తే పలకవుగదా....కాఫీ...."

"ఇదిగో తాతయ్యా !" సుగుణ కాఫీ తెచ్చింది.

"నువ్వు బళ్ళోకి వెళ్ళలేదుటే సుగుణా...."

"లేదు తాతయ్యా."

"ఎందుకనిట ?"

"నేనే వుండిపొమ్మని చెప్పాను. ఈ లంకంత యింట్లో ఒక్క దాన్నీ వుండలేక, ఏదో పసిపిల్లతో కబుర్లయినా చెప్పకుందామని నేనే వెళ్లొద్దన్నాను" అన్నారావిడ.

"చాల్లే నిర్వాహకం. సంతోషించాలి. యెందుకోసమైనా అది తల్లీ తండ్రుల్ని వదిలి యింతదూరం వచ్చింది?"

"మీది మరీ విడ్డూరం!"

"లేకపోతే ఏవిటిది? నాలుగుముక్కలు వంటపడతాయి గదాని వాడు దీన్నిక్కడికి పంపిస్తే. చదువుకి ఎగనామం పెట్టమని నువ్వు సలహాలిస్తావు? చిన్నపిల్లలకి చెప్పే బుద్ధులివేనా?" జానకిరామయ్య గారు విసుక్కున్నారు.

"పోనిద్దురూ-ఇది యిప్పట్నుంచే చదివి ఏమిఉద్ధరించాలి గనుక? ఏడేళ్ళయినా నిండలేదాయె."

"ఆ....నువ్వు చెప్పటానికేములే మహా నాగావెస్తావు. నీ అలుసు తీసుకునేగా చిన్నాడు యిప్పుడు ఎందుకూ పనికిరాని గుమాస్తాగిరికి నోచుకున్నాడు. సుగుణమ్మతల్లీ! వాని మాటలువిని చదువుమానుకోకేం? రోజూ బడికివెళ్ళాలి. పాఠాలు నేర్చుకోవాలి. మీ నాన్న నిన్నుచూసి మురిసిపోవాలి. తెలిసిందా?"

"మరినువ్వో తాతయ్యా-"

"నా తల్లిగాదె....నా మాట మరచిపోయున్నానా కన్నతల్లి.... చూడవేమామ్మ....నా తల్లికి నేనంటే ఎంత ప్రాణమో." సుగుణ తలని లాలనగా నిమురుతూ భార్యవైపు గర్వంగా చూశారాయన.

బడికి వెళ్ళలేదని సుగుణని మందలించటం మాని, ఆ పిల్లతో కబుర్లాడటం మొదలుపెట్టారు జానకిరామయ్య. ఇది చూస్తూ నిలబడ్డ ఇంటావిడ వచ్చేనవ్వుని ఆపుకుంటూ అన్నారు -

"అవతల కాఫీ చల్లారిపోతుంది. ముందు కాఫీతాగి ఆనక మనవరాలితో ముచ్చట్లాడండి"

7)

"అవునవును. కాఫీ తెచ్చావుగదూ... మరి నువ్వు తాగావా చిట్టీ!" అని మనవరాలిని అడిగారు.

"ఓ....నాన్నమ్మ నా కెప్పుడో యిచ్చింది"

చిన్నపిల్లలు కాఫీ తాగరాదనే ఆరోగ్యసూత్రం అప్పటిగ్గాని ఆయనకు గుర్తురాలేదు.

"నీకు నాన్నమ్మ కాఫీ యిచ్చిందా....ఇదిగో వింటున్నావా ? పసి పిల్లకి కాఫీ యిస్తావూ....నీకేమైనా మతివుందా ? అసలు చూస్తూవుంటే నువ్వు పిల్లల్ని చెరపడానికే వుద్దరించినట్టు కనుపిస్తున్నావే ? నీకు బుద్ధి అనేది వుందా? అలా రాయిలా నిలబడకపోతే సమాధానం చెప్పరాదూ!"

"కాఫీ యిచ్చినంత మాత్రాన...."

"ఇంకఆట్టె మాటాడకు. కాఫీ యిస్తుందట కాఫీ .. మచ్చటయితే మొన్న హార్లిక్సు తీసుకొచ్చాను. అది యివ్వగూడదూ....మనిషికి ఒక సారి చెప్తే అర్థంచేసుకునే జ్ఞానం వుండాలి....ఇదిగో చిట్టీ! నువ్వెప్పుడూ కాఫీ తాగకు. అది నీ ఆరోగ్యాన్ని పాడుచేస్తుందమ్మా!"

"నువ్వు తాగుతున్నావుగా తాతయ్యా....మరి నీ ఆరోగ్యం పాడవుదూ...."

తాతయ్య తత్తరపాటు చెందారు. నానమ్మ నవ్వారు. ఆవిడ నవ్వు చూస్తుంటే ఆయనకు తల కొట్టినంత పనయింది. 'అసి భడవా!' అని లోలోన అనుకుని, తనని సమర్థించుకుంటూ ఓ కుంటి సమాధానం చెప్పారు.

"మేము, పెద్దాళ్ళంగదూ....కాఫీ తాగుతే మా ఆరోగ్యం పాడవదు.నువ్వు చిన్నపిల్లవి కాబట్టి నువ్వుతాగుతే ఆరోగ్యం పాడవుతుంది"

"అచ్చం తండ్రిపోలికలు. పెద్దాళ్ళమాత్రం యింతే గమటండీ!"

"అవునేవ్....ఇలాంటి చిక్కుప్రశ్న లడగటంలో వాడు గజ

హెంచి ప్రతి చిన్నవిషయాన్నీ అంత శ్రద్ధ చూపించి అడిగేవాడు కాబట్టి వాడిప్పుడు యింత హోదాలో వున్నాడు" పెద్దకొడుకు గుర్తుకు రాగానే చాలా విషయాలు కదిలాయి.

"నీకు గుర్తుందో లేదోగాని, వెధవాయి నన్ను ఏ క్షణమైనా విడిచిపెట్టి వుండేవాడుకాదు. పైగా ఆఫీసునుంచి యింటికిరాగానే వాడితో నాకు చక్కటి కాలక్షేపం గూడాను. ఏం ఉద్యోగాలో ఏమో....విసిరి పారేసినట్టు మనకి దూరంగా అడవిలో వుంటున్నాడు. చూశావ్ ఉద్యోగాల్లోవున్న గమ్మత్తే యింత. సెంట్రల్ ఎక్సైజ్ సూపర్నెంటైనంత మాత్రం, తల్లిదండ్రుల దగ్గరుండాలని ఎక్కడుంది. ఉద్యోగ ధర్మానికి యీ అనుబంధాలు అడ్డురాకూడదు. అన్నీ మరిచిపోవాలి. అందర్నీ వదులుకోవాలి....అయినా మనపిచ్చిగానీ. వాడికేం తక్కువ ? మంచి హోదా, చేతినిండా డబ్బు, ప్రాణంలాంటి భార్య, రత్నాల్లాంటి పిల్లలు.... అవునూ....శేషు యింకా యింటికి రాలేదేమిటి ?"

చిరంజీవి శేషు విషయం గుర్తుకురాగానే పొద్దున్నుంచి జ్ఞాపకానికి రాకుండా దూరంగా తిరుగుతున్న ఓ అతి ప్రమాదమైన సంగతి దానంతటదే గుర్తుకొచ్చింది.

"వాడు....వాడేం చేశాడో తెలుసా ? పేరెకుతాడు వెధవాయ్!"

"ఏం చేశాడండి"

ఆయన చివాలునలేచి నిలబడ్డాడు. 'అది' తలుచుకుంటూంటే కోపం వస్తోంది మరి.

"ఏం చేశాడా ? చేస్తాడు. వాడిష్టం వచ్చింది భయం-భక్తీ లేకుండా చేస్తాడు. ఇదంతా నీ భరోసా చూసుకునే చేస్తున్నాడు. నీ గారాబంవల్లనే వాడు భ్రష్టుడవటానికి సిద్ధపడుతున్నాడు. ఈ సంగతి వాళ్ళ నాన్నకి తెలుస్తే యింకేమైనా వుందా? 'తాతనై వుండి వాడు చెడిపోతుంటె

చూస్తూ వూరుకుంటావా నాన్నా !' అని నా ముఖంముందె నాలుగూ కడి గేస్తాడు"

"ఇంతకీ ఏంచేశాడో చెప్పరేం ఖర్మ !"

"మరిటా....వాడు నీ ముద్దుల మనవడు, పెద్దాడి కొడుకు .... వుండు....వాడొచ్చేవేళయిందిగా వాడి నోటితోనే చెప్పిస్తాను. చదువుకుని బాగుపడరా బాబూ అని చెప్పి వాడిని కాలేజీకి పంపుతే వాడు చేసేపని యిదా !"

"ఎందుకలా వాడిమీద మండిపడిపోతారు. అసలే కురర్రికుంక. విండా పదిహేనేళ్ళయ్య...."

"వప్పుకుంటావ్ గదా....ఆ కుర్రికుంకటా. సాక్షాత్తూ వాడి మాష్టరుముందె సిగరెట్టు కాల్చిపారేశాట్ట"

"ఆఁ...."

"మరేవిటనుకున్నావ్. ఇవ్వాళ సిగరెట్టు కాల్చాడు. రేపేమో రేపు....నాకీ సంగతి ఉదయమే గుర్తుకొచ్చివుంటే అప్పుడే వాడి చర్మం వల్చేసివుందును. ఏమిటనుకుంటున్నాడో ఏవిటో. తాతయ్యేగదా....ఆ పూల్ నన్ను నెత్తిమీద పెట్టుకుంటాడు గదా అని ధీమా ! చూపిస్తా నా తడాఖా !"

"చాల్లెద్దురూ....పసివాడు ఏదో తెలీక...."

"అవునే....పసివాడు. ఇలా అనే చిన్నవాడిని చెడిపేశావ్. వెధవ గుమాస్తాగిరిలో సతమత మవుతున్నాడు"

"మాటకిముందు చిన్నాడిమీద అలా నోరు చేసుకుంటా రెందు కసలు ! వాడికేం ! పదిమందిలోనూ 'భేష్' అనిపించుకుంటున్నాడు. మొన్న వాడు రాసిన కథకి ప్రైజ్‌కూడా వచ్చిందని...."

"విన్నాం. వీని ఏం చెయ్యమంటావ్ ! ఎగిరి గంతులెయ్య

మంటావా ? సిగ్గులేదూ? వాడిని వెనకేసుకు వస్తున్నావ్. పెద్దాడికీ, చిన్నాడికీ భేదం తెలీదంలేదు నీకు ? వాడేమో నూవరింటెండెంటా ? వీడు కానికి పనికిరాని గుమాస్తానా ? ఎవడ్ని చూసి సంతోషించమంటావ్?"

"ఎవరదృష్టంకొద్దీ వాళ్ళు పైకొస్తారు."

"గాడిద గుడ్డేం కాదూ. అదృష్టమట. అదృష్టం ! వల్లకాదు కృషే. కృషి. కృషి కావాలి. అంతేగాని జులాయి వెధవలా తల్లి దండ్రుల్ని ఎదిరించి తిరిగేవాడు బాగుపడతా డనుకున్నావా ? యిప్పుడు కాదు. రేపు నలుగురు పిల్లలు పుట్టిన తర్వాత తెలుస్తుంది వాడి అవస్థ. పెద్దాడి సంగతంటావ్ - దేవుడు కనికరించి యిప్పటికి ఇద్దర్ని ప్రసాదించాడు. పదిమంది కలిగినా, వాళ్ళందరికీ రాజభోగాలు అమర్చగలడు"

"దేవుడి దయవల్ల ఇప్పుడు మనకున్నదే చాలు. నిశ్చింతగా నాలుగు తరాలు గడవటానికి. చిన్నాడు మాత్రం యిబ్బంది పడాలని ఎక్కడుంది ? వాడి వాటా వాడి కిచ్చేస్తిమా, వాడూ అనుభవించగలడు అన్ని భోగాలూను"

"అంటే నీ ఉద్దేశ్యం ? ఇప్పుడు ఆస్తి పంపకం జరగాలంటావా? అది నా బొందిలో ప్రాణం ఉండగా జరగదు."

"మన అబ్బాయిలకీ అభిమానం ఉంది."

"అందుకని ఇప్పుడేమంటావ్ ?"

ఆవిడ ఏమీ అనలేదు. సుగుణను తీసుకుని వంట గదిలోకి వెళ్ళింది.

ఇలాంటి గలాటాలు ఆ యింటో గత ఏడెనిమిది సంవత్సరాల నుండీ అలవాటేను. వాటికో కారణమంటూ ఉండక్కర్లేదు. ఆ మాత్రం లేకపోతే - యీ చివరి రోజులు ఏం సందడిగా గడుస్తాయి ? అదీ గమనించాలి మరి.

జానకిరామయ్యగారు శేషు విషయం పూర్తిగా మరిచిపోయారు. చిన్నవాడి గురించి ఆలోచించడం మొదలుపెట్టారు. లేచి నిలబడినవారు మళ్ళీ పడక కుర్చీలో నడుం వాల్చారు.

పక్కనున్న కాఫీ పూర్తిగా చల్లారిపోయి పదినిముషాలయ్యింది.

సరిగ్గా అయిదు గంటలకి గుమ్మం బయట సైకిలు బెల్లు వినిపించింది. బెల్లు వినిపించగానే భార్య నుద్దేశించి అన్నారు గట్టిగా—

"శేషు వచ్చేదేవ్...."

శేషు లోపలికి వస్తూనే అన్నాడు.

"తాతయ్య. ఇవ్వాళ నీకో గుడ్‌న్యూస్ చెప్తాను. చెప్పనా ?"

"ఏమిటో అది ?"

"చెప్తే ఏమిస్తావ్ ?"

"చెప్పరా భడవా ! చెప్పిన తర్వాత నీ ప్రెజంటేషన్ ఆలోచిస్తాను"

"వీడు మరీను. పెద్దాడి మల్లే ప్రతి విషయానికీ 'సస్పెన్స్' తగిలిస్తాడు." ఆ సమయానికి ఇంటావిడ గూడా అక్కడికి వచ్చారు.

"శంకరం బాబాయ్ ఉత్తరం రాశాడు"

"ఊఁ....రాస్తే...."

"అందరూ వినండహో....అతి త్వరలో నాకూ,చి.సౌ. చెల్లాయి సుగుణకీ ఒక చక్కటి తమ్ముడు పుట్టబోతున్నాడు"

ఆ వార్త వినగానే మనవడ్ని కావులించుకుని ఇంటావిడ, వాడి తల నిమురుతూ అన్నారు:

"నా బాబే....ఎంత మంచివార్త చెప్పావురా నాయనా !"

"వరేయ్....వరేయ్....ఆ ఉత్తరాన్ని యిలా ఇవ్వరా...." కుర్చీలోంచి ఒక్కసారిగా లేచి నిలబడి తడబడుతూ, ఆ ఉత్తరాన్ని అడిగారు

జానకిరామయ్య. కళ్ళజోడు సర్దుకుంటూనే శేషు యిచ్చిన ఉత్తరాన్ని పూర్తిగా చదివారు. ఇంటావిడ కోరికమీద బిగ్గరగా చదవాలసి వచ్చింది.

"చిరంజీవి శేషుకి, మీ బాబాయి ఆశీర్వదించి వ్రాయునది. మీ పిన్నికి వారం రోజులనుండి వంట్లో బాగుండుటలేదని, మొన్న హాస్పిటల్‌కు తీసుకువెళ్ళాను. అక్కడ డాక్టర్లు మీ పిన్నిని పరీక్షించారు. త్వరలో నీకూ. నీ చెల్లాయికీ ఒక చక్కటి తమ్ముడు పుట్టబోతున్నాడని చెప్పారు. అన్నయ్యకూడా యివ్వాళనే ఉత్తరం రాస్తున్నను. ఈ విషయం తాతకీ. నాన్నమ్మకీ నువ్వే చెప్పు కానీ. ఒక షరతు.... వాళ్ళు నీకేదైనా ప్రెజెంట్ యిచ్చేంతవరకూ ఈ విషయం చెప్పకు. తాతయ్యకీ. నాన్నమ్మకీ నా వందనా లందజేయి. చెల్లాయికి నా ముద్దులని చెప్పు. బాగా చదువుతున్నా వనుకుంటాను. ఉత్తరాలు రాస్తూండు"

ఉత్తరం చదివి. దాన్ని జేబులో పెట్టుకుని శేషుతో అన్నారు.

"నీ కొక్కడికీ ఉత్తరం రాయడంలో వాడి ఉద్దేశ్యమేమిటో ?"

"మా బాబాయి సంగతి మీ కెవరికీ తెలీదనుకు. మనమంతే పాణం. ప్రతీ సంగతీ ముందుగా మనకు తెలియాల్సిందే !"

"సంతోషించాంలే.... ఎలాగైతేనేం మంచి బాబాయి నీ కొక్కడికే దొరికాడు. అఁ.... ఇదిగో ముందు ఆ విషయం ఆలోచించు"

ఆ విషయ మేమో తనకి గుర్తు రావడానికి ఓ క్షణం పట్టింది. ఆ క్షణం తర్వాత అన్నారు భార్యతో.

"అసలే ఆ పిల్లకి అనారోగ్యం. వాళ్ళ పుట్టింటి మాటంటావా ? వట్టి పల్లెటూరి మారోకం. అంచేత ఆ అమ్మాయిని మనింటికే తీసుకొద్దాం. ఇక్కడ మంచి డాక్టర్లున్నారు. ఈ విషయమే రేపు వాడికి రాస్తాను. ఏమిటో దేవుడి కిన్నాళ్ళకి వాడిమీద దయ కలిగింది. ఓ నలుసు నిస్తున్నాడు. అదే చాలు. యిదిగో నే చెప్పే దేమైనా వినిపించుకుంటున్నావా ?"

"నన్నలా విసిగించకపోతే. మీరు చెప్పేదేదో చెప్పరాదుటండీ। నేనూ వాడి విషయమే ఆలోచిస్తున్నాను"

"అదే....ఆ పిల్ల నిక్కడికి తెస్తామనుకో. అంతవరకూ బాగానే ఉంది. కాని – వాడు హోటల్లో చెయ్యి కడుక్కోవలసి వస్తుందిగదా. పైగా—ఈ హోటలు భోజనం వాడి శరీర తత్త్వానికి సుతరామూ పడ దాయె ఖర్మ."

"సెలవుపెట్టి వాడినిగూడా యిక్కడికి వచ్చేయమనండి"

ఆయన ఫక్కున నవ్వారు.

"నీ కేమైనా మతి పోయిందా ఏమిటి? ఎన్నాళ్ళని సెలవిస్తారు. అదేమైనా ఆఫీసనుకున్నావా లేక ధర్మసత్ర మనుకున్నావా. అడిగినన్ని సెలవు లివ్వటానికి" ఆయనకు తన ఆఫీసరుగిరీ గుర్తుకొచ్చింది. అంత లోనే కొడుకు పస్థితి (గుమాస్తా గిరీ) మీద జాలివేసింది.

"అసలా బోడి గుమాస్తా గిరికి రాజీనామా యివ్వమని రాస్తాను. వాళ్ళిచ్చే నూటేభై నేనే యిస్తాను. వాడు ఇంటిపట్టున మన కళ్ళముం దుంటే అంతేచాలు. పిచ్చివెధవ - ఎంత బాధపడుతున్నాడో ఏమో."

"అలాగే చెయ్యమనండి. పెద్దతనంలో ఉన్నామా–పాడు మనసు పిల్లలమీదికి పోతోంది."

"ఒప్పూ వప్పుకున్నావ్ కమా-కాని....వాడితో వచ్చిన చిక్కేమి టంటే. నామాట వినిపించుకోడు. పైగా ఉద్యోగం పురుషలక్షణ మం టారు. ఒకపని చేస్తా. వచ్చే సంక్రాంతికి నువ్వూ. నీ భార్యా ఇక్కడికి రావలసిందని రాస్తాను. వాడు వచ్చిన తర్వాత ఏదో విధాన వాడిని వప్పించి రాజీనామా యిప్పిద్దాం. సరేనా–" అంటూ ఆయన అప్పటికే యింటిగుమ్మం దాటారు.

"తాతోయ్. నా ప్రెజంటేషన్ మాటేం జేశావ్?" అన్నాడు చిరంజీవి శేషు.

"మీ మామ్మదగ్గర ఓ పదిరూపాయలు పుచ్చుకో....మంచిపెన్ను లేదని గోల పెడుతున్నావ్‌గా" అని చెప్పి గబగబా నవ్వుకుంటూ వెళ్ళి పోయారు.

"ఏమిటో చిత్రమైన మనిషి. క్షణానికో విధంగా మారిపోతూం టారు" అనుకుంది ఇంటావిడ.

* * *

రోడ్డుమీదికి వచ్చిన తర్వాత శేషు సిగరెట్టు కాల్చినట్టు మళ్ళీ జ్ఞాపకానికి వచ్చింది జానకిరామయ్యగారికి. నవ్వుకున్నారు.

ఇప్పుడు తనకు మనవడుపుట్టబోతున్నాడనే శుభవార్త ముఖ్యంగా సుబ్బరాజుకి చెప్పాలి. కనిపించినప్పుడల్లా అడుగుతాడు. 'మీ రెండో వాడికి పిల్లలా ?' అని. ఇప్పుడు గర్వంగా చెప్పాలి. ఉత్తరాన్ని అతని ముఖంమీద గిరాటు వెయ్యాలి.

సుబ్బరాజు తన శ్రేయస్సుని కోరే మనుషుల్లో ఒకడు. అతి నంటాడు — "నీ కేమిటోయ్ ! రామలక్ష్మణుల్లాటి యిద్దరు కొడుకులు. ఇప్పటికీ నీ మాట జవదాటరు. రత్నాల్లాటి మనవలు. తరగని ఆస్తి. మనిషికి యింతకంటె కావలసిం దేమిటోయ్ !"

నిజమే. మనిషికి ఈ ఆనందంకంటె విలువైనది ఏముంది ?

లోకంలో ఎంతమంది పిల్లలులేరు. అనుక్షణమూ అన్నమీద తమ్ముడు — తమ్ముడిమీద అన్న కత్తులు నూరుకోడమే నాయె. అలాం టిది తన పిల్లలు ఎంత అన్యోన్యంగా ఉంటారని. ఇప్పటిగ్గూడా అన్న య్యంటే చిన్నాడికి ఎంతో భక్తి, విశ్వాసమూను. వాడికి అన్న మీదున్న గౌరవం నాన్నమీద లేదు. లేదంటే పూర్తిగా లేదనికాదు. గాని అప్పు డప్పుడూ తన మాట కెదురు చెప్పడం కద్దు—

అందునా, పెద్దవాడి తర్వాత చిన్నాడు పుట్టాడేమో....వాడిమీద 'గారాం' చూపించారు. కొద్దో గొప్పో 'అలుసుతనం' నేర్పారు. అందు చేతనే వాడు యిలా తయారయ్యింది.

వాడు శ్రద్ధగా చదివిఉంటే ఈసరికి మంచి హోదాలో ఉండే వాడు.

నాటకాలూ, కథలూ మీద ఉన్న 'గురి' చదువుమీద ఉండేది కాదు. ఎంత చెప్పినా వినిపించుకునేవాడు కాదు. చదువుకునేవాడు వీటికి దూరంగా ఉండాలని ఎన్నో నీతులు చెప్పినా, వినిపించుకున్నట్టే నటించి తనకు తెలియకుండానే స్టేజి ఎక్కడమో, కథలు రాయడమో చేస్తుండే వాడు. ఒకనాడు ఏమయ్యిందని—

ఏదో ఫంక్షనికి తనకి ఆహ్వానం వస్తే వెళ్ళారు. ఫంక్షన్ ముగి సిన తర్వాత నాటక మన్నారు. తెర ఎత్తేసరికి స్టేజీమీద శంకరం ప్రత్యక్షమయ్యాడు. ఆ వేషంలో వాడెంత అందంగా ఉన్నాడని. నిజా నికి ఆరోజు వాడు చాలాబాగా నటించాడు. ఎంతోమంది వాడిని ప్రశం సించారు. వస్తుథా వాడు చక్కటి నటుడాయె మరి.

గమ్మత్తేమిటంటే వాడితోపాటు తననిగూడా చాలామంది అభినం దించారు. తనకు బలే సిగ్గనిపించింది గూడాను. ఆమాటకొస్తే తన సర్వీ సులో గూడా యింతటి 'ప్రశంస' తనకి ఎదురుకాలేదు.

ఆ కాసేపూ తనూ కొంత ఆనందించారు కాని.'నాటకాల్లో దిగి పోతే వాడు చెడిపోతాడేమో' నన్న దిగులు ఓమూల మెదులుతూనే ఉంది.

కథలు రాయడంలో గూడా వాడు మంచిపేరు సంపాదించుకున్నాడు. అయితేనేం.తను అనుకున్నట్టే చివరికి వాడు బి. ఎ. తప్పడం,చదువుకి స్వస్తి పలకడమూ జరిగాయి.

ఏమైనా పెద్దవాడిముందు వీడు భ్రష్టుచేసు.

సుబ్బారాజు యింటికి వెళ్ళేసరికి బాగా చీకటిపడింది. గేటు తలుపు తెరుచుకుని యింటి ఆవరణలోకి అడుగు పెట్టారు. సుబ్బరాజు కోడలు కాబోలు తనని చూస్తో అన్నది.

"మావయ్య వూరు వెళ్లారండీ"

మనసు చివుక్కు మన్నది. తిరిగొచ్చేస్తూ అనుకున్నారు.

"శుభవార్త తెలియజేద్దామని వస్తే వీడు లేకపోయె. మళ్ళీ ఎప్పుడు వస్తాడో ఏమో...."

ఇంటికి చేరుకున్నారు. భోజనాలు అయ్యాయి కాబోలు శేషు తన గదిలో కూర్చుని బుద్ధిగా చదువుకుంటున్నాడు. 'వ్వాటీజ్‌దిస్ లైఫ్ యిఫ్ ఫుల్లాఫ్ కేర్'

జానకిరామయ్యగారు భోజనం ముగించి డైరీ రాసుకున్నారు. కాసేపు పడక కుర్చీలో నడుం వాల్చి చుట్ట కాల్చుకున్నారు.

'శేషు సిగరెట్టు కాల్చాడు' - మళ్ళీ శేషు చేసిన తప్పు గుర్తుకు వచ్చింది—కాని యిప్పుడు వాడి చదువు పాడుచేయడ మెందుకని మౌనం వహించారు. ఏదో పుస్తకం తీసి చదువుకోడం ప్రారంభించారు.

గోడ గడియారం తొమ్మిది కొట్టింది.

'వ్వాటీజ్‌దిస్ లైఫ్....యిఫ్....ఫుల్....ఆఫ్....కేర్.'

శేషుకి నిద్ర వస్తోంది కాబోలు. పరీక్షలు ఎప్పుడోగదా—ఇప్పట్నుంచే యింత కష్టపడి చదవకపోతేనేం. యిలా నిద్ర మేలుకుని చదువుతే ఆరోగ్యం పాడవదూ.

ఈ పి. యు. సి.లో క్లాసు రాగానే ఏ ఇంజనీరింగ్‌కో పంపాలి. అంతేగాని బి. ఏ. లు, బి. కాంలతో పనిలేదు. ఆ డిగ్రీలకి ఈ రోజుల్లో బొత్తిగా విలువలేదు.

శేషు గదిలోంచి ఏ శబ్దమూ రాకపోయేసరికి వాడు నిద్రపోతు న్నాడేమో ననిపించింది. జానకిరామయ్యగారు శేషు గదిలోకి వెళ్లారు.

చదువుతూన్న పుస్తకాన్ని గుండెలమీద పెట్టుకుని నిద్రపోతు న్నాడు శేషు.

జానకిరామయ్యగారికి ఆ 'పిచ్చి వెధవ' మీద జాలివేసింది.

శేషు గుండెలమీద నుండి జాగ్రత్తగా పుస్తకాన్ని తీసి టేబిల్ మీద పెట్టారు. దుప్పటి కప్పుతుండగా శేషు వళ్ళు వెచ్చగా తగిలింది. జానకిరామయ్యగారు ఉలిక్కిపడ్డారు.

వయస్సుకి మించిన శరీర సౌష్టవం ఎవళ్ళనైనా ఆకర్షిస్తుంది. శేషుమీద ఎవరి దృష్టయినా తగిలిందో ఏం పాడో ; అస లిలాంటి విషయాలన్నీ ఇంటావిడ చూచుకోవాలి. ఛ....వట్టి బద్ధకం మనుషులు.

చిన్నాడు గూడా తన పద్దెనిమిదో ఏటనే, ఓ పాతికేళ్ళ యువకు డిలా కనుపించేవాడు. వాడి పోలికే అబ్బింది శేషుకి.

శేషుకి దుప్పటి కప్పి లైట్ ఆఫ్ జేయబోతుండగా వాడు ఉలిక్కి పడి లేచాడు. తన గుండెలమీద ఉండాల్సిన పుస్తకం లేదు. యెదుట తాతయ్య నిలబడి వున్నాడు.

"పుస్తకం—"

"నిద్రపోవోయ్....అస్తమానం చదువేనా ?"

"ఎల్లుండి మా క్లాసు ఎగ్జామినేషన్ తాతయ్యా"

"అవుతే—దానికోసం రాత్రంతా చదువుతావా ఏమిటి ? పడుకో ముందు."

* * * *

"మొన్న ఎగ్జామినేషన్లో ఫస్టు మార్కు నాకే వచ్చింది. ఇప్పుడు గూడా రావాలంటే—"

"పోరా భడవా ! ఆరోగ్యం కంటె చదువేం గొప్పది కాదురే. నిద్రపో.... నీలాటి బ్రిల్లియంట్ స్టూడెంట్ చదవకపోయినా ఫస్టుమార్కే తెచ్చుకుంటాడు."

తనమీద తాతయ్యకుగల నమ్మకానికి చిరంజీవి శేషు మురిసి పోయాడు. వాడి కళ్ళు ఆనందంతో మెరిసిపోయాయి.

"మీ ఫాదరుగ్గూడా ఎప్పుడూ ఫస్టు మార్కులే వచ్చేవిరా శేషు ! ఒక్కనాడు గూడా వాని చదువు విషయం అడిగేవాడిని కాదు. స్వయంగా శ్రద్ధతీసుకుని వాడే చదువుకునేవాడు. చదువుమీద వాడి కంత గౌరవం ఉంది కాబట్టి ప్రయోజకు డయ్యాడు. ఆ గౌరవం లేదు కాబట్టి మీ బాబాయి అలా తయారయ్యాడు."

"మాటకి ముందు బాబాయిని అంటావ్‌గాని, బాబాయికెంత పేరుందో నీకు తెలీదు తాతయ్యా. మా ఇంగ్లీషు లెక్చరర్ బాబాయిని తలవని రోజు లేదు. ఆయనగూడా కథలు రాస్తారులే. బాబాయికి ప్రైజ్ వచ్చిందని తెలిసి ప్రతివాళ్ళూ బాబాయి వివరాలు నన్ను అడగటమే. చెప్పలేక చస్తూన్నాననుకో. ఇప్పుడు బాబాయి పేరు ఆంధ్రదేశమంతటా తెలుసు !"

తాతయ్య మీసాలచాటున నవ్వుకున్నారు. శేషు పక్కన కూర్చుని వాడి భుజం తట్టుతూ అన్నారు.

"బాబాయిమీద నీకెంత ప్రేమురా ? వాడిని ఒక్కమాట గూడా అననివ్వవుగదా ! నువ్వు పెద్దాడివై మీ నాన్నంత ఉద్యోగం చేస్తా వనుకో.... అప్పుడు గూడా బాబాయిమీద యింత ప్రేమ చూపిస్తావా ?"

"పో.... తాతా" శేషు సిగ్గుపడిపోయాడు.

"నీకు పెళ్ళయి, పెళ్ళాము వచ్చి పిల్లలు పుట్టినా బాబాయిని మరచి పోకూడదు. బాబాయి, పిన్ని, మీ నాన్నా, అమ్మా, నీ తమ్ముళ్ళూ, చెల్లా

యిలా వీళ్ళందరి క్షేమాన్ని తెలుసుకుంటూ ఉండాలి. అందరూ సుఖంగా బ్రతకాలి" జానకిరామయ్యగారి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"మీ అందర్నీ చూసే భాగ్యం—" ఆయన అక్కడ ఆగిపోయి కళ్ళు తుడుచుకుని మళ్ళీ అన్నారు.

"మీ బామ్మ నాతో చాలాసార్లు అందిరా శేషు. మాకు దేవుడు వందేళ్ళ ఆయుస్సు ప్రసాదిస్తే - మిమ్మల్నందర్నీ చూస్తూ.... ఇది నీకు నవ్వుగా ఉంటుందనుకో....మీ పిల్లల్ని పెంచుతూ హాయిగా కృష్ణా, రామా అనుకోవాలని దాని కోరిక. వట్టి పిచ్చిబాగుల మనిషి. దీంతో యిన్నేళ్ళు ఎలా కాపురం చేశానా అని ఆశ్చర్యంగా వుంటుంది"

"నాన్నా, బాబాయివాళ్ళు సంక్రాంతికి తప్పకుండా వస్తారా తాతయ్యా !"

"రమ్మని రేపే ఉత్తరాలు రాస్తాను. రాకపోతే మీ బాబాయి, మీ నాన్న ఇద్దరి చర్మాలూ వలిచేస్తానని రాస్తాను. సరేనా.... అయ్య బాబోయ్ అప్పుడే తొమ్మిదిన్నర కావొస్తోంది. చిన్నవాళ్ళు ఎక్కువసేపు మేలుకో గూడదు"

శేషుని పడుకోబెట్టి, లైట్ ఆఫ్ జేసి తన గదిలోకి వెళ్ళారు జానకిరామయ్య. పక్కమీద నడుం వాల్చిన తర్వాత మళ్ళీ గుర్తుకు వచ్చింది శేషు సిగరెట్టు కాల్చాడని. 'భడవ! తప్పించుకు పోతున్నాడు' తనలో తను అనుకున్నాడు. ఇంటావిడ మందుసీసాతో లోపలి కొచ్చింది. ఆవిడను చూడగానే అడిగాడు-"నువ్వింకా నిద్రపోలేదా ?"

"సుగుణతల్లి నన్ను నిద్రపోనిస్తేకదా. కథలు చెప్పమని నా ప్రాణాలు తోడేసింది పిచ్చితల్లి. ఒక పట్టాన నిద్రపోదండి. వట్టి మంకు...."

"సరి అచ్చం నీ పోలికే సుమా" ఆయన గబగబా నవ్వేశారు. ఆవిడ సిగ్గుపడిపోయింది.

"ముందు ఈ మందు తాగండి. తర్వాత నవ్వుకుందురుగాని"

ఆవిడ యిచ్చిన మందు తాగారు.

"ఏమిటో యాంత్రికంగా జీవితం గడుస్తోంది" అన్నారు.

ఆవిడ ఆయన పాదాల దగ్గర కూర్చుంది.

"ఒక్కోసారి యిదంతా వట్టి మాయా ప్రపంచమనీ, మరోసారి ఇదంతా నిజమనీ అనిపిస్తుంది. బాధ్యతలూ, త్యాగాలూ చాలా రుచి చూశాం. నువ్వు గమనించావో లేదో గాని మన పెళ్ళయిన కొత్త రోజులకీ ఈనాటికీ చాలా భేదం కనుపిస్తోంది. అప్పట్లో నువ్వు నాకోసం, నేను నీకోసం అన్నట్టు వుండేవాళ్ళం. ఇప్పుడా భావం దూరమయ్యింది. మనిద్దరం కలిపి మరికొందరి శ్రేయస్సుకోసరం బ్రతుకు తున్నట్టున్నది. ఇదంతా నీకు చిత్రంగా కనుపించడంలేదు"

ఆవిడేమీ మాటాడలేదు.

ఆయనే అన్నారు—

"పెద్దాడు పుట్టిన మరుక్షణంనుంచీ ఈ క్షణంవరకు తీరుబడి లేనంత కార్యక్రమాల్లో మునిగిపోతున్నాను. పెళ్ళయిన కొత్తలో రెండు సంవత్సరాలపాటు సరదాగా కాలక్షేపం చేశాననుకుంటాను. ఆ తర్వాత బాధ్యతలు పెరిగాయి. ఆఫీసుపని, పిల్లల పెంపకం, తీరుబడిలేని యీ కార్యక్రమాల్లో విసిగిపోయాను పార్వతీ !"

'పార్వతీ' అనే పిలుపు మళ్ళీ ఇన్నేళ్ళకి చోటు చేసుకోవడంతో అటు జానకిరామయ్యగారు, ఇటు పార్వతీ యిద్దరూ ఆశ్చర్యపోయారు. వెంటనే యిద్దరూ ఏమీ మాటాడలేకపోయారు.

"విధి నిర్వహణలో చాలా విషయాలు పట్టించుకుని పట్టించుకోనట్టు చూడవలసి వస్తుంది. నా ప్రవర్తన నిన్నెప్పుడైనా బాధపెడితే నన్ను క్షమిస్తావు గదూ పార్వతీ !"

"మీరేవో క్రొత్తగా మాటాడుతున్నారు. నాకు బాధేమిటీ. మిమ్మల్ని క్షమించేపాటి దానినా నేను ?"

ఆయన పేలవంగా నవ్వారు.

"పిల్లల్ని పెంచి పెద్దవాళ్ళను చెయ్యడంలో ఉన్న ఆనందం బహు కొద్దిమందికే లభిస్తుంది. నేను అదృష్టవంతురాలిని. నాకే దిగులూ లేదు. దేవుడిలాంటి మీరు, వరాలసాటి పిల్లలూ. స్త్రీకి యింతకంటె కావలసిం దేముంది చెప్పండి ?"

పార్వతి చేతిని ప్రేమతో నిమిరారు జానకిరామయ్య.

అదే సమయంలో...

వీధి తలుపు తీసిన చప్పుడయింది.

"ఏమిటది ?" ఆత్రంగా అడిగారు జానకిరామయ్య.

"శేషు సినిమాకి వెడుతున్నాడు కాబోలు"

"వ్హాట్ !" ఆయిన క్రోధం వచ్చింది.

"పోనిద్దురూ....పసివాడు. సాయంత్రం నుంచీ నా ప్రాణం తీసి చివరికి నన్ను వప్పించగలిగాడు. అదీగాక యివ్వాళ శుభవార్త తెచ్చాడాయె....వాళ్ళ స్నేహితులందరూ కలిసి ఏదో యింగ్లీషు సినిమాకి వెడదామని అనుకున్నార్ట...." ఆవిడ చెప్పవలసినదంతా చెప్పింది. అంతా విని కోపం పట్టలేక అన్నారు జానకిరామయ్యగారు—

"ఇలా సెకండ్ షోలకి వెడితే ఆరోగ్యం పాడవదూ....వాడికేమి లాభంలేదు. అంతా నువ్వు చేస్తున్నావ్. నీకు పిల్లల్ని పెంచడం చేత కాదు. ఇంకా ఎప్పుడు నేర్చుకుంటావో ఏమో. ఫుండు....వాడినీ.... రేపుదయం గుర్తుచెయ్యి వెధవాయి చర్మం వల్చేస్తాను....సినిమాకి వెడతాడు. సినిమాకి...."

చివరికి తేలిన విషయం :

చిరంజీవి శేషుపైన తను తీసుకోవలసిన క్రమశిక్షణ చర్య రేపు ఉదయానికి వాయిదా వేయబడింది.

o—o

# నాకు తెలిసిన కథ

వాచీ చూసుకున్నాను. పన్నెండున్నరయింది.

రోడ్డంతా నిర్మానుష్యంగా ఉంది. ఈ రోడ్డు చూడటాసికి చాలా అందంగా ఉంది. నిలబడ్డ చోటునుంచి ఎతం పక్కన ఒక మైలు పొడుగునా రోడ్డు స్పష్టంగా కనుపిస్తోంది. అక్కడక్కడ చిన్న చిన్న గుంటలు లేకుండా ఉంటే ఆ తారురోడ్డు యింకా అందంగా వుండేవి. రోడ్డు పక్కగా ఫర్లాంగుకి ఒక్కటి చొప్పున పెద్ద పెద్ద చెట్లు తప్పించి నీడలిచ్చే చల్లని చోటు చెప్పుకునేందుకేమీ లేదు.

చాలా దూరంగా ఉన్న పొలాల నుండి వచ్చే చిన్న సైజు రణగొణధ్వని మినహాయించి మరింకో శబ్దం వినిపించడంలేదు. ఎండ తీక్షణంగా వుంది. మే నెల ఎండలు ఈ ప్రాంతంలో దారుణంగానే వుంటాయిట. ఆగి ఆగి వచ్చే వర్షంకంటే తీవ్రమైన ఎండపట్ల ఒక విధమైన అభిమానంగల నాకూ ఈ ఎండని చూస్తూంటె చిరాకు కలుగుతోంది. చేతిలో ఉన్న జేబురుమాలు బాగా తడిసిపోయింది. యిలాంటప్పుడు టర్కీటవలు వెంటనుంటే ఎంత బాగుండేదోగదా!



---

1963, ఆగస్టు—భారతి

బస్సు వచ్చేజాడ కనిపించడంలేదు. అక్కడికి దగ్గర్లోవున్న స్టేషన్లో రైలుదిగి మట్టిరోడ్డు వెంట నడిచి ఈ రోడ్డు చేరుకుంటూండ గానే ఒక బస్సు రావడంగూడా జరిగింది. మరో బస్సు రావడానికి ఎంతసేపు పడుతుందో ఏమిటోగదా ఖర్మం.

ఈ రోడ్డుగానీ, దగ్గర్లో ఉన్న రైలుస్టేషనుగానీ, నేను వెళ్ళ బోయే ఊరుగానీ నా కింతకు మునుపు తెలీవు. అంత అవసరమొస్తుం దని నే నెప్పుడూ అనుకోలేదు. రెండు రోజుల క్రితం కేంప్‌నుంచి అద్దెగదికొచ్చేను. గదిలో రాజేశ్వరి రాసిన ఉత్తరం కనిపించింది. అది గదిని చేరుకుని అప్పటికి వారం రోజులై వుంటుంది. కేంప్‌లో వుండ టంవల్ల నాకు తెలిసిందికాదు. లేకపోతే వారం రోజుల క్రితమే, బిక్కు బిక్కుమనే ఈ రోడ్డుమీద ఇలాగే నిలబడి వుండేవాడిని.

రాజీ ఉత్తరాలకీ, రాజీమాటకీ విలువ వుంది. రాజీ నాకు దూర మైనా, నపట్ల ఆమెకు అలక్ష్యభావ మేర్పడినా ఆమెను గౌరవించ డంలో నా లోపమెన్నడూ లేదు.

ఆమె దేనికీ, ఎప్పుడూభయపడలేదు. భయపడదు. అలాటి రాజీవి ఒక్కసారిగా పిరికితనం ఆవరించింది. ఈ ఉత్తరంలో తన పిరికితనా న్నంతా వ్రాసుకుంది. ఆమె వ్రాసిన ఉత్తరం చదివి కలత చెందడం యిదే మొదటిసారి.

సరిపోయేంత నీడనిచ్చే ఈ చెట్టులేకపోతే ఇంకెంత యిబ్బంది పడిపోయేవాడినో. దిగులూ, కాస్త భయంకూడా కలిగేవి. ఎండ నిప్పులు చెరుగుతోంది. వయస్సులోవున్న నేనే ఈ ఎండకి ఇంత తల్లడిల్లి పోతు న్నానుగదా, అదే ఎండలో వయస్సు మళ్ళిన మనిషెవరైనా నా స్థితిలో వుంటే ?

నేనేనాడూ ఈ ఎండలూ, వడగాల్పులూ వగైరాల గురించి పట్టిం

చుకోలేదు. అథవా ఆ విషయాలెవరైనా నా దగ్గర తీసుకొస్తే చెవొగ్గి వినేవాడినీకాదు. ఎండల గురించి గొప్పగా చెప్పుకునే వాళ్ళ మాటమీద నాకు విశ్వాసం లేకపోగా చులకన భావమూ కలిగేది. అలాటిది నేనీనాడు అనుభవిస్తోన్న శ్రమని గమనిస్తూంటే నాపై నాకే జాలికలిగింది. నవ్వు కున్నాను.

జేబులోంచి సిగరెట్టు తీసి ముట్టించేను. ఒక పర్యాయం రోడ్డు వైపు చూసేను. ఎక్కడా బస్సువచ్చే జాడ కనుపించడంలేదు. చెట్టు మొదట్లో చోటుచేసుకుని కూర్చున్నాను.

వాళ్ళ ఊరుకెలా చేరుకోవాలో ఉత్తరంలో విపులంగా వ్రాసింది రాజీ. మా ఊరునుంచి పదిమైళ్ళు బస్సుమీదొచ్చి అక్కడ రైలెక్కి దాదాపు ఏభైమైళ్ళ ప్రయాణంచేసి ఇక్కడదిగి, మళ్ళా ఇక్కడ్నుంచి పాతిక చిల్లరమైళ్ళు రాదోయే బస్సుమీద వెళ్ళాలిట. మరీ చిన్న పిల్లా డికి చెప్పినట్టు ఈ వివరాలన్నీ దేనికసలూఅని మొదట్లో అనుకున్నాను. గానీ, ఈ ప్రయాణంలో ముఖ్యంగా ఇక్కడ ఇంత అవస్థపడాలని తెలుస్తే అలా కొట్టిపారేసే వాడినికాదు.

మా ఊర్లో కాఫీతాగి తెల్లవారుఝామునే బయలుదేరాను. ఆ కాఫీ నీళ్ళు తప్పించి దార్లో మరేమీ పుచ్చుకోనేలేదు. ఇప్పుడు తెలుస్తుంది ఆకలిబాధ! ఎన్ని సిగరెట్లు కాలుస్తే మాత్రం ఏంలాభం?

వెంటనే మరో భయంకరమైన ఆలోచన తట్టింది. ఇలా సిగరెట్టు మీద సిగరెట్టు తగలేస్తే, మిగిలున్న రెండు సిగరెట్లూ అయిపోడానికి సరిగ్గా పదినిముషాలు పట్టను. అవి కాస్తా గల్లంతైన మీదట, కొను క్కుందామనుకున్నా ఈ అడవిలో ఎవరమ్ముతారు. ఈ ఆలోచనరాగానే, కాల్చే సిగరెట్టుని కాస్త తాపీగా కాల్చడం ప్రారంభించేను.

పాపం....రాజేశ్వరి అక్కడెంత భయపడుతున్నదోగదా....చిన్న విషయాలని భూతద్దంలోంచి చూడటం రాజేశ్వరి కిష్టంలేదని నాకు

తెలుసు. అలాటిది నన్ను వెంటనే ఉన్నపళంగా వచ్చేయమని రాసిం దంటే అక్కడ పరిస్థితి ఎలాగుందో గదా.

భాస్కరాన్ని ఒక్కసారే చూశాను. అయితే మాత్రిం మరిచి పోలేని మనిషి. రాజీ పెళ్ళయిన కొత్తలో ఇద్దరూ మదరాసు వెడుతూ ఒకరాత్రి భవదీయుడి ఆతిథ్యం పొందారు. అతన్ని పరిచయం చేసింది రాజీ. వాళ్ళిద్దరూ నాతో గడిపిన ఆకొద్ది గంటలూ మరో జన్మలోకూడా గుర్తుంటాయనడంలో అతిశయోక్తిలేదు.

అతని భావాలలాగానే భాస్కరం చాలా అందమైన మనిషి.అన్ని విధాల రాజీకి తగిన భర్త.అదృష్టం పండిందని అప్పుడు అనుకున్నాను. లేకుంటె అతడెక్కడ ? నేనెక్కడ ? అతి సాధారణమైన నాలాటి గుమాస్తా బ్రతుక్కి రాజీ భాగస్వామిని అయితే-ఆమె అనుభవిస్తో సుఖ శాంతు లేమయ్యేది.

ఇంకొనయం-మేమిద్దరం కలిసి తిరుగుతున్న రోజుల్లో 'నిన్ను ప్రేమించాను రాజీ !' అని కవిత్వం చెప్పానుగాదు. చెప్పినా ఆ పిల్ల కాదనే మాట నిజం. ఆ పైన భాస్కరాన్ని పెళ్ళాడి 'చూశావా సోదరా! ఇంత భాగాన్ని వదలి నిన్ను పెళ్ళాడతా! అని నీకు మాటిస్తే నాగతే మయ్యేది' అని నా మొహం ముందే అనేసి వుండేది.

నా అంత పిరికివాడూ, మొహమాటస్థుడూ, విశియస్థుడూ మరొ వాడు వుండడు. ఒక విధంగా ఈ సుగుణాలే ఆమె ప్రయోగించబోయే వాడియైన బాణాల్లాంటి మాటలనుంచి నన్ను తప్పించాయని గూడా చెప్పుకోవచ్చు.

రాజీ నేనూ ఒకే ఊళ్ళో పుట్టాము. అక్కడ పెరిగి పెద్దవాళ్ళ య్యాము. మా రెండిళ్ళూ పక్కపక్కనే వుండేవి. రాజీ వాళ్ళనాన్న రాజకీయాల్లో తిరిగి, జైళ్ళకెళ్ళి యిప్పుడు ఒకానొక ప్రముఖ రాజకీయ

వేత్తగా స్థిరపడ్డారు. వాళ్ళకున్న మేడలావి హోదా రోజురోజుకీ పెరిగి పోవడం నిజంగా వాళ్ళ అదృష్టమే. అలాటి వాళ్ళకి నేనెంత ? అందు కనే నోరువిప్పి నా మనసులోని మాట రాజీతో చెప్పలేదు.

ఒక పెద్ద గండం రాజీకి నానుంచే తప్పింది.

తీవ్రమైన ఎండలో నదికోడ్డుమీద నిలబడ్డ నాలాటివాడు జరిగిన కథ నెమరు వేసుకోడానికి తగిన కారణం లేకపోలేదు. ఏమీ తోచని వాడు గోళ్ళు గిల్లుకుంటూ పాత విషయాలు గుర్తుచేసుకుంటూన్నాడంటే ఆశ్చర్యపడ నవసరంలేదు. పైగా—రాజీ రాసిన ఈ ఉత్తరం ఒకటి, గడిచిన కథని యావత్తు కదిలిస్తుంది.

ఏడాదిన్నర క్రితం సంక్రాంతికి సెలవుపెట్టి మా ఊరు వెళ్లాను. రాజీ పుట్టింటికి వచ్చిందని తెలిసింది. ఆ సాయింత్రం వీలు చేసుకుని ఆమెను పలుకరించడానికి వెళ్ళాను. అప్పుడు రాజీ చాలా కొద్దిసేపు మాత్రమే మాటాడింది. అవుతే ఆ మాటల వెనక—ఆమె మనసులో ఏదో దాచుకున్నట్టు కనపించింది. ఆమె మొహంలో ఏదో వెలితి, ఆమె మాటల్లో ఏదో నిరుత్సాహం పసిగట్టాను. ఏమైనా రాజీ మునుపటి రాజీలా లేదు. ఆ మార్పుకి కారణమేమిటో నాకై నేను అడగాలనిపించ లేదు. వెంటనే తిరిగి ఇంటి కొచ్చేను.

భోజనాల దగ్గర చెల్లి చెప్పింది. రాజీకీ, వాళ్ళాయనకీ యేవో భేదాభిప్రాయాలు వచ్చేయిట. అతనితో పోట్లాడి పుట్టింటికి వచ్చేసిం దట. మళ్ళా తిరిగి ఆ యింటికి వెళ్ళనని మంకుపట్టుపట్టి కూర్చుందిట.

అదిరిపోయాను.

మంచి మనుషులు చాలా కొద్దిమంది ఉంటారు. వాళ్ళ మంచి తనం ఒక పట్టాన పూర్తిగా బోధపడదు. నిజమేనేమో. కాకుంటే, భాస్కరంలో యింత ఊహించరాని పొరపాట్లే మున్నాయి ? అతను భార్యని ఆదరించలేనంత మూర్ఖుడా ! నేను నమ్మలేక పోయాను.

ఆఫీసు కెళ్ళాల్సిన కిత్రితంరోజు రాజీ కబురు పెట్టింది. వెళ్ళాను. కాఫీ యిచ్చింది. తాగేను. వెళ్ళిపోతున్నావటగా అన్నది. అవునన్నాను. మళ్ళీ యెన్నాళ్ళకి కలుసుకుంటామో నన్నది. నవ్వి ఊరుకున్నాను. ఏమి మాటాడాలో రాజీకూ్కడా తోచింది కాదేమో. సప్న. ఖబుర్లు చెప్పమన్నది. నేనేం చెప్పలేదు.

కాసేపటికి నే నడక్కుండానే భాస్కరం గురించి చాలా చెప్పింది. విన్న తర్వాత భాస్కరం పట్ల గౌరవం పెరిగిందేగాని, అతని పట్ల నా నమ్మకం చెదిరిపోలేదు.

భాస్కరం వాళ్ళు ఏమంత ఉన్నవాళ్ళు కారుట. అతను చదువు కుంటూన్న రోజుల్లో సుభద్ర అనే అమ్మాయితో అతనికి పరిచయం వుండేదిట. భూమి గుండ్రంగా తిరుగుతుందన్న మాటెంత నిజమో, ఆడపిల్లల్తో పరిచయం ప్రేమకోకి దించదమన్నది అంత నిజమని మా శోభనాచలం అంటూండేవాడు. సుభద్రని భాస్కరం మనసారా ప్రేమించాడు. పెళ్ళి చేసుకుంటానని మాటా యిచ్చాడుట. సుభద్ర ఒక పేద బడిపంతులి కూతురు. ఆ పిల్ల భాస్కరాన్ని నమ్ముకుంది.

అలాటిది కాస్తా భాస్కరం తాలూకు బుద్ధిహీనతవల్ల ఆ పిల్ల జీవితంలో ఓడిపోయింది. భాస్కరం వాళ్ళనాన్నగారి మాటని కాదనలేక పోయాడు. ఆయన తన బాగుకోసం, తన సుఖంకోసం చేసే ప్రయత్నాలకు తలొంచాడు. రాజీని పెళ్ళి చేసుకున్నాడు. కాని సుభద్ర ఆశలనీ, ఆ బడిపంతులి గౌరవాన్నీ మంటలో కలిపాడు.

ఈ విషయాలన్నీ రాజీతో మరొకర్ఘ్యా చెబితే భాస్కరాన్ని కొంతైనా శంకించడానికి అవకాశముండేది. కానీ, సాక్షాత్తు భాస్కరమే ఇవన్నీ చెప్పాట్ట.

రాజీ అన్నది —

"ఒక మాటు చెప్పి ఊరుకుంటే నేనంత పట్టించుకునే దాన్ని కాదు. రోజూ ఆయన ప్రేమకథ చెప్పి 'నాకు నిష్కృతి ఉందా రాజీ! నేను ద్రోహిని కదూ!' అంటూ నా చెవిదగ్గర యిల్లు కట్టుకుని చెపుతూంటే వినేదానికి నా కెలా వుంటుంది? నేను వారికి భార్యని. నాకు చెప్పవలసినవీ, చెప్పి నొప్పించకూడనవీ వుంటాయి. ఆ యింగితం లేదు. కేవలం నా సహనాన్నీ, నా మంచితనాన్నీ పరీక్షించాలనే ఉద్దేశ్యంతో మితిమీరి పోతూంటే నేనేమైపోతాను? నాగురించి ఆయనేమైనా ఆలోచిస్తున్నారా? భార్యల ముందు తన ఘనతనిలా చాటి చెప్పుకోవడం సంస్కారమా? నిజం రావ్! విసిగిపోయాను."

ఇదంతా విని నేను చాలా బాధపడ్డాను.

మనిషిలో బలహీనత ఎంతపనైనా చేస్తుంది. అతని బలహీనత రాజీ ఉద్దేశ్యంలో నేరమేకావచ్చు. తాను లోగడ చేసిన తప్పుకి జీవిత పర్యంతం దిగులు పడటం, ఎదటివారి సానుభూతి పొందడానికి ప్రయత్నించడం ఏమంత ఆశ్చర్యమైనదీ, చిత్రమైనదీ కానేకాదు.

రాజీకి ఎన్నో విధాల నచ్చచెప్పాను. ఆమె నా మాటలు వినిపించుకోలేదు. అంతలోనే విషయం మార్చి నా పెళ్ళి ప్రయత్నాల గురించి మాటాడింది. జవాబు తిన్నగా చెప్పడం ఇష్టంలేక ఇంటి కొచ్చేశాను.

రెండు నెలలు తర్వాత రాజీ దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. రాజీ భాస్కరం దగ్గరికి వెళ్ళిపోయిందిట. అతనికి తీవ్రమైన జబ్బు చేసిందిట. కడుపులో ఏదో పుండు పుట్టిందని వైద్యులు నిర్ణయించారు. ఆపరేషన్ చేశారు. ఆ విషయం భాస్కరం రాజీకి వ్రాయలేదు. రాజీ మావగారు చాలా భయపడుతూ ఉత్తరం వ్రాశారుట. ఆ ఉత్తరం చదివి క్షణమైనా ఆలస్యం చెయ్యకుండా వెళ్ళిపోయిందిట.

అతనికి ఆపరేషన్ జయప్రదంగా ముగిసింది. రాజీ మనసు

కుదుటపడింది. 'ఇంత జబ్బులో వుండికూడా మీరు నాకెందుకు ఉత్తరం వ్రాయలేద'ని రాజీ అడుగుతే అతను నవ్వి అన్నాట్ట 'రాజీగారికి భక్తుడి మీద కోపం గదా మరి' అని. రాజీ వ్రాస్తుంది. 'ఇంత మంచి మనిషిని నేనెందుకు అపార్థం చేసుకున్నానా' అని యిప్పుడు చింతిస్తున్నాను. నన్ను దేవుడుగూడా క్షమించలేడు'

నవ్వు వచ్చింది నాకు.

ఆడవాళ్ళందరూ ఇంతేనా ? లేక మా రాజీ ఒక్కర్తేనా ? తన తప్పుని తాను చెప్పుకుని కుళ్ళి పోతున్నప్పుడు అర్థంగాని అతని 'మంచి తనం' ఈరోజున ఆపరేషన్ జరిగి స్వస్థత చేకూరిన తర్వాతగానీ అర్థం కాలేదంటే, నవ్వురాదూ మరి. ఇందులో ఆమెకు కనిపించిన 'మంచితనం' ఏమిటో మా రాజీ కొక్కర్తెకే తెలియాలి.

ఆ తర్వాత ఆమె దగ్గర్నుంచి వచ్చిన ఉత్తరాలన్నీ సవ్యంగానే వున్నాయి. వాళ్ళాయిన ఆమెపట్ల ఎంత అభిమానం, ఆదరణా చూపిస్తుం టారో; వాళ్ళాయన ఎంత చక్కగా బొమ్మలు గిస్తారో; వాళ్ళాయన ఎంత తియ్యగా పాడతారో వగైరాలే ఆ ఉత్తరాల తాలూకు ముఖ్య విషయాలు.

కానీ మొన్న వచ్చిన ఉత్తరంలో —

దూరంగా బస్సుమోత వినిపించింది. ఆత్రంగా లేచి నిలబడ్డాను. ఒళ్ళు దులుపుకుని రోడ్డుమీదకు వచ్చాను. అప్పటివరకూ నీడచాటున కూర్చుని హఠాత్తుగా ఎండలోకి వచ్చానేమో కళ్ళు తిరిగాయి. వళ్ళు తూలినట్టయింది. సర్దుకు నిలబడి రోడ్డు చివరివైపు దృష్టి నిలిపాను. అంత దూరంలో ఎఱ్ఱటిదుమ్ము మబ్బులాగా పైకి లేచింది. ఉన్నకొద్దీ బస్సు దగ్గరవుతున్నట్టు మోత వినిపిస్తోంది. అమ్మయ్య బ్రతికేను.

బస్సు ఫర్లాంగు దూరంలో ఉందనగానే చెయ్యెత్తి నిలబడ్డాను. బస్సు వచ్చింది. జాలిలేని దానిలా నన్ను దాటనూ దాటింది. ఎండలో

దిక్కుతోచక చస్తున్న నా మొహాన్ని యింత దుమ్ము ప్రసాదించి మరీ వెళ్ళిపోయింది.

బస్సు కనుమరుగైన తర్వాత ఏడుపొచ్చింది. బస్సు తప్పిందే అన్న బాధకి ఈ ఎండొకటి జతయ్యింది. గబ గబా చెట్టు మొదట్లోకి వెళ్ళిపోయి నా చేతుల్లో మొహాన్ని కప్పుకుని కుళ్ళి కుళ్ళి ఏడిచాను. జీవితంలో చాలా తక్కువ మాట్లు ఏడ్చిన వాళ్ళలో నే నొకడ్ని. బాగా గుర్తుండి పోయే ఏడుపుల్లో అదొకటి.

ప్రకృతి యావత్తూ నామీద పగబూనినట్లుంది. 'మానవాధముడిని బుగ్గి చెయ్యవలె' అన్నట్టు నా పైన విజృంభిస్తోంది. దాహం. గొంతుక ఆరిపోయింది. ఆకలి. మెలికలు తిరిగిపోతున్నాను. గట్టిగా అరవాలని వుంది. అరిచినా అడవిలో మొరాలకించేనాథు డెవడూ ఉండడు. ఉన్నా వచ్చి ఆదుకునే సహృదయతా ఉండదు. పోతే, నాకు చాతనయ్యింది ఏడుపు. అయినా వోపికలేని తర్వాత ఏడుపుమాత్రమే మొస్తుంది నా పిచ్చిగానీ.

దిగాలుపడిపోయాను.

ఇక్కడ నా స్థితి ఇంత అధ్వాన్నంగా ఉంది. అక్కడ రాజీ ఎంత ఖంగారు పడిపోతుందోగదా. ధైర్యం చెప్పటానికి ఆత్మీయుల సాన్నిధ్యం ఎంతైనా అవసరం. రాజీ ఉత్తరం రాసి పదిరోజులు గడిచాయి. ఏరోజు కారోజు నాకోసం ఎదురుచూస్తూనే ఉంటుంది పాపం. నే నెంతకీ రాకపోవడంతో నన్నేవిధంగా భావించినదో ఏమో ;

పిచ్చెత్తినట్టయింది. కసిగా పళ్ళు కొరుక్కున్నాను.

మళ్ళా కారు శబ్దం వినిపించింది. ఒక నిశ్చయానికి రావడం గూడా జరిగింది. ఏం జరిగినా సరే —రోడ్డుకి అడ్డంగా నిలబడాలి. నా

10)

అవసరాన్ని చెప్పుకోవాలి. వింటారా సరేసరి. లేదూ—దౌర్జన్యం చేసైనా సరే నా కోరిక నెరవేర్చుకోవాలి. ముందు ఈ రాకాసి ఎండ బారినుంచి తప్పుకుంటేనే గాని నాకు మనశ్శాంతి లేదు.

అప్పటికే రోడ్డు మధ్యన నిలబడి ఉన్నాను. ఎండ తీక్షణంగా ఉంది. వడగాడ్పు రివ్వున వీస్తూనే ఉంది. దాహం, ఆకలి. కాళ్ళు తేలి పోతున్నాయి. కళ్ళు తిరుగుతున్నాయి. శక్తినంతా కూడగట్టుకుని అలాగే నిలబడిపోయాను.

ఒచ్చేది చిన్నకారు. వేగంగా వస్తోంది. వొచ్చేసింది. రెండు చేతులూ చాపి నిలబడ్డాను. అంతే నా వళ్ళు తూలిపోయింది. నేలమీద ఒరిగిపోయినట్టు జ్ఞాపకం.

* * * *

కళ్ళు విప్పాను. మంచంమీద పడుకున్నట్టు గ్రహించగలిగాను. గభాలున లేచి కూర్చున్నాను.

"నో....నో....లేవకండి" అన్నాడతను.

అతనికి పాతిక సంవత్సరా లుంటాయి. మనిషి అజానుబాహువు. ఎత్తుకి తగ్గ శరీర సౌష్టవం తీర్చిదిద్దినట్టుంది. అతని చేతిలో తుపాకి వుంది. తుపాకిని తుడుస్తూ కిటికీదగ్గర కూర్చుని ఉన్నాడు.

చిన్న గదైనా చక్కగా అలంకరించి వున్నది. ఎక్కువ భాగం దుప్పి కొమ్ములూ, పులి చర్మాలూ వగైరాలే ఆ గదికి అలంకారాలు. టైం మూడయ్యింది.

"పాపం...ఆ ఎండలో ఎంతసేపట్నుంచి నిలబడి వున్నారో" చేతిలోని తుపాకిని గోడమీద మేకులకు తగిలిస్తో అతనే అన్నాడు.

"ముందు ఈ నిమ్మరసం తాగండి" అన్నాడు గ్లాసు నా ముందుంచుతూ.

గబగబా తాగేశాను. అతను నావైపు తృప్తిగా చూశాడు.

"నా పేరు సత్యనారాయణ. పరిచయస్థులు సత్యమని పిలుస్తారు. మీరీ ప్రాంతాలకి కొత్తవాళ్ళనుకుంటాను"

అవునన్నట్టు తలూపి, మా వూరుపేరు చెప్పాను.

"అలాగే కనిపించారు. ఒక విధంగా నేను కృష్ణాజిల్లా వాడిననే చెప్పాలి. మా పెత్తల్లి నన్ను దత్తత చేసుకోడంతో యీ జిల్లా వాడినై పోయాను. చదువు సంధ్యలు కృష్ణాజిల్లాలోనే జరిగాయి. చదువైన తర్వాత ఉద్యోగం చేయవలసిన అవసరం లేకపోవడంతో ఈవూరొచ్చి పొలం గట్రా చూసుకోడం మొదలెట్టాను. కాలం గడవటానికి 'వేట' ని అలవాటు చేసుకున్నాను. ఈ చుట్టు పక్కల అడవులు వేటకి అనువైనవి. వేటనుంచి తిరిగొస్తూండగానే మీరు కలిశారు. ఆవేళ వేటలో చేతికి పని దొరకలేదు" అన్నాడు అతను నవ్వుతూ.

నాకు వేటగాళ్ళన్నా, వేట అన్నా మొదట్నుంచి సదభిప్రాయం లేదు. కారణం లేకుండానే అభిప్రాయాలు చెప్పడం చాలామందికి నచ్చకపోయినా ఇది మాత్రం నిజం. సాధారణంగా వేటపట్ల అభిమానం చూపేవాళ్ళకి లోకమంతా ఆ 'జంతువులే'నని నా వూహ. అది హాస్యాస్పదమైతే కావచ్చు. అయినా యీ భావం నానుంచి దూరం కాలేదు.

వేటమీద అతనికిగల మోజు నాకు భరించరానిదేనైనా, సత్యం పట్ల నాకా క్షణంలో గౌరవం కలిగింది. అతనో వేటగాడైతేనేం ? ఆ చనువూ, ఆ స్నేహం.... చాలు.

"ఆ కారు.... మీదేనా ?" నిర్ధారణ చేసుకునేందుకు అడిగాను.

"అవును. గర్వం కాదనుకుంటే నేను బ్రహ్మాండంగా డ్రైవ్ చేయగలను. అంత స్పీడులో వస్తున్న కారులో, స్టీరింగుదగ్గర నే కూర్చోకపోతే మీకు గొప్ప ప్రమాదం జరిగుండేది" చివర్న నవ్వేశాడు.

"థాంక్స్" అన్నాను.

గుమ్మం దగ్గర అలికిడయ్యింది. ఒకావిడ అక్కడ తచ్చాడుతుం డటం గమనించాను. అతను ఆమెను చూచి అన్నాడు.

"లోపలికి రా"

ఆమె వచ్చింది. అతని కుర్చీపక్కన నిలబడ్డది.

"వీరు...." అతను నన్ను ఆవిడకి పరిచయంచేసే ఉద్దేశాన్ని నా పేరు తెలీకపోవడంతో ఆ క్షణానికి ఆపుకున్నారు.

సిగ్గుపడ్డాను. ఇంతవరకూ కనీసం నా పేరైనా చెప్పకపోవడం అన్యాయమే మరి. పేరు చెప్పాను.

"కొండదేవర గుట్ట దగ్గర స్పృహతప్పి పడిపోయారు." ఆ దంపతుల సంస్కారానికి ముచ్చటపడ్డాను.

అంతలో పనిమనిషి పళ్ళూ, బిస్కట్లూ, పాలూ తీసుకొచ్చింది. అవి టీపాయ్‌మీదుంచి వెళ్ళిపోయింది.

"అవి తీసుకోండి" అత నన్నాడు.

సత్యం వేటగాడైతేనేం— అతని ఆదరణ ?

"అవసరమైన పనుంటేనేగాని యీ ప్రాంతాల్లోకి ఎవ్వరూరారు. మన జిల్లాలవాళ్ళ కిక్కడేం తోచదసలు. అన్నట్టు అడగడం మరిచాను. ఏవూరు వెడుతున్నారో ?"

చెప్పాను.

" ఆ ఊరు వెళ్ళాలంటే బస్సుకోసరం మళ్ళా మీరు కొండదేవర గుట్ట దగ్గరికే వెళ్ళాలి. మనం ఆ గుట్టకి మూడు మైళ్ళ పక్కనున్నాం"

"ఈ రాత్రికి నేను వెళ్ళిపోవాలి"

"ఈపక్క ప్రయాణాలు అనుకున్నంత తేలికాదు మాస్టారు. బస్సులు వాటిష్టమొచ్చినప్పు డొస్తాయి. పైగా చీకటి పడిందంటె ప్రయా ణాలు తప్పనిసరిగా మానుకోవాలి. ఈ రీ పూట కిక్కడ భోజనం

చేయండి. రేపుదయం మిమ్మల్ని బస్సెక్కించే బాధ్యత నాది. సరేనా" అన్నాడతను అనునయంగా.

మరొకప్పుడైతే అలాగే ఉండిపోదును. కానీ —

"అవసరంగా వెళ్ళాలి. ఉత్తరమొచ్చి పదిరోజులైంది. భాస్కర మని నా మిత్రుడు చావు బ్రతుకుల మధ్య నున్నట్టు ఉత్తరంలో వుంది. ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది. వాళ్ళకి నేను చాలా కావలసిన మనిషిని...."

ఇంకా ఏం చెప్పేవాడినో తెలీదుగాని వాళ్ళిద్దర్లో ఎవ్వరూ మాటాడ కుండా గుడ్లప్పగించి నావైపు చిత్రంగా చూడటంతో మాట లాపేశాను.

క్షణంలో ఆవిడ పూర్తిగా మారిపోయింది. తలొంచేసింది. చేతుల్తో కళ్ళు మూసుకుంది. వెక్కి వెక్కి ఏడుస్తోంది. అతను ఆమెను దగ్గరికి తీసుకున్నాడు.

"ఏమిటిది సుభద్రా!? మరీ పసిపిల్లలా. తప్పు కదూ !"

సుభద్ర ! సుభద్ర ! నా చేతిలోని యాపిల్‌పండు ప్లేటులో ఉంచి ఆ యిద్దరి వైపూ చూస్తూండిపోయాను. అతను నా అవస్థని గమనించేడు కాబోలు -

"మరేమీ లేదు. మీరేం ఖంగారు పడకండి రావుగారూ. సుభద్ర కాస్త సుస్తీ మనిషి అంతే" అన్నాడు.

ఆవిడ అతని మెడని కావిలించుకుంది. అతను ఆమెను పక్క గదిలోకి తీసుకెళ్ళాడు.

నాకేం తోచకుండా ఉన్నది. దారిని పోతున్న దానయ్యని యిలా రావడమేమిటీ. వచ్చి వాళ్ళ ఆతిధ్యం పొందడ మేమిటీ. పొంది వాళ్ళ మనస్సు నొప్పించేలా మాటాడట మేమిటి ?

ఇంతకీ భాస్కరం ప్రియురాలు సుభద్ర. ఈ సత్యం భాస్క

సుభద్ర యిద్దరూ ఒక్కళ్ళేనా ? ఈమాటు సత్యం నాకు నచ్చని అస లైన వేటగాడి బొమ్మ రూపంలో నా కళ్ళముందు తచ్చాడినట్టయింది. కొంచెం భయపడ్డాను.

మరో పది నిమిషాల్లో సత్యం నా గదిలోకి రానే వచ్చాడు. నన్ను కూర్చోమని చెప్పి అన్నాడు.

"సుభద్రకి ఫిట్సు రావడం కొత్త కాదు. ఈ పల్లెటూళ్లో నేటి వైద్య లోక రున్నారు. ఖబురంపాను. రేపుదయానికి మీ ప్రయాణం యెటూ వాయిదా వేసుకోవలసిందే. తప్పదు. కొంచెంసేపు రెస్టు తీసు కోండి. మళ్ళీ భోజనానికి పిలుస్తాను" అని చెప్పి నామాటైనా వినకుండా వెళ్ళిపోయాడు.

చాలా తమాషైన సన్నివేశంలో ఇరుక్కున్నాను. ఆలోచనలతో తల వేడెక్కిపోతున్నది. తలుపుకి గడియవేసి మంచంమీద వాలిపోయి గట్టిగా కళ్ళు మూసుకున్నాను.

తలుపు శబ్దమైతే కళ్ళు విప్పాను. తలుపు తీశాను. నౌకరు నిల బడి ఉన్నాడు. అతని చేతిలో టవలూ, సబ్బూ ఉన్నాయి. స్నానం చేయవలసిందిగా చెప్పాడు. దొడ్లోకి వెళ్ళాను.

స్నానం ముగించి నా గదిలోకి వచ్చేసరికి సత్యం కుర్చీలో వున్నాడు. సిగరెట్టు ముట్టిస్తూ —

"సుభద్రకి మళ్ళా తెలివి తప్పింది. మరో గంటలో స్పృహ వస్తుందని వైద్యుడు చెప్పాడు" అన్నాడు.

మనసులో నొచ్చుకున్నాను.

"ఆ.... అన్నట్టు మీ మిత్రుడికేం జబ్బుట్రా ?" అడిగాడు తాపీగా.

"లోగడ అతనికి కడుపులో పుండు పుట్టింది. ఆపరేషను చేసి

బాగుచేశారు. మళ్ళీ మొన్నీ మధ్యనే అలాంటి జబ్బేదో వచ్చిందిట. హాస్పటల్లో చేర్చారుట. చాలా గాభరా చేస్తున్నట్టు ఉత్తరం వచ్చింది"

ఇక్కడ కాసేపాగి, అతని మొహంవంక పరిశీలనగా చూచి మళ్ళా మొదలెట్టాను.

"నాకు భాస్కరంతో అట్టే పరిచయం లేదు.వాళ్ళ అత్తగారిఊరు, మా వూరు కావడంవల్ల వాళ్ళాపిడ ద్వారా అతను నాకు తెలిశాడు" అన్నాను.

అతనేం మాటాడలేదు. తన నొసటిని చేత్తో రాసుకున్నాడు.మరో చేతిలో సిగరెట్టు వెలుగుతోంది. రెండు క్షణాలు నిశ్శబ్దంగా గడచిన తర్వాత వాచీ చూచుకొని అన్నాడు.

"అప్పుడే ఏడైపోయింది. మీరు భోజనానికి లేవాలి మరి"

భోజనం నా కొక్కడికే వడ్డించారు. అతను నవ్వుతూ అన్నాడు.

"సుభద్రా నేను తర్వాత భోంచేస్తాము. ముందు మీరు కానివ్వండి"

మధ్యాహ్నం పీడించిన ఆకలి యిప్పుడు లేదు.ఎలాగోలా భోజన మయ్యిం దనిపించుకున్నాను. అతను వక్కపొడి డబ్బి,సిగరెట్టు పాకెట్టు నా ముందుంచి __

"అవసరమైతే పిలవండి. ఈ రాత్రికి కమ్మగా నిద్రపోండి" అన్నాడు గది దాటుతూ.

చిత్రమైన ఆతిథ్యం !

నిద్ర పట్టడంలేదు. ఆ యింట్లో అంతా నిశ్శబ్దంగా ఉంది. అందరూ నిద్రపోతున్నట్టున్నారు. ఏమీ తోచకపోడంతో మంచంమీంచి లేచాను. వాచీ చూసుకున్నాను. పది గంటలు. గదిలోంచి వరాండాలోకి వొచ్చాను. సత్యం కనిపించాడు. పేముకుర్చీలో తలని పైకెత్తి ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. నన్ను చూడగానే సర్దుకు కూర్చుని అడిగాడు.

"నిద్రి పట్టడంలేదులా గుంది."

"అవును."

"పాపం....మనసంతా మీ మిత్రిడిమీద వుండి ఉంటుంది"

ఏమిటీ పరామర్శ ?

"ఒక విషయం అడిగేదా?" అన్నా డతను.

"అడగండి"

"మీకు సుభద్రిగురించి ఏమీ తెలీదా?"

ఉలిక్కిపడ్డాను. ఈ రకమైన ప్రిశ్న యింత హఠాత్తుగా అడుగు తాడని తెలీదు నాకు. వెంటనే జవాబు చెప్పలేకపోయాను.

"నిజం చెప్పాలి"

"మీరు ఏ సుభద్రి గురించి అడుగుతున్నారో అర్థంగాకుండా ఉంది."

అతను నవ్వేశాడు. తర్వాత అన్నాడు.

"నే నూహించినంత వరకూ మీకు ఇద్దరు సుభద్రిలు తెలుసు. అవునా ?"

యిలాటి మనిషికి నేనేమని చెబితే నచ్చుతుంది?

"నిజానికి నాకే సుభద్రి తెలీదు. రాజీ చెప్పిన మీదట భాస్క రానికి ఎవరో సుభద్రి అనే అమ్మాయితో పరిచయ మున్నదన్న సంగతి మినహా మరింకేమీ తెలీదు" అన్నాను.

అతను తేలిగ్గా నవ్వేడు. చూస్తుంటే యీ మనిషికి నవ్వడం 'హాబీ'గుంది.

"సాక్షాత్తు ఆ సుభద్రే నా భార్య ! ఇది మీరీపాటికి వూహించే వుంటారు. అవుతే యిది నిజమా అని నన్ను అడగ సంశయించి వూరు కున్నారు. కదూ?"

సత్యం మనసులు చదవగల [illegible]వరి. అప్పటికీ నేనేం మాటాడ లేదు.

"సుభద్ర మా మాస్టారి కూతురు. నాకు భాస్కరం బాగా తెలుసు. అతను సుభద్రనెంత ప్రేమించిందీ, ఆ దరిమిలా అత నెవర్ని పెళ్ళి చేసుకున్నదీ తెలుసు. ఆ తర్వాత మాస్టారి అనుమతిమీద సుభద్రని నేను పెళ్ళి చేసుకున్నాను. నాదగ్గర అన్నీ వున్నాయి. భాస్కరానికిలేని ఆస్తీ, హోదా, పరపతీ అన్నీ వున్నాయి. కానీ మాస్టారూ! నేను భాస్కరాన్ని కాదు. కాలేను" అన్నాడు బాధగా అతను.

నా మనసు చివుక్కుమంది.

ఆ తర్వాత అతనేదో మాటాడా లనుకున్నాడు గానీ మాటాడలేక పోయాడు. నా చేతిని గట్టిగా నొక్కుతూ.

"పోయి పడుకోండి ప్లీజ్" అన్నాడు.

ఆ ఉదయం మేమిద్దరం అతని కారుమీద కొండ దేవరగుట్ట దగ్గరికి బయలుదేరాం. కాని అతను కారుని అక్కడ ఆపలేదు. తిన్నగా తీసుకొచ్చి నిన్న నే దిగిన రైలు స్టేషను దగ్గర ఆపేడు. నా కిదేం అర్థంకాలేదు. కారు దిగుతూ అదే అడిగాను.

"మరో పావుగంటలో మీవూరికి రైలుంది తిరిగి వెళ్ళిపోండి"

"నేను వెళ్ళవలసింది. మావూరుకాదు భాస్కరం వాళ్ళ ఊరు"

అతను నామాట వినిపించుకోలేదు. స్టీరింగ్ దగ్గర కూర్చుని దోరు లాక్కుని అన్నాడు—

"భాస్కరం యింక లేడు మాస్టారు! నలుగు రోజుల క్రితమే ఈ దారుణం జరిగింది.

నా నెత్తిన పిడుగు పడినట్లయింది. ఇంకా వివరించి చెప్పవలసిన బాధ్యత అతనిది. కాని అప్పటికే అతని కారు చాలాదూరం వెళ్ళిపోయింది.

o—o

# ముగ్గురు ప్రేమికులు

శకుంతల గురించి నాకు తెలిసినంతవరకూ వ్రాస్తాను.

మామయ్యకి యిద్దరాడ పిల్లలూ, ఒక మగపిల్లవాడూను. మావయ్యకీ మాకూ బంధుత్వం నా చిన్నతనంలోనే దూరమయ్యింది. మా రెండు కుటుంబాల మధ్యా పెద్దన్నయ్య పెళ్ళిలో తగాదా వచ్చింది. చినికి చినికి గాలివానలా ఆ తగాదా పెద్దదై ఈ నాడేమో ఆ యింటిమీద కాకి మా యింటిమీద వాలడమే గొప్ప నేరంగా పరిణమించింది.

అనసూయమ్మ మావయ్యగారి పెద్దమ్మాయి. ఆమెకి అన్నయ్యతో పెళ్ళి చేద్దామన్నారు మొదట్లో. ఇంజనీరింగు పూర్తిచేసి వచ్చిన అన్నయ్య ఆ పెళ్ళి వొద్దన్నాడు. ఆ మాటే నాన్న మావయ్యతో చెప్పేరు. అన్నయ్య మనస్సుని మార్చేందుకు నాన్న ప్రయత్నాలేవీ ఫలించలేదు.

దాంతో నాన్నమీదా ఆయన వ్యక్తిత్వం మీదా మావయ్య విరుచుకుపడ్డారు. 'పిల్లల్ని అదుపులో పెట్టలేని నీ పెద్దరికం తగులడనా' అని దెప్పిపొడిచేవారు. నాన్న అభిమానం దెబ్బతిన్నది. మావయ్యతో కలహం తప్పనిసరైంది.

2-8-68 ఆంధ్ర సచిత్ర వారపత్రిక

ఈ కలహానికి ముఖ్యమైన కారణం అన్నయ్య. అయితే దీన్ని అప్పుడూ యిప్పుడూ గూడా పట్టించుకోలేదు వాడు. అంతస్థుని ఎక్కబోతున్నాడు. పైకి పోయేందుకు చేయూత కావాలి. ఆ అవకాశం రేణుక వొదిన వాళ్ళవల్ల తప్పకుండా కలుగుతుందనే ఆశ వాడికుంది. పై పెచ్చు వొదినవాళ్ళ అన్నయ్య వాడికి ప్రాణమిత్రుడు, సహపాఠీను. వొదినగారి నాన్నగారు 'మినిస్ట్రీ'తో సంబంధమున్న వ్యక్తి. ఏవిధంగా చూచినా అన్నయ్యలాటి వాడికి రేణుక వదిన తగిన వధువు.

నిజమే....తన శ్రేయస్సుకి, సుఖానికి తనే మెట్లు వేసుకోవాలి. ఎవరు కాదన్నా ఈ ప్రయత్నాలని విరమించకూడదు. అన్నయ్య చేసింది మంచిపనే.

ఒకనాడు అన్నయ్య మాటని కాదనలేని నాన్న నన్ను చులకన చేశారు. తన సుఖంకోసం ఆరాటపడిన అన్నయ్య నా మనస్సుని శాసించి నా సుఖాన్ని దూరం చేశాడు. యిదెక్కడి న్యాయం? మా యింట్లో అన్నయ్యకున్న పాటి అధికారం నాకు లేదా? నాన్నకి అన్న యొక్కటీ, నే నొక్కటీనా?

శకుంతలతో నాకు పరిచయం కలుగకపోతేనే బావుండేది. కాలేజీ చదువుకోసం బందరు వెళ్ళాను. అక్కడే మావయ్యవాళ్ళు కాపురం వుంటున్నారు. మావయ్య రిటైరయ్యారు. భాస్కరంబావ ఆ వూళ్ళోనే ఉద్యోగం చేస్తున్నాడు. మావయ్య వాళ్ళు 'లేనివాళ్ళేమీ' కాదు. ఆ వూళ్ళో రెండు యిళ్ళు,చుట్టుపక్కల పొలాలూ వున్నాయి.

నేను చదువుకునేందుకు వెళ్ళేముందు నాన్న హెచ్చరించేరు గూడాను.

"నువ్వు వెళ్ళేది బందరు. ఆ వూళ్ళో మనకి గిట్టనివాళ్ళు చాలా మంది ఉన్నారు. వెనకా ముందూ ఆలోచించిగానీ ఏ పనీ చెయ్యకు. చదువు జాగ్రత్త."

తల వూపి వచ్చేశాను.

కాలేజి హాస్టల్లో ఉండి చదువు ప్రారంభించేను. సంవత్సరం యే గొడవా లేకుండా జరిగింది. శ్రద్ధగా చదివి అటు తోటి విద్యార్థుల తోనూ, యిటు క్లాసు లెక్చరర్లతోనూ 'మంచి' అనిపించుకున్నాను.

యిక్కడే ఒక చిత్రమైన మలుపు తిరగవలసి వొచ్చింది. ఆ ఏడాదే శకుంతల కాలేజీలో చేరింది. ఆ పిల్ల కాలేజీలో చేరినట్టు నాకు రెండు నెలల తర్వాతగానీ తెలిసిందికాదు. ఒకనాడు సినిమా థియేటర్లో కనుపించి అడిగింది శకుంతల.

"ఎంతకాలమని తప్పించుకు తిరుగుతావ్ బావా!"

తల కొట్టేసినంత సిగ్గనిపించింది. ఏమి మాటాడలేకపోయాను.

శకుంతలను తప్పించుకు తిరగడం నా చేతకావడంలేదు. శకుం తల పని గట్టుకుని పలుకరించేది. తమాషాగా మాటాడేది. ఇంటి విష యాలూ, స్వంత విషయాలూ అడుగుతుండేది. ఆడపిల్ల కున్నపాటి చొరవ నాకులేదు.

ఒకొక్కసారి అనుకునేవాడిని.

"చూడు శకుంతలా! నువ్విలా నాతో మాటాడటం, నన్ను పలు కరించడం ఏమీ బాగోలేదు. అవతల మీ నాన్నకీ, మా నాన్నకీ బద్ధ విరోధమన్న సంగతి మరచిపోకు"

అని శకుంతలతో గట్టిగా చెప్పేద్దా మనుకునేవాడిని. అందుగ్గూడా నాకు ధైర్యం చాలేదికాదు.

వస్తుథా నాది పిరికి మనస్తత్వం. అందుచేతనే — అడుగడుగునా యింతమంది నాపైన అధికారం చెలాయించేరు. నన్నొక గంగిరెద్దులా తయారుచేశారు

శకుంతల అనేది

"ఎప్పుడో ఒకసారి మీ యింటికి స్వయంగా వొచ్చేస్తాను. ఆ అవసరం ఎలాగో కలుగుతుంది.మనం బంధువులం బావా! ఎడమొహం పెడమొహం పెట్టుకు తిరగవలసిన ఖర్మం మనకేమిటి చెప్పు"

ఏమని చెప్పను ?

ఒకసారి అన్నయ్య నాకోసం వచ్చాడు. రోజంతా హాస్టల్లోనే గడిపాడు. ఆ సాయంత్రం మే మిద్దరం బజారు వెడుతూంటే శకుంతల రిక్షామీద కనుపించింది. మమ్మల్ని పిలిచి ఆపింది. అన్నయ్యను పలుక రించి 'కులాసానా బావా !' అని అడిగింది.

అప్పుడు అన్నయ్య మొహంలో కొట్టొచ్చినట్టు కనుపించిన తత్తర పాటు చూచి తీరవలసిందే. బిక్క మొహం పెట్టి తరువాత వొస్తామని చెప్పి నడక వేగం పెంచేడు. అన్నయ్యని అనుసరించేను. దార్లో అన్నయ్య అడిగాడు.

"ఏంరా ? ఏమి టీ వరస ?"

"శకుంతల నా కాలేజీలో చదువుతోంది. నాకు జూనియర్"

"ఉహూఁ....అలాగా....జాగ్రత్త సుమా !"

హుఁ....జాగ్రత్త! శకుంతల ఒక ఆడపిల్ల. మావయ్య కూతురు. సరదాగా మాటాడే మంచి స్నేహితురాలు. అన్నయ్య కళ్ళకి ఆ అమ్మాయి అంత ప్రమాదకరంగా కనిపించడ మేమిటి? పైగా జాగ్రత్త అని హెచ్చరిక గూడానా ? నవ్వుకున్నాను.

ఆ తర్వాత ఆరోజు అన్నయ్య వెళ్ళిపోయాడు. వాడు వెళ్ళిన నాలుగు రోజులకి నాన్న దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. దాన్లో మావయ్యకీ, తనకీ జరిగిన కలహం గురించీ, మావయ్య వాళ్ళ వంశం గురించీ, చివరికి భాస్కరం బుద్ధులు గురించీ చాలా రాశారు. చదివి ఊరుకున్నాను.

రోజులు నెలల్లో పడ్డాయి. ఎందుచేతనో శకుంతలతో పరిచయం తుంచుకోవాలనిపించడం లేదు.

ఒక ఆదివారం మిట్ట మధ్యాహ్నం శకుంతల మా హాస్టలికొచ్చింది. కాసేపు విశ్రాంతి తీసుకున్న తర్వాత—

"ఇప్పుడు నీకో చక్కటి కబురు చెప్తాను. వింటావా బావా?" అన్నది.

తలూపాను.

"విన్న తర్వాత, నే చెప్పినట్లు చెయ్యాలి. చేస్తావా?"

"చేస్తాను"

"మరి మాటివ్వు"

"అలాగే.చెప్పరాదూ"

"ఈనాటి సాయంత్రం నా పుట్టినరోజు పండుగ శుభ సందర్భాన్ని పురస్కరించుకొని ఒక చిన్న పార్టీ యివ్వదలిచాము. కావున తాము బంధుమిత్ర సపరివారంగా విచ్చేసి మమ్మల్ని ఆనందింప జేయ ప్రార్థిస్తున్నాము" అన్నది చమత్కారంగా.

శకుంతల హాయిగా, ఆనందంగా పుట్టినరోజు పండుగ చేసుకుంటున్నదంటే నాకూ సంతోషమే. కానీ-వాళ్ళింటికి వెళ్ళి ఆ ఆనందంలో పాలు పంచుకునే భాగ్యం నాకు లేదు. అందుకే అన్నాను.

"నా శుభాకాంక్ష లెప్పుడూ ఉంటాయి. కానీ శకుంతలా! మీ యింటికి రాలేను"

శకుంతల తల వంచుకున్నది. నేలను చేత్తో రాస్తూ—

"ఎందుకీ పగ బావా! జరిగినదంతా మరిచిపోతే ఎంత బావుంటుందో ఆలోచించు"

"..........."

"చనువు తీసుకుని ఈమాట అంటున్నాను. నువ్వు మా యింటికి

వొస్తే ఆ తర్వాత మీ నాన్న నీ మొహం చూడరనేగా నీ దిగులు. ఆయనకి జవాబు చెప్పలేని అసమర్థుడివా బావా! పోనీలే....నేను మీ మావయ్య కూతురిని గాదనుకో.ఒక స్నేహితురాలిని. స్నేహానికి విలువ యిచ్చేవాడివైతే మా యింటికి వస్తావ్. ఇంక నే చెప్పేదేమీ లేదు. తర్వాత నీ యిష్టం. వొస్తాను" అనేసి వెళ్ళిపోయింది శకుంతల.

చాలాసేపు ఆలోచించి ఓ నిశ్చయానికి వచ్చాను.

బజారు వెళ్ళాను. శకుంతల కోసం గీతాంజలి కొన్నాను. తర్వాత హాస్టలుకొచ్చి స్నానం గట్రా ముగించి మావయ్య వాళ్ళింటికి వెళ్ళాను.

నన్ను చూడగానే శకుంతల మొహంలో వెయ్యిదీపాలు వెలిగాయి. మిత్రురాళ్ళతో మాట్లాడుతున్నదల్లా మాటలాపి గబగబా లేడిపిల్లలా పరుగెత్తుకుంటో వచ్చి నా ముందు నిలబడి—

"చాలా సంతోషం బావా! నిజంగా నువ్వెంత మంచివాడవనీ" అన్నది ఆనందంగా.

జాలి కలిగింది. వెర్రిపిల్ల! యింత మాత్రానికే యెంత మురిసిపోతుందో! ఆ వెంటనే నాన్నా, మావయ్యలమీద కోపమూ కలిగింది.

శకుంతల నా చేతిలోంచి పుస్తకం లాక్కుంటూ:

"ఇది నా కోసమే తెచ్చావు గదూ!" అన్నది.

తలూపాను.

నన్ను ఆమె అక్కడికి వొచ్చిన వాళ్ళందరికీ పరిచయం చేసింది. నిజానికి వాళ్ళలో చాలామంది నాకు మునుపే తెలుసును. నాకు తెలుసనని శకుంతలకీ తెలుసు.

ఆమె హడావిడి చూస్తూంటే నవ్వు పుట్టుకొస్తుంది.

ఆరోజున శకుంతల యింటికి వొచ్చిన వాళ్ళలో శోభనాద్రి,మధుసూదనం ఇద్దరూ ఉన్నారు. ఈ కథలో వీళ్ళ అవసరం ఎంతైనా వుంది. కాబట్టి, ఆ ఇద్దర్నీ పరిచయం చేయడం భావ్య మనుకుంటాను.

శోభనాద్రి అప్పుడు బి. ఏ. ఫైనలియర్ చదువుతున్నాడు. విద్యార్థి సంఘానికి అతను అధ్యక్షుడు. చక్కటి వక్త. అతను ఆ రోజుల్లోనే చాలా మంచి కథలు రాస్తుండేవాడు. అతని కథన్ని ప్రత్యేకంగా మా కాలేజీవాళ్ళు మెచ్చుకుంటూండేవాళ్ళు. అతనంటే చాలామందికి గౌరవ భావ ముండేది. అతను మాకు దూరబ్బంధువని నాకు అక్కడే తెలిసింది.

పోతే మధుసూదనం. అతను సెకండియర్ స్టూడెంటు. స్టూడెంట్సు యూనియన్‌కి సెక్రిటరీ. షైలా పచ్చీసుగా తిరిగేవాడు. అతను ధనికుల బిడ్డడు. కాలేజీలో జరిగే ప్రతి చిన్న ఫంక్షనుకీ అతను చెయ్యి కలుపు తూండేవాడు. ఆతను ఉత్సాహముగల యువకుడు. వాళ్ళ నాన్నగారికీ, మావయ్యకీ మంచి స్నేహ ముందిట.

ఒచ్చిన వాళ్ళలో మేము ముగ్గురమే మగవాళ్ళం. తతిమా వాళ్ళం దరూ ఆత జనాభా. చెప్పొద్దూ, శోభనాద్రి, మధుసూదనం యిద్దరికీ ఎలా గుందోగాని నాకు మాత్రం అంతమంది ఆడవాళ్ళని అక్కడ చూడగానే 'దడ' లాంటిది కలిగి యిబ్బంది పెట్టింది.

శకుంతల నన్ను మావయ్య దగ్గరికి తీసుకెళ్ళింది. అక్కడే భాస్కరం గూడా వున్నాడు. వాళ్ళిద్దరి ఆత్మీయతా చూడగానే నన్ను నేను నమ్మలేకపోయాను. వాళ్ళ ఆదరణతో కరిగిపోయాను. మా కుటుం బాల మధ్యగల కలహాన్ని పూర్తిగా మరిచిపోయేను. ఇంత చక్కగా మాటాడే వ్యక్తుల్ని మా నాన్నగారే అపార్థం చేసుకున్నారేమో ననిపిం చింది.

తిరిగి హాస్టలు కొచ్చేస్తూండగా మావయ్య నా రెండు చేతులూ పుచ్చుకుని అన్నారు.

"మనం కావలసిన వాళ్ళమని మరిచిపోకు నాయనా! కనీసం యిక్కడున్నన్నాళ్ళూ మా యింటికి వొస్తూ పోతూ వుండు"

ఆ తర్వాత రోజునుంచి అదే చేశాను. కాలేజీ అవడంతోనే తప్పనిసరిగా మావయ్య వాళ్ళింటికి వెడుతూండేవాడిని. శకుంతలతో ఖబుర్లు చెప్తుండేవాడిని. శకుంతల అభిప్రాయాలు వింటూ వుండేవాడిని.

శకుంతలలో చక్కటి సంస్కారం, గుండె నిబ్బరం, ఆత్మ విశ్వాసం ఎక్కువగా వున్నాయి. ఏ విషయం మాటాడినా చాల జాగ్రత్త తీసుకునేది. పూర్వాపరాలు ఆలోచించిగానీ ఏదీ మాటాండేది కాదు.

అలాంటి శకుంతలపైన పుకార్లు పుట్టాయి. శోభనాద్రి, మధుసూదనంలతో ఆమె చనువుగా వుండటం చాలామందికి యీసు కలిగించింది. ఆపైన నిందలు ప్రచారంలోకి వొచ్చేయి.

వింటూన్న నాకే బాధగా వుండేది. శకుంతల మాత్రం ఏమీ పట్టించుకున్నట్టు కనుపించేదికాదు. ఒకనాడు ఈ విషయాలే మా మధ్య కదిలేయి. ఆమె అన్నది :

"పోనీ బావా ! కుక్కలు అలాగే మొరుగుతాయి. శోభనాద్రి, మధుసూదనం యిద్దరుగూడా నన్ను అపార్థం చేసుకుంటున్నట్టు కనుపిస్తోంది ఈమధ్య. చెప్పాలి. 'అబ్బాయిలూ! నాకు నచ్చిన, నేను మెచ్చిన వ్యక్తి ఒకరున్నారు కాబట్టి అలాటి వెర్రి మొర్రి ఆలోచనలు పెట్టుకుని ఆ తర్వాత బాధపడితే అది మీ ఖర్మ అని హెచ్చరించాలి" అన్నది శకుంతల సీరియస్‌గా.

ఒక ఆడపిల్ల తన మనసులోని మాట అంత నిర్భయంగా చెప్పగా వినడం అదే మొదటిసారీ, చివరిసారీని. తర్వాత శకుంతలే అన్నది.

"మన నిర్ణయాలపైన మనకి నమ్మక ముంటుందికదూ బావా !"

ఏమీ చెప్పకుండానే హాస్టలు కొచ్చేశాను.

ఒకరోజున మావయ్య వాళ్ళింటికి వెళ్ళేసరికి మధుసూదనం బిక్కమొహంతో ఆ యింటినుంచి తిరిగి రావడం చూచేను. పేలవంగా

నవ్వేసి వెళ్ళిపోయాడు అతను. అతని ఈ ప్రవర్తనకి వెంటనే కారణం తెలిసింది కాదు. ఆ కారణం శకుంతల విడమరిచి చెప్పడంతో తల దిమ్మెత్తేలా ఆశ్చర్యపోయాను. మధుసూదనంతో ఆమె అన్నదిట.

'మనసులో ఒక అభిప్రాయం పెట్టుకుని బయటికి మరోవిధంగా ప్రవర్తించడం తన కిష్టంలేదనీ, ఇంకా ఆ పద్ధతితోనే సంచరించి నట్టయితే ఈ స్నేహాన్ని తుంచుకోవలసి వస్తుందనీ' చెప్పిందిట.

అతను చిన్నబుచ్చుకున్నాట్ట.

కాసేపు మాటాడి నేను తిరిగి వెళ్ళిపోతూండగా తన గుండెల్లో దాచుకున్న మాటని పైకి చెప్పింది. ఆమెకు నచ్చిన అదృష్టవంతుడ్ని నేనేనట. ఆ మాట విని ఆనందించినమాట నిజం....

సరిగ్గా యిక్కడ్నుంచే నా ప్రమేయం లేకుండా చాలా దారుణాలు జరిగాయి. పరీక్షలు ముగిసిన తర్వాత రోజు నాన్న వొచ్చేరు. నా మొహాన్న వో ఉత్తరం గిరాటు వేశారు. చదివాను. అది ఆకాశరామన్న ఉత్తరం. నాకూ శకుంతలకీ గల స్నేహాన్ని నీచంగా ఉదహరిస్తూ వ్రాశారు. ఉత్తరం చదివేసి ఆయన కిచ్చాను.

"నీ జవాబేమిటి ?" అన్నా డాయన ఉద్రేకంగా.

ఆయన వాలకం చూస్తుంటే భయం వేసింది.

"అన్నీ తెలిసిన నువ్వు యిలా చెయ్యడం ఏమీ బాగోలేదు. అక్కడికీ నిన్ను హెచ్చరిస్తూనే వొచ్చాను. నా కన్ను కప్పటానికి ప్రయత్నిస్తున్నావ్. జాగ్రత్త" అన్నారు.

ఆ రోజే నా ప్రయాణానికి అన్ని ఏర్పాట్లూ చేశారు. ఎలాగో వీలు చేసుకుని మావయ్య యింటికి వెళ్ళేను. ఆ వేళకి భాస్కరం వీధి గుమ్మంలో నిలబడి వున్నాడు. నన్ను చూడగానే అడిగాడు.

"ఈ గడపలో అడుగు పెట్టేముందు నీ నిర్ణయము కావాలి.

చెప్పు. శకుంతల కావాలని నిశ్చయంగా చెప్పగలిగితేనే రా. లేమా, వెళ్ళిపో. అంతేగాని ఆడపిల్ల జీవితంతో ఆటలాడటానికి నీకే అధికారమూ లేదు."

అదిరిపడ్డాను అతని మాటలకి.

"నువ్వేమీ పసివాడివికాదు. ఆ విషయం మీ నాన్న మరిచిపోయేడు కాబోలు. ఈ వీధిలో నిలబడి పెద్ద గోలచేసి మరీ వెళ్ళేడు. మాకూ మానాభిమానా లున్నాయనే సంగతి ఆయనకి నువ్వైనా చెపితే సంతోషిస్తాను "

నా తల దిమ్మెత్తిపోయింది. ఏ నిర్ణయమూ తీసుకోలేని పిరికిపందనై పోయాను నాకు తోచిన జవాబు చెప్పేంతలో నాన్న రిక్షామీద అటు వొచ్చేరు. వీధి చివరిని రిక్షా ఆపి నన్ను పిలిచారు. ఇటు ప్రాణ సమానమైన శకుంతలా, అటు పెంచి పెద్దచేసిన నాన్న. జీవితంలో ఇటువంటి దౌర్భాగ్యపు స్థితి మరెప్పుడూ రాకూడదు.

"నీకే చెప్తూంట. అక్కడ నీ కేం పని. కదుల్తావా, నన్ను రమ్మంటావా ?" బిగ్గరగా అరిచేరు నాన్న.

గిరుక్కున వెనక్కి తిరిగి నాన్న రిక్షావైపు నడిచాను. నా మొహం ముందే భాస్కరం తలుపు మూసేడు. తెలుసు నాకు. అప్పటి నా హీన స్థితికి శకుంతల చాలా బాధపడి వుంటుంది. శపించీ వుంటుంది.

నే నుత్త పిరికి మనిషిని. ఏమీ చాతకాని వాడిని. అందరికీ నా పైన అధికారం వుంది. వాళ్లు చెప్పినట్టు నడిచే బొమ్మని. కేవలం మరబొమ్మ ఛీ !........

సెలవలన్నీ మా వూళ్ళోనే నిస్సారంగా గడిచాయి. ఆలోచనలు పిచ్చెత్తించేవి. ఒకోసారి నా పైన నాకే కోపమూ, దుఃఖమూ కలిగేవి. ఎక్కడికైనా పారిపోదా మనుకునేవాడిని. పోనీ-ధైర్యంచేసి మావయ్య వాళ్ళింటికెళ్ళి....

యెన్నో అనుకునేవాడిని. ఏదో చేసేయాలనీ అనుకునేవాడిని. ఒక్కటీ జరిగేది కాదు. ఆచరించేవాడినీ కాదు.

రిజల్ట్సు తెలిశాయి. పాసయ్యాను. అయినా సంతోషించలేదు. విశాఖపట్నం ఆనర్సు సీటుకోసం నాన్న ప్రయత్నాలు చేసేడు. సీటు వొచ్చింది. విశాఖపట్నం వెళ్ళమన్నారు; వెళ్ళాను. బుద్ధిగా చదవ మన్నారు. అదీ ఆచరించేను.

కొత్త చోటు, కొత్త వాతావరణం. సముద్రపు టొడ్డునే యూని వర్సిటీ హాస్టలు. మా గదిలోంచి చూస్తే చిత్రమైన హోరుతో గంభీర మైన సముద్రం కనిపిస్తూండేది. క్లాసులో వుంటే పాఠాలూ, మా రూముకొస్తే సముద్రమూనూ. మరే విషయాలూ పట్టించుకునేవాడిని కాదు.

ఆరునెలలు గడిచేయి. ఒకరోజున డాబా గార్డెన్సులో మధుసూద నం కలిశాడు. నవ్వుతూ అతనే పలుకరించేడు. కొత్త చోటులో పాత నేస్తం కనిపించి పలుకరించిన తర్వాత నేనూ ఆనందించిన మాట నిజ మేను. ఇద్దరం హోటల్ ఉడ్‌టీలోకి దారితీశాం.

మధుసూదనానికి మెడికల్ కాలేజీలో సీటు దొరికిందిట కష్టపడి చదువుతున్నాడుట. హోటల్లో అతను చాలా విషయాలు చెప్పేడు. అతి ముఖ్యమైనది శకుంతల పెళ్ళి!

శకుంతల శోభనాద్రిని పెళ్ళి చేసుకున్నదట. అతను బెజవాడలో ఏదో గుమాస్తాగిరి వెలగబెడుతున్నాడుట. శోభనాద్రిని పెళ్ళి చేసుకుం టుందని నేనెన్నడూ అనుకోలేదు. నాకిది చిత్రంగానే కనిపించింది. అవుతే ఈ పెళ్ళికి ముఖ్యకారణం నేనన్న విషయం అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ మరిచిపోలేను.

ఇద్దరం కాఫీలు ముగించి బయటపడిన తర్వాత మధుసూదనం అన్నాడు.

"నన్ను క్షమించాలి. శకుంతల నన్ను నిర్లక్ష్యం చేసిందన్న కోపంతో నేనే మీ నాన్నగారికి ఆకాశరామన్న ఉత్తరం రాసేను. ఆ తర్వాత ఆ పాడుపనికి చాలా విచారించేను. నేను శకుంతలని ప్రేమించిన మాట వాస్తవం. ఆమె నన్ను చులకన చేస్తే సహించలేకపోయాను. ఆ ఆవేశంలో పిచ్చిపని చేశాను. మీ పెళ్ళి ఆగిపోయింది" అన్నా డతను బాధగా.

అతనో విషయం మరిచిపోతున్నాడు. కేవలం ఈ ఒక్క ఆకాశ రామన్న ఉత్తరంతో మా పెళ్ళి ఆగిపోలేదు. నా నరనరాల్లో పనిచేసిన బలహీనతా, పిరికితనానికి మధుసూదనంగానీ మరే యితర వ్యక్తులుగానీ బాధ్యులు కారుగా. అందుకే అతను చెప్పినదంతా విని నవ్వేశాను.

ఆ మూడేళ్ళ చదువులోనూ మళ్ళీ నాకు శకుంతల కనిపించలేదు.

ఆనర్సు పూర్తి చేసి యింటి కొస్తూండగా, బెజవాడలో రైలు మారవలసి వొచ్చింది. బాగా రాత్రి పడింది. ప్లాటుఫారంమీద లైట్లు మాత్రం చీకటిని చీల్చి చెండాడుతున్నాయి. మావూరి రైలు కదలడానికి మరో అరగంట టైమున్నదని తెలుస్తే, టీ తాగటానికి కాంటీన్ వైపు వెళ్లాను.

అదే రాత్రి బెజవాడ ప్లాటుఫారం తాలూకు వెయిటింగ్ రూంలో శకుంతలని చూసేను. ఆమె సగానికి సగం చిక్కిపోయి వుంది. మొహంలో మునుపటి కళా కాంతులు కరువయ్యాయి. నన్ను చూడగానే చివాలున లేచి నిలబడింది.

నాతో మాటాడిన కొద్దిసేపూ ఆమె ఆయాసపడుతూనే వుంది. నాలుగు నెలల క్రితం కొడుకు పుట్టి పోయాడట. ఆమె ఆరోగ్యం పూర్తిగా చెడిపోయిందిట. గుండెల్లో దడ, ఆయాసం ఉధృత మవుతున్నాయిట. శోభనాద్రిని ఈ మధ్యనే ఏలూరు బదిలీ చేశారుట. ఆమె ఏలూరు రైలుకోసం యెదురు చూస్తూందిట.

శకుంతల పరిస్థితులు తెలుసుకుని జాలిచెందడం మినహా మరేమీ

చేయలేక పోయాను. కనీసం నోరు విప్పి ఒక్కమాటకూడా అనలేక పోయాను.

నా రైలు కదిలే వేళకి 'వస్తాను' అని గొణిగాను. ఆమె నవ్వింది బాధగా. వెళ్ళిరామన్నట్టు కళ్ళతో చెప్పింది. తెలుసు.... నేను వట్టి పిరికి వెధవనని శకుంతల భావం. ఆ భావాన్ని మాటల్లో వ్యక్తంచేస్తే నేనెక్కడ బాధపడిపోతానోనని, మాటాడిన కాసేపూ చాలా జాగ్రత్త తీసుకున్నది శకుంతల.

కదిలే రైల్లో నిలబడి దూరమవుతున్న శకుంతలని చూస్తుండి పోయాను.

* * * *

చాలా సంవత్సరాల క్రితం ఇది జరిగింది.

ఈ మధ్య శకుంతల గురించి గానీ, మరే యితర స్నేహితుల గురించిగానీ వార్తలు తెలిసినవిగావు. ఈ టెలిగ్రాం రాకపోతే ఇంత కథ కదిలే అవసరం వుండేది కాదేమో !

"శకుంతల గుంటూరు హాస్పిటల్లో వుంది.చివర క్షణాలు.వెంటనే రా" శోభనాద్రి.

మా స్టాఫ్ రూమ్‌లోని గడియారం ఎనిమిది గంటలు కొట్టింది. ఉలిక్కిపడ్డాను. నా చుట్టు పక్కల చూచేను. ఆ రూమ్‌లో నా మినహా మరెవ్వరూ లేరు. తలపైన పంకా విసురుగా తిరుగుతున్నది. ట్యూబ్ లైటు వెలుగుతోంది.

బయట ఎవరో కదులుతూన్న చప్పుడు విని —

"రాఘవులూ" అని పిలిచాను.

పాపం.... నాకోసం ఎంతసేపట్నుంచి బయట నిలబడి వున్నాడో యేమో. పిలవగానే లోపలికొచ్చి వినయంగా నిలబడ్డాడు మా ప్యూను.

"చాలా వేళయింది కదూ"

"తమరు కూకుండి పోయారని...." చివర్ని నసిగాడు.

నవ్వుకున్నాను.

"సైకిలు బైటపెట్టు. అన్నట్టు రేపు నేను క్లాసుకి రాలేను. ఈ సెలవు చీటీ ప్రిన్సిపాల్‌గారి కివ్వు" అన్నాను. అతని చేతిలో సెలవు చీటీ పెడుతూ.

రాజన్న సైకిలు బైట పెట్టాడు.

నీరసంగా వుంది. తలనొప్పి వచ్చినట్టుగూడా ఉంది. సిగరెట్టు ముట్టించి బయటికొచ్చేను. సైకిలెక్కి ఇంటిదోవ పట్టాను.

ఇల్లు చేరుకునే వేళకి నా కోసం ఎదురుచూస్తో శారద గుమ్మం దగ్గర నిలబడి వున్నది. నన్ను చూడగానే అన్నది.

"మీ అన్నగారు వచ్చేరు. ఇప్పుడే బజారు వెళ్ళారు"

ఇంట్లోకెళ్ళి సోఫాలో కూర్చుండిపోయాను.

"ప్రైవేటు క్లాసేమైనా ఉందేమిటీ, ఇంత ఆలస్యమైంది ?"

"............"

"ఇవాళ మీరదోలా ఉన్నారేమిటి ?"

"ఎలా ఉన్నాను"

"కాలేజీలో ఏమైనా విశేషం జరిగిందా ?"

"అదేంకాదు. ముందు స్నానానికి నీళ్ళుతోడు. చిరాగ్గా వుంది"

శారద దొడ్లోకి వెళ్ళింది.

స్నానం చేసి హాల్లో కూర్చున్న పావుగంటకి అన్నయ్య వచ్చారు. ఆఫీసు పనిమీద వచ్చినట్టు రేపు ఇక్కడే ఉండిపోతున్నట్టు చెప్పాడు. భోజనాలు ముగిసిన తరువాత, డాబామీద పక్కలు వేసుకున్నాం. నేనే అన్నాను.

"రేపు గుంటూరు వెడుతున్నాను."

"ఏమిటో రాచకార్యం ?"

"శకుంతలకి సీరియస్‌గా వుందిట."

ఈ మాట వినగానే అన్నయ్య దిగ్గునలేచి కూర్చున్నాడు. వెంటనే ఏమీ మాటాడలేక పోయాడు. సిగరెట్టు ముట్టించి పొగ వదులుతూ అ వెక్కడో చూస్తూ అన్నాడు.

"నువ్వింకా ఆ పిల్లని మరిచి పోలేదన్నమాట."

"లేదు"

"యిన్నాళ్ళు మేమే పొరపాటు పడ్డామన్నమాట."

.... .... .... .... ....

"నాన్న యింకా బ్రితికే వున్నారు. ఆయన చాలా అభిమానస్థులు."

"తెలుసు నాకు. అర్థంలేని అభిమానాలు ఎంతపనిచేస్తాయో బాగా తెలుసు."

"నువ్వు చాలా పెద్దవాడి వయ్యావ్"

నవ్వేను. నన్నింకా కుర్రకుంకగా భావించే మా పెద్దవాళ్ళ నేసు నాలో నాకు అర్థంకాలేదు.

"గుంటూరు వెళ్ళక తప్పదంటావ్ ?"

"అనేగా మరి"

"దట్సాల్‌రైట్. పెద్దవాళ్ళ మాటమీద మకీ గౌరవం లేనివాళ్ళకి ఏం చెప్పినా నిష్ప్రయోజనం"

"వద్దు. యింకా మీ పెద్దరికం నా నెత్తిన రుద్ది నన్ను చవటని చెయ్యకండి. జరిగినది చాలు."

"నీ మాటలేం బాగోలేదు."

"ఈ విషయంలో నన్ను ఆక్షేపించవద్దు. సరేనా" అన్నాను రోషంగా.

అంతే. మా యిద్దరిమధ్యా నిశ్శబ్దం అలుముకుంది. ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదుగాని వళ్ళుమరిచి నిద్రపోయాను. ఉదయంలేచి చూస్తే అన్నయ్య లేడు. శారద చెప్పింది—అతను తెల్లవారు జామునే వెళ్ళిపోయాట్ట.

ప్రయాణానికి సిద్ధమవుతుండగా నన్ను శారద అడిగింది.

"మీరు గుంటూరు వెడుతున్నట్టు నిన్న నా కెందుకు చెప్పలేదు?"

"యిప్పుడూ చెప్పవలసిన అవసరం లేకుండానే అన్ని విషయాలూ తెలిశాయన్నమాట. చూడు శారదా! మా నాన్నగురించి గానీ, అన్నయ్య గురించిగానీ నీ కేమీ తెలీదు. ఆత్మసాక్షిగా చెప్తున్నాను. నీకెప్పుడూ ద్రోహం చెయ్యను. చెయ్యలేను. చెప్పుడు మాటలు విని మనసు పాడుచేసుకోవద్దు వస్తాను మరి" అని చెప్పి ఇల్లు దాటాను.

గుంటూరు ఉదయం పదిగంటలకు చేరుకున్నాను. ఆ వేళకి హాస్పిటలు గేటు మూసివుంది. ఏమి చెయ్యాలో తోచక అక్కడే పచార్లు చెయ్యడం మొదలుపెట్టాను.

"బావా!"

వెనక్కి తిరిగి చూశాను.

భాస్కరం కళ్ళనిండా నీళ్ళు నింపుకుని నిలబడి ఉన్నాడు. గబగబా నా దగ్గర కొచ్చేడు. గాద్గదికంగా అన్నాడు.

"వస్తావనుకోలేదు; వచ్చావ్. శకుంతల చావూ బ్రతుకుల మధ్య వుంది. దేవుడు మేలుచేస్తే శకుంతల దక్కుతుంది. గంటక్రితం ఆపరేషన్ థియేటర్లోకి తీసుకెళ్ళారు. నేను శోభనాద్రి కోసం వెదకటానికి వెళ్ళాను. అతను పారిపోయాడు"

"అదేమిటి ?" ఆశ్చర్యపోతూ అడిగాను.

"అతను శకుంతలని అమితంగా ప్రేమించిన మాట నిజం.ఆమె నిస్థితిలో చూస్తూ నిలబడగల గుండె నిబ్బరం అతనికిలేదు రాత్రినుంచి పిచ్చివాడిలా ఏదో మాటాడటం మొదలుపెట్టేడు. తెల్లవారుతూనే మా కెవరికీ చెప్పకుండా ఎటో వెళ్ళిపోయాడు"

"పాపం"

"రా. ..లోపలికెడదాం"

అతను గేటుదగ్గరున్న వాడితో ఏదో చెప్పి నన్ను వెంటబెట్టుకుని లోపలికి తీసుకెళ్ళాడు. ఇద్దరం ఆపరేషన్ థియేటరు చేరుకున్నాం.

ఆ గది బయట వరండాలో మామయ్య ఆందోళసగా తిరుగు తున్నారు. నన్ను చూడగానే గట్టిగా ఏడవాలనుకున్నారుగానీ అతి ప్రయ త్నంమీద వచ్చే ఏడుపుని దిగమింగుకున్నారు.

"ఈ సమయంలో మనమంతా ధైర్యంగా వుండాలి.మంచి వాళ్ళకి దేవుడెప్పుడూ సాయపడతాడు" అన్నాను.

ఎవ్వరూ మాటాడలేదు. నిమిషాలు లెక్కపెడుతూ కూర్చున్నాం. పేరు పేరునా దేవుళ్ళందర్నీ వేడుకోవడం ప్రారంభించాను.

మరో పావుగంటకి ఆపరేషన్ థియేటర్ నుంచి డాక్టరు బయటి కొచ్చాడు. అతన్ని చూస్తూ గతుక్కుమన్నాను.

అతను మధుసూదనం।

అందరం ఒక్కసారిగా శకుంతల క్షేమం గురించి అడిగేము.

"దేవుడు నా ప్రయత్నాలని జయప్రదం చేశాడు" అన్నాడు మధుసూదనం.

ఇంతకంటె వేరే కావలసిందేముంది ?

మధుసూదనం నా దగ్గరకొచ్చాడు. నా భుజం తట్టాడు.

"శకుంతల నీ గురించి చాలామాట్లు అడిగింది" అన్నాడు.

నన్ను వరండా చివరకు తీసుకెళ్ళాడు. సిగరెట్టు ముట్టించుకుని పొగ వదులుతూ—

"ఆమె నన్ను నిర్లక్ష్యం చేసేది. నా ప్రతి మాటనీ తోసిపారేసేది. ఇప్పుడు ఆమెకు ప్రాణం పోశాను. ఈనాటికైనా ఆమె నా ప్రయోజకత్వాన్ని గుర్తిస్తే అదేచాలు" అన్నాడు ఆనందంగా.

అతని మాట విన్నతర్వాత ఎందుకో నవ్వాలనిపించింది. నవ్వేశాను. బిత్తరపోయి నా వంక చూసేడు డాక్టరు మధుసూదనం.

o—o

[illegible]

# ఎందుకు?

నెలరోజుల తర్వాత ఆఫీసులో కూర్చుని పనిచెయ్యాలంటే యిబ్బందిగానే వుంటుంది. నా ముందున్న ఫైళ్ళను చూస్తోంటే భయం పుట్టుకొస్తుంది. పాపం పెరిగినట్టు పెరిగాయి ఫైళ్ళు. అక్కడికీ ఎవరో పుణ్యాత్ములు చెయ్యిచేసుకోబట్టి కొంతైనా తరిగింది. అలాకూడా జరక్కపోతే యింకెంత దిగులుపడేవాడినో ఏమో!

ఈ నెలరోజుల్లోనూ ఆఫీసులో చాలా మార్పులు జరిగాయి. మిత్రుడు రంగనాథానికి బదిలీ అయింది. కొత్త ఆఫీసరూ, కొత్త హెడ్ గుమాస్తా డ్యూటీలో చేరారు. లోగడ మా ఆఫీసు రైల్వేస్టేషను దగ్గర్లో వుండేది. ఇప్పుడేమో ఊరికి చివరన్నట్టు రెండు మైళ్ళు ఇవతలికి మార్పు చేశారు.

సంవత్సరంపాటు ఈ ఆఫీసుతో పరిచయమున్న నాకు—ఈనాడు యిదే ఆఫీసు కొత్తగా కనిపిస్తోంది. పైగా - నెల రోజులు కులాసాగా గడిపిన తర్వాత, ఆఫీసుకి వచ్చి నడుంవంచి పనిచెయ్యా లనిపించలేదు. మరో నాలుగు రోజులు సెలవడిగి మా ఊరు వెళ్ళిపోదామనిపిస్తోంది. ఏ

7-12-62 ఆంధ్ర సచిత్ర వారపత్రిక

కారణమూ లేనిదే నాలుగు రోజులు సెలవెలా యిస్తారూ నా పిచ్చి కాపోతే?

జీవితంలో 'పెళ్ళి' ఒక ముఖ్యమైన ఘట్టం కాబట్టి, మా రంగ నాథ మన్నట్టు 'కాంట్ బట్' కాబట్టి నెల రోజుల సెలవు (అదీ అతి కష్టంమీద) మంజూరయింది. అలాంటిది సరైన కారణమంటూ లేకుండా నాలుగు రోజుల సెలవు కావాలంటే ఎవరిస్తారు?

పదిన్నరయ్యేసరికి ఆఫీసు బృందమంతా తమ తమ స్థానాలలోకి వచ్చారు. ఎవరో ఇద్దరు క్రొత్త గుమాస్తాలకి నన్ను పరిచయం చేశాడు మధుసూదనం. వాళ్ళిద్దరికీ నన్నొక కథకుడిగా పరిచయం చేయడంతో— ఈ పరిచయానికి వాళ్ళు ప్రత్యేకమైన విలువ యివ్వడం జరిగింది. కథలు రాసేవాళ్ళమీద వాళ్ళ కెంత గౌరవభావముందో వాళ్ళ మాటల ద్వారా వ్యక్తపడింది. ఆ కాసేపూ ఆనందించక తప్పిందికాదు.

ఆ తర్వాత పాత మిత్రులు ఒక్కరొక్కరే నా స్థానందగ్గరకు వచ్చి నా యోగక్షేమాలు అడిగారు. పెళ్ళయిన ఈ నెలరోజుల అనుభ వాన్నీ పురస్కరించుకుని వైవాహిక జీవితం గురించి నా అభిప్రాయం అడిగారు. ఏమని చెప్పను?

మోహనరావు నవ్వుతూ అన్నాడు:

"పోనీలెండి. మిమ్మల్నింకేం ప్రశ్నించం. సరైన అభిప్రాయం చెప్పటానికే సిగ్గుపడిపోతున్నారాయె"

"దట్సాల్ మై డియర్ ఫ్రెండ్స్! టేక్ యువర్ సీట్స్ ఎండ్ మైండ్ యువర్ వర్క్స్" మధుసూదనం ఆజ్ఞ జారీచేశాడు.

ఆ మాట వినడంతో ఆఫీసు బృందమంతా నవ్వుకుంటూ ఎవరి స్థానానికి వాళ్ళు వెళ్ళిపోయారు.

తర్వాత తెలిసింది —క్రొత్తగా వచ్చిన హెడ్‌గుమాస్తాను అనుక

రిస్తూ మధుసూదనం అలా అన్నాడని. మధుసూదనానికి ఇలాంటి 'అను కరుణ' అంటే సరదా హెచ్చు.

దాదాపు పదకొండు గంటల ప్రాంతంలో క్రొత్త ఆఫీసరు ఆఫీసుకు వచ్చారు. హెడ్‌గుమాస్తాతో అయిదు నిమిషాలపాటు ఏదో మాట్లాడి తన గదిలోకి వెళ్ళిపోయారు. ఆయన హుందాతనం నన్ను బాగా ఆకర్షించింది.

బాగా పొడగరి. పొడుక్కితగ్గ లావు. నిండు సూట్లో చూడటానికి ముచ్చటగా వున్నారు. చూస్తుండగానే సిగరెట్ ముట్టించారు.

ఆయనకు పాతిక సంవత్సరా లుంటాయేమో.... ఇంత చిన్న ప్రాయంలోనే ఆయన ఆ స్థాయిని అందుకోడం మహావహం.

మధుసూదనం నావైపు తిరిగి 'ఈయనే మన క్రొత్త ఆఫీసరు' గారు అని తను చూపుద్వారా తెలియజేశాడు.

ఆఫీసరు వచ్చిన తరువాత అంతకు మునుపున్న అలజడి తగ్గింది. ఆఫీసంతా నిశ్శబ్దాన్ని పులుముకున్నది. ఎవరిపనిని వాళ్ళు మౌనంగా చేసుకుంటున్నారు.

అరగంట గడిచిన తర్వాత రాజన్న నా స్థానం దగ్గరికి వచ్చాడు.

"మిమ్మల్ని అయ్యగారు పిలుస్తున్నారు" అని చెప్పాడు.

ఆయన నన్నెందుకు పిలిచారో అర్థంగాక రాజన్నవెంట ఆఫీసరు గదిలోకి వెళ్ళాను. ఆయన నన్ను చూస్తూనే అన్నారు—

"విష్‌యూ ఎహేపీ మేరీడ్ లైఫ్"

"థాంక్యూ సార్ !"

"మీరు యివ్వాళ ఆఫీసుకొచ్చేనాటి మీ గురించి యింతకుమునుపే విన్నాను. మన ఆఫీసులో బాగా పనిచేసేవాళ్ళల్లో మీరూ ఒకర్రుట. అందుకు తగ్గట్టు మీ సీట్లో హెవీ డిస్పోజల్స్ వుంటాయిట. అది మంచిది.

నియమించిన పనిని సక్రమంగా చేసుకుపోతే మీకు మంచి భవిష్యత్తు వుంటుంది. అవసరమైనప్పుడు నా పూర్తి సహకారం మీకు వుంటుంది"

"కృతజ్ఞుణ్ణి"

ఆయన మాటలు వింటూంటే అమితానందమయింది. పరిచయమైన మరుక్షణంలో ఆయనకు నామీద సదభిప్రాయం కలగడం ఆశ్చరమే మరి!

"మీరు కథలు రాస్తారని విన్నాను. మీ కథలు కొన్ని చదివినట్టు జ్ఞాపకం. ఈ ఆఫీసుకొచ్చే ముందు యిక్కడి సిబ్బంది పైన నా కెలాంటి అభిప్రాయమూ లేదు. ఇక్కడ యింత చక్కటి వాతావరణం ఉంటుందనుకో లేదు. సిబ్బంది కార్యక్రమాలు నన్ను బాగా ఆకర్షించాయి. ప్రజ్ఞగల యువకులు ఈ ఆఫీసులో సగానికిపైగా వున్నారని తెలిసిన తర్వాత గర్వించక తప్పటంలేదు"

ఆయన రసహృదయాన్నీ, సౌమ్య దృష్టినీ లోలోన అభినందించాను. లోకంలో వున్న 'మంచితన'మంతా ఈయనలో మూర్తీభవించిందా అనిపించింది. అందరూ యిలాంటి ఆఫీసర్లే వుంటే?

వచ్చి నా స్థానంలో కూర్చున్నమీదట నా ముందున్న ఫైళ్ళు. వగైరాలు అతిస్వల్ప విషయాలుగా కనిపించాయి. ఆఫీసరు ప్రోత్సాహం ఎంతపనైనా చేయించగలదు.

పది నిమిషాల తర్వాత మధుసూదనం నా స్థానం దగ్గరికి వచ్చాడు. ఆఫీసరు నాతో అనిన మాటలన్నీ చెప్పాను. అతను అంతా విని__అన్నాడు.

"అలాటి మంచి మనిషిలో కొన్ని లోపాలను దేవు డెందుకు సృష్టిస్తాడో అర్థంకాదు రావ్!"

"అంటే?"

"నింపాదిగా నువ్వే అన్నీ తెలుసుకుంటున్నావుగాని, ఆయన గురించి తెలిసిన 'చెడు' చెప్పటానికి నా మనసు వొప్పుకోడంలేదు."

ఘర్షణ ప్రారంభమయింది. చేద్దా మనుకున్న పని కాస్త ఆగిపోక తప్పిందికాదు. మంచీ చెడుల రూపాలు ఎలా ఉంటాయి? అసలు మంచే విటి ? చెడేవిటి ? వాటి రెంటికీ సరిహద్దు ఎక్కడ? ఆఫీసర్లో దాగిన లోపాలంటే ?—

కాఫీ కొరకు బయటి కొస్తుండగా, నా ముందునుంచే ఒక మధు నాతన యువతి గబ గబా ఆఫీసులోకి వచ్చింది. చేతికున్న వాచీలో టైము చూచుకుంది. ఎవరి అనుమతితో సంబంధం లేకుండానే ఆఫీసరు గదిలోకి వెళ్ళింది.

అప్పటివరకూ ఆఫీసర్తో మాట్లాడుతున్న హెడ్ గుమాస్తా ఆఫీసరు గదిలోంచి బయట కొచ్చేశాడు. ఈ హఠాత్పరిణామం ఆఫీసంతట్నీ ఆకర్షించింది. అందరూ ఆఫీసరు గదిపైన చూపులు నిల్పారు.

మధుసూదనం నా దగ్గరకు వచ్చి—

"క్కాఫీకా ?" అని అడిగారు.

"అవును"

"పద వెడదాం" అని నాతోపాటు అతనూ కాంటీన్‌కి వచ్చాడు. కాఫీ తాగుతూ అతనే అడిగాడు :

"ఇప్పుడు ఆఫీసుకి వచ్చినావిడ ఎవరో తెలుసా ?"

తెలీదన్నట్టు తలూపాను.

"ఆఫీసరు వుంపుడుగత్తె !"

"ఏమిటి ?"

"ఎవరికీ తలొంచడం చేతగాని ఆఫీసరు ఈవిడకు దాసోహ

మంటున్నారు. ఈపిడ స్నేహంతో సర్వవిధాలా చెడిపోవటానికి సిద్ధ పడుతున్నారు. వాళ్ళిద్దరికీ కాలేజీ రోజుల్లోనే కొంత గ్రంథం నడిచి నట్లు వినికిడి. ఆవిడకు పెళ్ళయింది కూడాను ! ఆయన లాయరుట ! ఈ ప్రేమ విషయం ఆయనగ్గూడా తెలుసునట ! పెద్దలు బ్రదర్ ! అంతా పెద్దలే !"

మధుసూదనం ఆఫీసరు గురించి చాలా చెప్పుకుపోతున్నాడు. ఎందుచేతనో మరి, ఆఫీసరు గురించి 'చెడు' వినబుద్ధి పుట్టడంలేదు.

చివరికి మధుసూదనం అన్నాడు—

"ఈఒక్క అవలక్షణం మినహా ఆఫీసర్లో కాగడాపెట్టి వెతికినా మచ్చ కనుపించదు. మన గుమాస్తా లందరికీ ఆయన ధర్మరాజు ! ఏదీ పట్టించుకోరు. చాతనైతే మేలు చేయడానికి సిద్ధపడతారు కాని ఒకడికి కీడు చేద్దామన్న తలంపే లేదాయనకు. మరొకడూ, ఇంకొకడూ అయితే విచారించం కానీ, సాక్షాత్తూ యింత మంచి మనిషి దిగజారి పోతున్నా రంటే జాలిగానే వుంటుందిమరి."

నాకై నేనేమీ మాట్లాడలేదు. కాఫీ ముగిసిన తర్వాత ఆఫీసుకి వచ్చాము. మేము వస్తూండగా మళ్ళీ ఆవిడ మాకు ఎదురుపడింది. అంద మైన మనిషి !

నేను నా స్థానంలో కూర్చున్న తర్వాత మధుసూదనం మళ్ళీ పిలి చాడు. చిరాకుతో అతని స్థానం దగ్గరికి వెళ్ళాను.

"సారీ బ్రదర్....నీకో ఉత్తరం వచ్చి చాలా రోజులయింది. అది నీకు అందజేద్దా మనుకునే యిప్పటివరకూ వాయిదా వేశాను. ఇదు"

అతను యిచ్చిన ఉత్తరం తీసుకు వచ్చేశాను. నా స్థానంలో కూర్చుని ఉత్తరం విప్పాను :

'శ్రీ రావుగార్కి,

నాన్నగార్కి ఓ పదిరోజులనుండీ గుండెల్లో విపరీతమైన పోటు వస్తున్నది. ఈ కారణంచేతనే మేమెవ్వరమూ మీ పెళ్ళికి రాలేక పోయాము.

ముందు ఈ విషయాన్ని మీకు తెలియజేయ వద్దన్నారు. కాని.... యివ్వాళ గుండె నొప్పి ఉధృతమయింది. మీకు ఉత్తరం వ్రాయమని స్వయంగా ఆయన చెప్పడంతో రాస్తున్నాను. మీ పెళ్ళి పనులన్నీ సక్రమంగా ముగిసిన తర్వాత పీలు చేసుకుని ఒకసారి రావలసిందిగా నాన్న మిమ్మల్ని ఆహ్వానిస్తున్నారు.

చివరిసారిగా మిమ్మల్ని చూడాలని వుందిట.

మీ నిరంజనం.'

ఉలిక్కిపడ్డాను. ఆ చివరి వాక్యం నా నవనాడులన్నీ కృంగ దీసింది. ఆయన శరీరస్థితి ఎలా వుంది ? ఇంతకుమునుపు వచ్చిన ఉత్తరాల్లో ఏనాడూ ఆయన ఈవిధంగా రాయలేదు. ఉత్తరం చదువుతూన్న ప్రతిమాటూ ఆందోళన ఉధృతమవుతోంది. ఆ చివరి వాక్యాన్ని పదే పదే చదువుకుంటూ అర్థాన్ని నాకు తోచిన విధంగా సమన్వయించుకోడం తప్ప మనసుని కుదుట పరచుకోలేక పోతున్నాను.

ఉత్తరాన్ని తీసుకుని ఆఫీసరు గదిలోకి వెళ్ళాను. నా ఆదుర్దాని గమనించి, నన్ను చూడగానే అడిగా రాయన :

"సెలవు కావాలా ?"

అవునన్నాను ఆశ్చర్యపోతూ.

"పెళ్ళయిన తర్వాత మనిషికి బాధ్యతలు పెరుగుతాయిలే. సరే మీరిక వెళ్ళొచ్చు."

సెలవు మంజూరు చేసినందుకు ధన్యవాదాలు చెప్పి వచ్చేశాను.

రెండు రోజుల సెలవు రాసి హెడ్‌గుమాస్తా చేతికిచ్చాను. సెలవు కాగితాన్ని తీసుకుంటూ నవ్వుకున్నా రాయన.

* * * *

ఆ సాయంత్రిం పెందరాడే గదికొచ్చాను.

తలుపుతీసి రెండు జతల బట్టలు సూటుకేసులో సర్దుకుంటూండగా రుక్మిణమ్మగారు వచ్చారు. గుమ్మం దగ్గరే నిలబడి—

"నీకు కొత్తకళ వచ్చేసింది సుమా! తాతయ్యగారు నిన్ననే ఊరు వెళ్ళారు. ఆయన నిన్ను చూడాలని తహతహలాడుతున్నారు" అన్నది నవ్వుతూ.

నా ముందే ఆవిడ అలా మాటాడ్తూంటే సిగ్గు పుట్టుకొచ్చింది. తల వంచుకున్నాను.

"తల దించుకుంటా వెందుకోయ్ పెళ్ళికాదుకా ? మరీ ఆడపిల్లలా అంత సిగ్గయితే ఎలా నాయనా....తలెత్తు....అన్నట్టూ....మీ ఆవిడ నెప్పుడు తీసుకొస్తావూ ?"

"నా కా విషయాలు తెలీవండి."

"ఈ ఇంట్లోనే మరో భాగం నీకు యిద్దును కాని, నీ కది చాల దేమో ననుకుంటున్నాను."

"అప్పుడే ఈ విషయా లెందుకులెండి ?"

"బలేవాడివేలే .... సంసారమంటే బొమ్మలాట అనుకున్నావా నాయనా ? అందులో కొత్త సంసారం కూడాను. అన్నీ అందుబాటులో వుండాలి. ఏ లోటూ రాకుండా చూచుకోవాలి. అప్పుడే సుఖం.ఉండు.... ఒక్క నిముషం....ఇప్పుడే వస్తాను" అంటూ ఆవిడ వెళ్ళారు.

రుక్మిణమ్మగార్కి ఏభై సంవత్సరాలు దాటాయి. ఆవిడకు పిల్లలు లేరు వాళ్ళింట్లో అద్దెకుంటూన్న మమ్మల్నే తన పిల్లలుగా

చూచుకుంటున్నారంటే ఆశ్చర్యంలేదు. అన్నివిధాలా మాకు చేదోడు వాదోడుగా ఉంటున్నా రా దంపతులు !

నాతోపాటు మరో ముగ్గురు మిత్రులు ఈ గదిలో వుంటున్నారు. నలుగురం కలిసి చదువుకున్నాం. అదృష్టవశాత్తు నలుగురికీ యిక్కడే ఉద్యోగాలు కావటం మూలంగా అందరం ఒకే గదిలో వుంటున్నాం. మా మధ్య ఎన్నడూ పొరపొచ్చాలు రాలేదు. అందరం కూడా వొకే మాటమీద నిలబడి ఉంటున్నాం ఇంతవరకూ. మేమంటే గిట్టని చాలా మంది మా స్నేహాన్ని చూచి ఈర్ష్యపడటం కూడా కద్దు. ఈ స్నేహిన్ని చెడగొట్టాలని ప్రయత్నాలు కూడా జరిగాయి. కాని—వాళ్ళకి అలాంటి అవకాశాన్ని ఇవ్వలేదు.

మరో అరగంటలో రైలుంది. ఈ రైలెక్కితే యీ రాత్రికే చేరుకోవచ్చు. కాని, ఊరువచ్చి కూడా మిత్రులకి కనుపించకుండానే వెళ్ళిపోవడం బాధగా ఉన్నా—వెళ్ళక తప్పడంలేదు.

రుక్మిణమ్మగారు నాకోసం రెండు బట్టలు తెచ్చారు. అవి నా చేతికిస్తూ....

"ఇవి పుచ్చుకో బాబూ....నీ జీవితంలో వందేళ్ళూ ఇంత తాపీగానే గడవాలని ఆశిస్తూన్నాను" అన్నా రావిడ.

కృతజ్ఞతా పూర్వకంగా ఆవిడకు నమస్కరించాను. ఆవిడ కళ్ళల్లో లీలగా కన్నీరు తొణికిసలాడింది.

"మిమ్మల్ని చూస్తోంటే ఏదో వాత్సల్యం పుట్టుకొస్తూంటుంది. ఇది చూచి నవ్వుతారు నాదంతా పిచ్చని అంటారు, నీకు తెలీదుగాని ఆయనకూడా పిల్లలంటే విపరీతమైన మోజు."

నవ్వి ఊరుకున్నాను. ఆవిడ నా పక్కనున్న సూటుకేసు చూచి అడిగారు :

"ఏదైనా ఊరు........"

"అవునండి, అత్యవసరంగా రాజమండిరి వెళ్ళాల్సి వచ్చింది. ఈ విషయం మావాళ్ళకి చెప్పండి. మళ్ళా రెండు రోజుల్లో వచ్చేస్తానని చెప్పండి"

"అలాగే...."

ఆవిడ దగ్గర సెలవు తీసుకుని స్టేషనుకు వెళ్ళాను. ప్లాటుఫారం మీద రైలు సిద్ధంగా ఉంది. టిక్కట్టు తీసుకుని రైలెక్కాను.

రైలు కదిలింది!

మేము స్థితిపరులం కాదు. నాన్న సంపాదనలో చాలా భాగం అక్కయ్యల పెళ్ళిళ్ళకే ఖర్చయింది. తాతగారు నాన్న కిచ్చిన అయిదెకరాల మాగాణి, మా స్థిరాస్తి. సాలీనా దానిమీద వచ్చే ఆదాయం, నాన్న జీతం - ఈ రెంటితో మా సంసారం ఏ వడిదుడుకూ లేకుండా సాగింది. అక్కయ్యలకు వాళ్ళ అదృష్టంకొద్దీ మంచి సంబంధాలే దొరికాయి. పండుగలకూ, పబ్బాలకూ వాళ్ళంతా వస్తే, ఉన్నదాంట్లోనే సంతృప్తి పరచేవారు నాన్న.

నాన్నకి అభిమానం జాస్తి. ఏ విషయంలోనూ ఆయన ఒకళ్ళని ఆశ్రయించటమంటే తల తీసినంతగా బాధపడేవారు. ఉన్నదే స్వర్గమనుకునేవారు నాన్న.

నేను బి.కాం. పాసయ్యి సంవత్సరంపాటు ఖాళీగావున్నా.ఆయన కించిత్తయినా చలించలేదు. ఆయనకున్న పరపతి నాకు ఉద్యోగం క్షణంలో వేయించగలదు. కాని—దీనిద్వారా అవతలివాళ్ళకి చులకనవటం ఆయనకు ఇష్టంలేదు.

'నీ అర్హత గమనించి నీకు ఉద్యోగం ఇవ్వగలిగినవాడే ఇస్తాడు. లేదూ - ఉన్న ఆ కొద్ది భూమినీ సాగు చేసుకుందువుగానీ.'

ఎప్పుడు నా ఉద్యోగం ప్రసక్తి వచ్చినా - ఆయన ఈ రెండు

ముక్కలూ చెప్పి ఊరుకునేవాళ్ళు. చదువుకుని ఉద్యోగం చేద్దామను కుని దృష్టినంతా చదువుమీదనే లగ్నం చేసినవాళ్ళకి మళ్ళీ సేద్యం చెయ్యాలంటే తలకు మించిన పని. ఈ విషయాన్ని కూడా ఆయన పట్టించుకోలేదు.

నిరుద్యోగిగా ఒక సంవత్సరంపాటు అతి కష్టంగా గడిచింది నాకు. ఒక్క ప్రయత్నం కూడా సమకూడి రాలేదు.

సరిగ్గా అలాంటి సమయంలోనే ఆయనతో నాకు పరిచయం కలి గింది. మా పరిచయం ఎలా జరిగిందో తలుచుకుంటూంటే యిప్పటికీ చిత్రంగా వుంటుంది నాకు.

మా ఊరు విశాలమైన మైదానాలకు ప్రసిద్ధి. బందరు తెలిసిన చాలామంది వప్పుకుంటారు. ప్రకృతి సిద్ధమైన ఈ మైదానాల ముందు కృత్రిమమైన ఉద్యానవనాలెందుకూ పనికిరావంటే సత్యదూరం కాదు. ప్రతిరోజు సాయంత్రాలు ఆ మైదానాల్లో కూర్చునేందుకు చాలామంది వస్తూండేవారు.

అక్కడికి వచ్చి నే కూర్చున్న తరువాత ఓ పది నిముషాలకు 'ఆయన' వస్తుండేవారు. నా ముందునుంచే వెళ్ళి, నాకు పది అడుగుల దూరంలో వత్తుగా పెరిగిన పచ్చిగడ్డిపైన కూర్చుండేవారు. నా ముందు ఆయన చాలా చిత్రమైన మనిషి.

కూర్చున్న క్షణంనుంచీ ఆకాశంవేపూ, చుట్టు ప్రక్కల స్థలాల వేపూ, మా ముందున్న తారురోడ్డు వేపూ ఆత్రంగా చూచేవారు. అలా ఓ అరగంటపాటు గడిపి వెళ్ళిపోయేవారు.

ప్రతిరోజూ ఆయన తప్పకుండా హాజరయ్యేవారు. అదేచోటులో కూర్చునేవారు ; అలాగే చూస్తుండేవారు.

ఒకటి రెండు రోజులు ఆయన ఏ కారణంచేతనైనా రాకపోతే

ఆరోజు నాకసలేమీం తోచేదికాదు. రోజుకంటె పావుగంట ముందే యింటికి వెళ్ళిపోయేవాడిని. ఆయనకూడా యింతేనేమో!

అలాంటిది ఆయన వారంరోజులపాటు రాకపోయేసరికి పిచ్చెత్తి నట్టయింది. ఎప్పటికప్పుడు ఈరోజైనా ఆయనొస్తే బావుండే దనిపించింది. వచ్చేవారు కాదు. అక్కడికీ ఒక పావుగంటా, అరగంటా కేవలం ఆయనకోసం ఎదురుచూస్తూ గడిపేవాడిని.

పదిరోజుల వరకూ ఆయన నాకు కనిపించలేదు.

ఏదో పోగొట్టుకున్న ట్టనిపించేది. అంతా వెలితిగా కనిపించేది.

ఆయ నెవరు? నే నెవర్ని? ఆయన నాకు కనిపించకపోతే మునిగిపోయేదేమి టసలు? - నాకు నేనె కొత్తగా కనుపిస్తున్నాను.

ఒకరోజు నే నక్కడ కూర్చుని ఉండగా ఒక అపరిచిత వ్యక్తి నా దగ్గరకు వచ్చాడు. నన్ను చూస్తూ....

"మీరేనా బాబూ....రోజూ యిక్కడ కూకుండేది?"

"ఏం....ఏం కావాలి?"

"మిమ్మల్ని అయ్యగారు యెంటబెట్టుకు రమ్మన్నారు."

"ఎవరు మీ అయ్యగారు?"

"అయ్యగారు కూడా ఈడనే కూకుండేవారు. అయ్యగారిక్కి వంట్లో బాగోలేదు. మిమ్మల్నెంటెట్టుకు రమ్మన్నారు."

ఆయనే! ....ఆయనే నన్ను పిలిపించారు. ఆశ్చర్య మనిపించింది. వచ్చినతన్ని మౌనంగా వెంబడించాను.

అతను ఆ దగ్గర్లో వున్న వో డాబా యింట్లోకి తీసుకెళ్ళాడు. ఇల్లు అందంగా అలంకరింపబడి వుంది. చుట్టూ ప్రహరీ - అందమైన క్రోటన్సూ - వీధి గుమ్మానికి చక్కటి డిజైనుతో వున్న తెర.

వరండాలో నాలుగు పేము కుర్చీలూ, వాటమధ్య టీపాయ్.

నా వెంట వచ్చిన వ్యక్తి లోపలికివెళ్ళి మళ్ళీ వచ్చి అన్నాడు:

"రండి. అయ్యగారు రమ్మంటున్నారు"

లోపలికెళ్ళాను. ఆయన పడకకుర్చీలో కూచ్చుని పేపరు చదువు కుంటున్నారు. ఈ పదిరోజుల్లోనూ ఆయన బాగా చిక్కిపోయినట్లు కనుపిస్తున్నారు. నన్ను, నవ్వుతూ ఆదరంగా ఆహ్వానించారు.కూచ్చునేందుకు కుర్చీ చూపించారు. నే కూర్చున్న తర్వాత అన్నారు :

"నా పేరు సీతారామయ్య"

ఆయన మంచి హోదాలో వున్న అధికారిట. రాజమండ్రి నుండి యిక్కడికి మొన్ననే బదిలీ అయిందిట ఈ ఊరి పరిసరాలు యింకా క్రొత్తగా కనిపిస్తున్నాయిట. కాని యిక్కడి వాతావరణం తనలాటి జబ్బు మనుష్యులకి మంచిదిట. ఇలా ఎన్నో విషయాలు చెప్పి చివరిన అన్నారు :

"రత్నాల్లాటి పిల్లలూ, ఆస్తీ, హోదా అన్నీ వున్నాయి నాయనా. కాని....నా ఆరోగ్యం రోజు రోజుకీ అధ్వాన్నంగా తయారవుతోంది. ఈ దిగులే నన్ను కృంగదీస్తోంది. అలా రెండు మూడు ఫర్లాంగులు ప్రతిరోజూ నడవమని డాక్టరు సలహా యిచ్చాడు. అతని మాటలను తూ. చ. తప్పకుండా పాటిస్తున్నాను. నిన్ను రోజూ చూస్తున్నాను. తెలీకుండానే నీతో పరిచయం చేసుకున్నంత పనయింది. ఈ పదిరోజులూ ఎక్కిన మంచం దిగలేదు. చిరాకూ, విసుగూ కలిగాయి. నువ్వు అక్కడికి వచ్చి వుంటావని భావించి, నాతో కాసేపు మాట్లాడతావనే ఉద్దేశ్యంతో నీకు కబురంపాను"

నాపేరూ, వివరాలూ వగైరా అడిగారు. అన్నింటికీ జవాబు చెప్పాను.

"మా అబ్బాయి నిరంజనం రాజమండ్రిలో హాస్టల్లో వుండే

చదువుకుంటున్నాడు. నా బదిలీలతో వాడి చదువు చెడిపోవడం నా కిష్టం లేదు. పెద్దమ్మాయి రాధ అత్తవారింట్లో వుంటున్నది. ఇకపోతే నేనూ, మా ఆవిడా, రెండో అమ్మాయి కుసుమా యిక్కడ వుంటున్నాం"

ఇది చెప్పిన తర్వాత రెండు క్షణాలు ఆగి, మళ్ళా నవ్వుతూ అన్నారు :

"కబుర్లు చెప్పుకునేందుకు సరైన నేస్తం దొరకలేదు. ఆఫీసులో వాళ్ళు ఇంటికొచ్చి కబుర్లు చెప్తారనే నమ్మకం నాకు లేదు.వాళ్ళకి కావల సింది ఆఫీసులో రగుల్తూన్న రాజకీయాలూ, నా మెచ్చుకోలూనూ. అందు చేతనే నిన్ను వెదుక్కున్నాను. నీతో స్నేహం చెయ్యాలని నిశ్చయించు కున్నాను"

ఆరోజు ఆయనే ఎక్కువసేపు మాట్లాడారు. అది లగాయితూ ప్రతిరోజూ ఆయన్ను కలుసుకునేవాడిని. పెద్దవారు, లోకానుభవం వున్న వారు కాబట్టి తరచూ ఆయన వక్త, నేను శ్రోతనూ. ఆయన ప్రతి విషయాన్నీ కూలంకషంగా పరిశోధించినట్టు చెప్పేవారు.ఆయన భావాలు తెలుసుకోడం మాత్రం నా వంతయ్యేది.

ఒకోసారి మైదానల్లోనూ, మరోసారి వారి యింట్లోనూ, తప్పని సరైతే సాక్షాత్తూ వాళ్ళ ఆఫీసులోకూడా మా సమావేశం జరిగేది.

నన్ను ఇద్దరు ముగ్గురు స్నేహితులు అన్నారు కూడాను—

"నీకేమిటోయ్ అధికారిని జేబులో పెట్టుకున్నావ్. నువ్వు నోరు తెరుచుకుని అడగాలేగాని నీకు ఉద్యోగం వాళ్ళ ఆఫీసులో క్షణాలమీద రాదూ...." అని.

కాని ఆయన మనస్తత్వం వాళ్ళకు తెలీదు.ఆయన అంత త్వరగా 'మనిషి'ని నమ్మరు. ఒకసారి కుసుమ పెళ్ళి విషయమై ఆయన నాతో యిలా అన్నారు :

"కుసుమ దురదృష్టవశాత్తు పక్షవాతానికి గురై చేయి పోగొట్టుకుంది. ఈ అంగవైకల్యం కుసుమ రూపాన్ని సైతం కించపరుస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లో ఆ పిల్లకి త్వరగా పెళ్ళవుతుందని నే ననుకోను. ఒకవేళ పెళ్ళయినా ఆ పెళ్ళితో సుఖపడుతుందంటే నాకు నమ్మకం చాలదంలేదు. కుసుమకి చాలా మంచి సంబంధాలే వచ్చాయి. కాని వాళ్ళని చూస్తోంటే కేవలం నా డబ్బు, హోదా మీదనే ప్రేమున్నట్టు కనిపిస్తుంది. కాని, నా పిల్లమీద ప్రేమున్నట్టు కనుపించడం లేదు. అందుచేతనే వచ్చిన ప్రతి సంబంధాన్నీ నేనే చెడగొట్టేస్తున్నాను. పిచ్చిపిల్ల- ఈ చర్యకి ఎంత తల్లడిల్లిపోతుందో రావ్ !"

అ మకే అంటాను. ఆయన ఎవర్నీ అంత త్వరగా నమ్మలేరని. ఇలాంటి పరిస్థితుల్లో నాకు మీ ఆఫీసులో ఉద్యోగం వేయించండని అడిగితే నన్నేవిధంగా భావిస్తారో కదా ! కేవలం ఉద్యోగం కోసరమే నేను ఆయన స్నేహాన్ని వాంఛిస్తున్నానని ఆయన అనుకుంటే, అంతకంటె ఘోరం మరొకటిలేదు. అలాంటి అవాంఛనీయమైన పరిస్థితి రాకూడదనే భగవంతుణ్ణి ప్రార్థిస్తాను.

కాని పరిచయస్థులు మా స్నేహానికి విపరీతార్థాలు తీస్తూనే వున్నారు. కాటికి కాళ్ళుచాపి చావుకోసం ఎదురుచూస్తోన్న పెద్దమనిషితో రెండు పదులు నిండిన యువకుడికి స్నేహమేమిటి వల్లకాదూ, ఈ స్నేహం వెనుక 'స్వార్థం' తప్పకుండా ఉండి వుంటుందని నా మొహం ఎదటనే అనేవారు. విని బాధపడేవాడిని. అంతేగాని ఆయన స్నేహం నుంచి తప్పుకోడం నా చేతకాదు.

ఒకసారి లోగడ వచ్చినట్టే ఆయనకు గుండె నొప్పి వచ్చింది. ఈమాటు ఉధృతంగా వచ్చింది. మా యిద్దరిమధ్యా వున్న అనుబంధం ఆయనకు నాచేత సపర్యలు చేయించింది. రెండురోజులపాటు కుసుమా,

నేనూ ఆయన మంచాన్ని అంటిపెట్టుకుని కూర్చున్నాం. ఆయన స్థితి బాగుపడ్డ తర్వాత కళ్ళను నీటితో నింపుకుని నన్నుద్దేశించి అన్నారు— 'నువ్వు దేవుడివి నాయనా!' అని.

సీతారామయ్యగారి పరిచయస్తులతో నన్ను తనకు ప్రాణం ఇచ్చే మిత్రునిగా పరిచయం చేశారు. ఆయన మిత్రులు కళ్ళింతవి చేసుకుని అర్థంకానట్టు ఆయనవైపు చూశారు. వాళ్ళలా చూస్తోంటే నాకు సిగ్గనిపించింది కూడా.

ఇంటర్వ్యూల నిమిత్తం హైదరాబాద్ వెళ్ళడం అది మూడోసారి. నాన్నని అడిగాను. 'నీ యిష్టం. పైకం కావాలిస్తే మీ అమ్మనడుగు' అని చెప్పి ఆయన ఆఫీసుకు వెళ్ళిపోయాడు. ఏమైనాసరే ఈ ఇంటర్వ్యూతో అటు ఉద్యోగమో, యిటు సేద్యమో తేల్చుకోవాలని నిర్ణయించుకుని అమ్మని డబ్బడిగి తీసుకొని హైదరాబాద్ వెళ్ళాను.

ఉద్యోగం గగన కుసుమమైంది. వచ్చిన ఏభైమంది అభ్యర్థుల్లోనూ ముగ్గుర్నే అర్హులుగా పరిగణించింది. ఆ ముగ్గురికీ ఉద్యోగాలు యిచ్చారు. మరొక అనుభవాన్ని గడించి యింటికి వచ్చాను.

సీతారామయ్యగారు ఆ మూడు రోజులనుండీ ఎందుకు కనిపించలేదని అడిగారు. నా హైదరాబాదు ప్రయాణమూ, దాని ఫలితమూ వివరించి చెప్పాను రెండు నిమిషాలు ఆయనేదో ఆలోచించి నన్ను అడిగారు:

"ఇంకా యిలా నిరుద్యోగిగా ఎన్నాళ్ళుండ దలిచావు?"

"అది మన చేతుల్లో ఉన్నదాండి?"

"పిచ్చివాడా! ప్రయత్నాలు చెయ్యాలే కాని, మనిషి సాధించలేని విషయమంటూ ఏదీ లేదు. రేపు ఒక అప్లికేషను రాసి నా చేతికివ్వు. మా ఆఫీసులోనే ప్రయత్నిస్తాను. చూద్దాం. నా చేతనయినంత వరకూ నేను ప్రయత్నిస్తాను. సరే"

నే నేమీ మాటాడలేదు.

ఆ తర్వాత రోజుకూడా అప్లికేషను గురించి అడిగారు. నా ఉద్యోగ ప్రయత్నం ఆయన చేతులమీదుగా జరగడం నా కిష్టంలేదు. అయినా, ఆయన బలవంతంమీద అప్లికేషను రాసివ్వక తప్పిందికాదు.

నెలరోజులు తిరక్కుండానే నాకు బెజవాడ బ్రాంచిలో ఉద్యోగం వచ్చింది. సీతారామయ్యగారికి నా ధన్యవాదాలు చెప్పుకున్నాను. ఆయన నా భుజాన్ని తట్టుతూ అన్నారు:

"చక్కగా ఉద్యోగం చేసుకో. పైకి రావడానికి ప్రయత్నాలు చెయ్యి. ఏది ఏమైనా మన స్నేహాన్ని మాత్రం మరచిపోకు."

ఆయన సహృదయత్వం, స్నేహంమీద ఆయనకు గల గౌరవ భావం నన్ను ముగ్ధుణ్ని చేశాయి.

జీవితంలో నన్నొక ఉద్యోగిగా స్థిరపరచింది సీతారామయ్యగారు. ఆయన చేసిన ఈ మహోపకారాన్ని మరో జన్మలో కూడా మరిచి పోలేను.

బెజవాడ వెళ్ళిన తర్వాత ఉత్తరాలు రాస్తుండేవాడిని. ఆయన సమాధానాలు వ్రాస్తుండేవారు. ఆయన రిటైరవడం, రాజమండ్రిలో స్థిర నివాస మేర్పరచుకోవడం అన్నీ ఈ ఆరు నెలల్లో జరిగాయి.

నా పెళ్ళికి వారం రోజుల ముందు ఆయనకు ఓ ఉత్తరం రాశాను; తప్పకుండా రావలసిందిగా ఆహ్వానిస్తూ దాని కాయన చాల చక్కటి సమాధానం రాశారు. నేను ఓ యింటివాణ్ని నవుతున్నానని తెలిసి ఆయన ఆనందిస్తున్నారట. పెళ్ళికి తప్పకుండా వస్తున్నట్టు రాశారు. పెళ్ళయిన తర్వాత వీలుండే నా భార్యను వెంటబెట్టుకుని రావలసిందిగా ఆహ్వానించారు.

* * *

సీతారామయ్యగారింట్లో ఇంకా దీపం వెలుగుతూనే ఉంది. రిక్షా దిగాను. నిరంజనం ఆ యింటిముందు నిలబడి వున్నాడు. అతన్ని చూడగానే ఏదో కీడు శంకించాను. "నాన్నగారు కులాసా ?" అని అడిగాను. అతను ముఖాన్ని దించేసుకుని గబ గబా ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

అతని వాలకం నన్ను కలవర పరచింది. ఇంట్లో అడుగు పెట్టగానే పార్వతమ్మగారూ, కుసుమా, రాధా ఏడ్వడం మొదలుపెట్టారు.

అలాగే అక్కడే ఉన్న కుర్చీలో కూలబడి పోయాను.

నిరంజనం నా దగ్గరకు వచ్చి అన్నాడు—

"ఆయన పోయేముందు మీ గురించి అడిగారు—" అతను పసిపిల్లాడిలా వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

ఆ మాటతో నా తల దిమ్మెత్తిపోయింది. చేతుల్తో తలను గట్టిగా పట్టుకున్నాను. సీతారామయ్యగారి రూపం నా ముందు తచ్చాడుతూనే వుంది.

*　　*　　*

గోదావరి గంభీరంగా వుంది.

చాలాదూరం నడిచి వచ్చాను. ఎన్నో స్మృతులు, ఆయనే వ్యక్తిత్వం, మా స్నేహం, గడిచిన రోజులు యివన్నీ నన్ను కలవర పెడుతున్నాయి.

ఆయన యిక లేరు ! ఆ స్నేహం ఇక తిరిగిరాదు.

నిరంజనం యింకా చదువుకునే కుర్రాడు. కుసుమకి పెళ్ళి కాలేదు. వ్యవహార దక్షత తెలిసిన యింటిపెద్ద లేనప్పుడు ఆ కుటుంబం ఎన్ని అవస్థలు పడాలో కదా !

ఆయ నొకసారి నాతో అన్నారు—

"నిరంజనం చదువు పూర్తయి, నాలుగురాళ్ళు సంపాయిస్తూ. కుసుమ పెళ్ళయి తన సంసారాన్ని చక్కగా దిద్దుకుంటూంటే నాకే

దిగులూ వుండదు రావ్! వచ్చే చావు అప్పటివరకూ వాయిదా వేసుకుంటే ఎంతో బావుణ్ణు!"

ఇది గుర్తుకురాగానే నాకు తెలీకుండానే ఏడుపొచ్చింది. హాయిగా బ్రతకటానికి నాకు అవకాశం కల్పించిన వ్యక్తికి నే నేవిధంగానూ సాయం చెయ్యలేకపోయాను. ఈ ఋణ విముక్తి ఈ జన్మకి లేదేమో!

చీకటి పడుతుండగా ఇంటిముఖం పట్టాను. మళ్ళీ ఉదయమే వెళ్ళి పోవటానికి నిశ్చయించుకున్నాను. దిగులుతో నిండిన ఆ ఇంట్లో యింకా నేనుండలేను. అనుక్షణమూ ఆయన గుర్తుకొస్తూ నా వల్లనయ్యే కార్యం ఒక్కటీ లేకపోగా, నా చేతగానితనం నన్ను గేళిచేస్తూ....వద్దు....నాకీ నరకం వద్దు.

ఆ ఇంటిముందు ఓ కారు ఆగివుంది. ఇంట్లో ఎవరిదో మగగొంతు వినిపిస్తోంది. మెల్లిగా నా గదిలోకి వెళ్ళాను. గదిలో కుసుమ కూర్చుని వున్నది. నన్ను చూడగానే లేచి నిలబడింది.

"ఇంతసేపూ ఎక్కడికి వెళ్ళి వచ్చారు? వుండండి. కాఫీ తెస్తాను" కుసుమ వెళ్ళిపోయింది.

పక్క గదిలోనుండి మాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి —

"అయితే నువ్వు రానన్నట్టేగా?"

"నన్ను బలవంతం చెయ్యకండి. ఇంతలో రాను."

"నీకేం తక్కువ చేశానని?"

"నా నోటితో చెప్పదలుచుకోలేదు. అంతా మీకు తెలుసు."

"మంచిది. నీ కెప్పుడు యిష్టమైతే అప్పుడే రా....నిన్ను బాధ పెట్టను. వస్తా."

నాగది గుమ్మం దగ్గర నిలబడి ఆ వ్యక్తిని చూచాను. ఆశ్చర్యం మా ఆఫీసరు! నన్ను నేనే నమ్మలేకపోయాను.

కారు బయలుదేరిన శబ్దం విని రాధ గదినుంచి బయటికి వచ్చి

వరండాలో నిలబడింది. అయిదు నిముషాలపాటు అక్కడే నిలబడి మళ్ళీ తన గదిలోకి వెళ్ళిపోయింది. వెళ్ళేముందు నావైపు చూచి తల దించుకున్నది.

"మా బావ వచ్చారు, అక్కయ్యని తీసుకెళ్ళేందుకు. కాని ఆయన పద్ధతి అసహ్యంగా తయారయింది. హోదాకు తగ్గ గుణం బావలో లేదు." కాఫీ యిస్తూ కుసుమ చెప్పింది.

"ఎవరికీ తలొంచడం చేతగాని ఆఫీసరు ఈవిడకి దాసోహ మంటున్నారు. ఈవిడ స్నేహంవల్ల సర్వవిధాలా చెడిపోటానికి సిద్ధపడు తున్నారు." మధుసూదనం మాటలు గుర్తుకొచ్చాయి.

"బావ ఈ హోదాకి చేరుకోవడంలో నాన్న కొంత సహాయం చేశారు. ఆ విశ్వాసం కూడా మరిచిపోయాడు బావ." కుసుమకూర్చుంటూ అన్నది.

రెండు క్షణాల తర్వాత మళ్ళీ ఆమే మాట్లాడింది.

"మీ పెళ్ళి రెండురోజు లుందనగా నాన్నగారు పోయారు. మీకు ఏ విషయమూ రాయవద్దని అంతకు మునుపే చెప్పారు. యిక్కడి విష యాల్తో మీ మనసు పాడవుతుందని ఆయ నుద్దేశ్యం."

"నాకు తెలుసు. ఆయన దైవస్వరూపులు."

"పోయేముందు అమ్మకో మాట చెప్పారాయన."

"ఏమని ?"

"..... .... .... ...... ....."

"చెప్పండి"

"ఈ ఇంట్లో నిరంజనానికి ఎలాంటి స్థానముందో మీకూ అదే స్థాన ముంటుందని అన్నారు." కుసుమ తన ముఖాన్ని చేతుల్లో దాచు కుంది.

మౌనంగా వుండిపోయాం. కాసేపటికి ఆమె వెళ్ళిపోయింది.

రాత్రి భోజనాలైన తర్వాత నా గదిలోకి వచ్చేస్తుండగా, రాధ నన్ను పిలిచారు. ఆవిడ గదిలోకి వెళ్ళాను.

"అలా కూర్చోండి. మీకు ఒక ముఖ్య విషయం చెప్పాలని వుంది."

"చెప్పండి" అన్నాను కూర్చుంటూ.

"ఏ విషయమైనా సరే కుండ బద్దలుకొట్టినట్లు,మనసులో ఉన్నది ఎదటివారికి చెప్పడం మంచిదంటాను. మీరేమంటారు ?"

"నిజమే...."

"మావారి దగ్గర నేను యిదే పద్ధతి ఆచరించాను. ఆయన మానసికంగా బలహీనులు. అది నాకు నచ్చదు. చేస్తున్నది తప్పని తెలిసికూడా కప్పిపుచ్చుకోటానికి ప్రయత్నం చేస్తారు. అందుకే ఆయనకూ, నాకూ సరిపడదు. ఇదంతా చెప్పి విసిగించటం నా కిష్టంలేదు. ఈమధ్య నాన్నగారి డైరీ తీసి చదివాను. ఒకవిధంగా ఆయనగారి తత్వం గూడా నాకు రుచించలేదు. ఈ పేజీలో ఆయన రాసిన అభిప్రాయం నన్ను ఆశ్చర్యపరిచింది. ఈ విషయం మా యింట్లోకూడా ఎందుకు చెప్పకుండా దాచుకున్నారో అర్థం కావటంలేదు. ఇది చదవండి" ఆ పేజీ తెరిచి డైరీ నాచేతి కిచ్చింది. చదివాను :

'రావ్ పెళ్ళట. అతను పెళ్ళి చేసుకుంటున్నాడంటే సంతోషంగా వుంది కాని—కుసుమకి అతను తగిన వరుడని ఒక నిశ్చయానికి ఇంతకు మునుపే వచ్చాను. ఈ మాట అతనితో చెప్పటానికి నా మనసెందుకో తటపటాయించింది. రావ్ యోగ్యుడు.అతణ్ణి అల్లుడిగాచేసుకుని ఈ ఇంటి కాధారం చేసుకుందామనుకున్న నాకు గట్టి దెబ్బే తగిలిందని చెప్పాలి.'

అదరిపడ్డాను. రాధ సూటిగా నా కళ్ళల్లోకి చూచింది.

"చదివారా !"

"ఊఁ...."

"నాన్న గురించి మీరేమనుకుంటున్నారు."

"విధి చాలా చిత్రాలు చేస్తుందని తెలుసుకున్నాను."

"పొరపాటుని 'విధి'కి అంటగట్టడం భావ్యంగాలేదు. ఆయన మిమ్మల్ని అల్లుడిగా స్వీకరించాలనుకున్నప్పుడు, ఆమాట మీతో అని వుండాల్సింది. అలా జరగలేదు. ఆయన ఇంత త్వరగా పోవటానికి కారణం...."

"రాధగారూ !" గట్టిగా అరిచాను.

"ఇంక నాకే పాపమూ అంటగట్టకండి ప్లీజ్. ఆయన చేసిన సహాయానికి బదులెలా చెప్పుకోవాలో తెలీని పరిస్థితుల్లో వున్నాను. అది చాలక నా మూలంగానే ఆయన.... వద్దు. మీ రలాంటి నింద నా నెత్తిన పెట్టకండి" ఒక్క ఉదుటున ఆ గదినుండి బయటకు వచ్చేశాను.

ఆవిడ మెల్లిగా అన్నది :

"మీ వ్యక్తిత్వాన్ని కించపరచాలనే భావం నా కెన్నడూలేదు. నాన్నగారి అతి మంచితనాన్ని గౌరవించటం తప్ప మరొకటి తెలీని మనం ఆయన్నీ కించపరచలెం !"

తర్వాత మాటలు నాకు వినిపించలేదు.... కాదు వినదలుచుకోలేదు.

౦——౦

# తప్పు

ఆ వేళ రోడ్డుమీద వెన్నెల సిగ్గులేకుండా పగలబడి నవ్వుతోంది. వాతావరణం చల్లగానూ వుంది. సముద్రపు గాలి మెల్లగా వీస్తూనేఉంది.

గౌరీపతి ఇంకా నడుస్తూనే వున్నాడు. టైం పదిగంటలు దాటింది. పదింబావు అయింది. గౌరీపతి నడక వేగం తగ్గించలేదు.

వెనగ్గా స్కూటరు రావడం, హారను వాయించి — గౌరీపతి పరాకుని హెచ్చరించి మరీ వెళ్ళిపోవడమూ జరిగింది. గౌరీపతి రోడ్డు దిగి పక్కన నుంచున్నాడు.

వెనక్కి తిరిగి చూశాడు. వూరు దాటి చాలా దూరం వొచ్చినట్టు గమనించలేదు. నడుస్తూంటే టైమూ, దూరమూ రెండూ తెలీలేదు.

జేబులోంచి సిగరెట్టుతీసి ముట్టించాడు. అది వెలగటానికి నాలుగు పుల్లలు ఖర్చయ్యాయి. ఆ దగ్గరలోఉన్న వంతెనమీద కూర్చున్నాడు. కాలుమీద కాలువేసి పైకాలిని కదల్చడం ప్రారంభించేడు.

తుకారాం।

21-8-64 ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వాడు కారా కిల్లీలు వేస్తాడు. వాడి నోట్లో కిళ్ళీ ఉన్నప్పుడు వాడిపక్క నించోడమే ఒక పెద్ద శిక్ష. వాడు మత్తుగా మాట్లాడుతాడు. ఆ మాటలు వింటూంటే చిరాకు. వాడు వెకిలిగా నవ్వుతాడు. వాడు నవ్వి నప్పుడు బైటపడే ఆ ఎర్రటి పళ్ళ మధ్య నల్లటి జీర చూస్తుంటే అసహ్యం.

అలాటి తుకారాం, కారా కిళ్ళీ నముల్తూ వెకిలిగా నవ్వుతూ ఇంత మాట తనముందే అనేశాడు. అచ్చోసిన ఆంబోతులా ఉన్నాడు గనక సరిపోయింది. లేకపోతే రెండు వాయించేవనే మరి.

ఒకనాడు సావిత్రికి తన గురించి గొప్పలు వ్రాసిందివీడె. వీడు వ్రాసిన వివరాలకి ఆ పిల్ల ఆనందించి తన పరిచయాన్ని కోరింది. అనగా—ఇప్పుడు తమ మధ్య ఇన్ని ఉత్తరాలు నడిచినందుకు ముఖ్య మైన కారణం తుకారాం!

ఇంతాచేసి ఇప్పుడు ఎద్దేవా చేస్తాడు రాస్కెల్.

కోపంలో సిగరెట్టు దమ్ము గట్టిగా పట్టించాడేమో గొంతంతా మండిపోయింది. కళ్ళవెంట నీరూ కారింది. తెప్పరిల్లుకోడానికి రెండు క్షణాలు పట్టింది.

ఈ మాటు సిగరెట్టు పొగ నెంపాదిగా పీల్చాడు. మెల్లిగా పొగ ఒదిలాడు. నోరంతా చేదుగా ఉండడం మూలంగా వక్కపొడి నోట్లో వేసుకున్నాడు. ఆ రుచి తగలగానే కొత్త ఉత్సాహం పొంగింది. ఏక బిగిని రెండు దమ్ములు పట్టించేడు.

తుకారాం లౌక్యుడు. లేకపోతే వాడిన్ని రంగులెలా మార్చ గలడు? ఇంత గొప్ప నటుడెలా కాగలడు?

మొదట్లో తనకీ రకమైన స్నేహంపట్ల అభిమానంలేదు. ఎక్కడో ఏదో వూళ్ళోవున్న వ్యక్తికి అనేక విషయాలపైన ఉత్తరాలు వ్రాసి

వాటిపైన అవతలివాళ్ళ అమూల్యాభిప్రాయాలూ, వాళ్ళ ఆదర్శాలూ ఆశయాలూ కనుక్కోవాలనే మహత్తర జిజ్ఞాస తనకిలేదు.

తుకారాంకి చాలా వూళ్ళనుంచి చాలా ఉత్తరాలొచ్చేవి. ఆడ, మగ అనే వ్యత్యాసం లేదు. ఈ స్నేహితులకి వూరూరా సంఘాలూ ఉన్నాయి. అప్పుడప్పుడు సమావేశాలు జరపడమూ కద్దు. దీనికోసం ప్రత్యేకంగా ఒక శీర్షిక నడుపుతూ ప్రతి ఆదివారం—ఈ శీర్షికలో కొత్త సభ్యులూ, వాళ్ళ చిరునామా, వాళ్ళ వ్యాపకాలూ వగైరా ప్రచురించి పాత సభ్యులకు పరిచయ భాగ్యం కలుగజేస్తోంది ఒకానొక దిన పత్రిక. తుకారాం ఈ కార్యక్రమాల్లో తలనిండుగా మునిగి తిరిగే మనిషి.

అతను తనతోపాటు చదువుకున్నాడు. తను బి. ఏ. పూర్తిచేసిన గుమస్తా. అయినా తుకారాం బి. ఏ. పరీక్ష కాలేదు. ఈ పరీక్షలూ, ఉద్యోగాలూ అతనికి అనవసరమని అతనే చెప్తూంటాడు. వూళ్ళో వాళ్ళ నాన్నగారికి మంచి పలుకుబడితోపాటు లక్షలూ వున్నాయి. గొప్ప వ్యాపారమూ వున్నది. మనిషకే వాడికివి చాలవూ ? వేరే ఉద్యోగాలెందుకు ? దమ్మిడీకి కొరగాని ఈ పరీక్షలెందుకు ?

ప్రతి సాయంత్రం—తుకారాం స్నానం వగైరా ముగించి, ముస్తాబై వూళ్ళో ఫాన్సీకార్నర్‌లో నించుంటాడు. బుగ్గన కారాకిళ్ళీ చేతిలో సిగరెట్టు పాకెట్టూ తప్పనిసరిగా ఉండాలి. ఒచ్చేపోయే మనుష్యుల్ని వోరగంటితోనూ, కారాకిళ్ళీ నోటితోనూ, నవ్వు మొహంతోనూ పలకరించడం అతని హాబీ।

పాతికేళ్ళయినా లేని తుకారాం ఫస్టుక్లాసు లౌక్యుడని మళ్ళీ అనుకున్నాడు గౌరీపతి.

పున్నమి. విచ్చుపువ్వులాంటి వెన్నెల్ని హాయిగా అనుభవించే

భాగ్యాన్ని తుకారాం మాట పూర్తిగా తినేసింది. మనిషిని చిత్రవధ చేసి నట్టు మాట్లాడాడు.

సావిత్రి తుకారాంకి ఉత్తరాలు వ్రాసేది.'అన్నయ్యా'అని సంబో ధిస్తూ ఎంతో తీయగా, హాయిగా వ్రాసేది. తుకారాం ఆ ఉత్తరాలన్నీ తనకి చూపించేడు. నిజానికి చాలా చక్కగా ఉత్తరాలు వ్రాయగలదు సావిత్రి.

తనకొచ్చిన మొదటి ఉత్తరం 'గౌరీపతి అన్నయ్యగార్కి' అని ప్రారంభించి వ్రాసింది. వాళ్ళమ్మకి నాన్నకి గౌరీపతి ఒక్కడే సంతా నం. సావిత్రి ఉత్తరం, ఆ పిల్ల సంబోధనా అతని గుండెల్లో ఆనం దాన్ని నింపింది. ఒక నూతన అనుభూతినీ, ధరకట్టలేని ఆనందాన్నీ గౌరీపతి పొందేడు. ఈ జీవితానికి భాగ్యం చాలనీ అనుకున్నాడు.

తుకారాంకి తన మనసు తెలీదు. అతను రంగుటద్దాల్లో ఎదటి వాడిని చూస్తాడు. గనకనే అనుక్షణం అతను ఆత్మవంచన చేసుకుంటు న్నాడు.

సావిత్రికి రాసే ఉత్తరాల్లో ఆ పిల్లని 'చెల్లీ' అని సంబోధిస్తూ గూడా — అతని హృదయంలో ఓ మూలగా 'కోరిక' దాచుకున్నాడు తుకారాం। పైపెచ్చు నోటికొచ్చినట్టు వాగడం।

ఛీ.... ఎందుకీ విలువలేని మనుషులు ?

ఇంతా చేస్తున్న తుకారాం అంత నిబ్బరంగా ఎలా నవ్వగలడో మరి. అతనంటాడు :

"నిజం భాయ్ । ఆడపిల్లలకి ఉత్తరాలు వ్రాయడంలోగల సరదా మరి దేన్లోనూ లేదు. కాపోతే సభ్యత అనేది లోకానికి భయపడైనా పాటించాలి గనుక ముసుగుతో అవసరం కలిగింది. చెల్లీ అని వ్రాయక పోతే అవతల్నుంచి రెండో ఉత్తరం రానే రాదసలు. గనకనే ఈ పథ

కం. పైగా ఇది మొగవాడొక్కడే ఆడుతూన్న నాటకంకాదు. ఆడ శాల్తీలూ చేతులు కలపాలి. మొన్నీ మధ్య నా ఫ్రెండొకడు పెళ్ళి చేసుకున్నాడు. వాడు ఆ అమ్మాయికి, నేనిప్పుడు సావిత్రికి రాస్తున్నట్టే ఉత్తరాలు రాసేవాడు మునుపు. దీన్నేమంటావ్ మరి? కాబట్టి పలకరింపుల్లో పట్టించుకోవలసిందేమీ లేదు. కొంపలూ మునిగిపోవు."

తుకారాం రాటుదేరిన మనిషి. అతన్ని ఒప్పించడం తన చాతనయ్యే పనికాదు. ఎవడి అభిప్రాయాలు వాడివని అతనెంత దారుణంగా మాట్లాడుతున్నా వినిపించుకోనట్టు నటిస్తే, చివరికి తననే వేలెత్తి చూపించాడు.

సావిత్రికి ఉత్తరాలు వ్రాయడంలో గౌరీపతికి తప్పు కనిపించలేదు. అలాగే ఆ పిల్లాను. కాని ఆమె చేసిన తప్పు ఒక్కటి — తనకి ఉత్తరాలు వ్రాయడం ప్రారంభించిన తర్వాత మెల్లిగా తుకారాంకి వ్రాయటం తగ్గించుకుంది. ఇది అతనికి కడుపుమంటగా తయారైంది. కసితో తనని గోలపెట్టాడు. అదీ పదిమందిలోనూ.

"ఈ మధ్య సావిత్రీదేవికి మామీద దయ తప్పింది. మాకంటే యోగ్యుడు దొరికాడుగా — ఇక మేము కనిపిస్తామా? వల్లకాదా? వారానికి రెండు ఉత్తరాలొచ్చేవి. అలాంటిది రెండు నెలలయ్యింది. ఇప్పటికొచ్చి ఒక్క ఉత్తరమూ లేదు. పది ఉత్తరాలు పోస్టుచేశాను. కనీసం అందినట్టయినా రాయలేదామె. ఇదేనా మర్యాదా?"

అతనీ మాటలంటూండగా గౌరీపతి నవ్వడం తప్పయింది. దాచుకున్న అతని ఈర్ష్య ఒక్కసారిగా విజృంభించింది.

"అవునుమరి–కథలు వ్రాసేవాళ్ళమీద ఆడకూతుళ్ళకి మోజు పెరిగిపోతుందని ఎవరో అన్నమాట తప్పు గానేగాదు. ఇదివరకు నమ్మలేదుగానీ ఇప్పుడిక నమ్మక తప్పడంలేదు."

"నోర్మూయ్" అన్నాడు పతి.

"నా నోరెందుకులే గురూ ! నేనెంత వాగినా విలువా, మన్నా ? నీ నోరు తెరుస్తే కవిత్వం, వ్రాస్తే కావ్యం! సావిత్రిలాంటి పిచ్చుకమ్మ లున్నంతవరకూ నిక్షేపంగా వర్ధిల్లు!" అన్నాడు తుకారాం నిష్ఠూరంగా.

"నువ్వనేదాంట్లో అర్థమేమైనా వుందా ? సావిత్రి ఎవరు ? నే నెవరు ? మా ఉత్తరాల్లోగానీ, మనసుల్లోకానీ నువ్వూహిస్తున్న నీచం వుండదసలు. వాళ్ళెవరో ఒకనాడు నువ్వే చెప్పావ్ నాకు."

"అప్పుడు కొందర్నే చెప్పాను. ఇప్పుడు కావకొస్తే నీబోటి ఆదర్శ రత్నాలని వందల్లో చెప్తాను. శ్రీరంగనీతులు పలక్కు. నీ గుండెమీద చేయివేసుకు చెప్పు.నీకా పిల్లమీద సదభిప్రాయమే ఉందా?"

"గౌరీపతి, తుకారాం కాదు."

"అలాగేం. కనిపించే ప్రతి ఆడపిల్లా నా సోదరని చెప్పుకునే గౌరీపతుల జాతకం తుకారాంకి బాగా తెలుసు భాయ్ ! నాకు అసూయ వుంది. అది నీ ఒక్కడిమీదే కాదు."

గౌరీపతి చేయి చురుక్కుమంది. సిగరెట్టు చివరంటా కాలి పోయింది. దాన్ని కిందపారేసి చెప్పుతో తొక్కేడు.

అక్కడ్నుంచి లేచి, ఊరివైపు నడక ప్రారంభించేడు. ఇంతకు మునుపు కనిపెట్టలేదుగానీ ఇప్పుడతని కాళ్ళు నొచ్చుతున్నాయి. ఒంట్లో నిస్సత్తువుగానూ వుంది. సమయానికి బందరు కోటనుంచి సిటీబస్సు ఒచ్చిందిగానీ లేకపోతే ఇంటికి ఏ స్థితిలో వెళ్ళేవాడో మరి.

* * *

సావిత్రి దగ్గర్నుంచి మూడుత్తరాలొచ్చాయి. ఒక్కదానికీ జవాబు వ్రాయలేదు గౌరీపతి. అసలు సావిత్రికి ఉత్తరాలు వ్రాయరాదనే నిర్ణయానికి వచ్చేడు.

వారంరోజుల క్రితం అడ్రసు వ్రాసి వుంచిన కాళీ కవరు అతని జేబులో బాగా నలిగిపోయి వుంది. రెండు మూడు మార్లు ఉత్తరం వ్రాశాడుగానీ కవర్లో పెట్టి పోస్టుచేయుడానికి మనస్కొప్పక వ్రాసిన కాగితాలన్నీ చింపేయడంగూడా జరిగింది.

మళ్ళా సావిత్రి దగ్గర్నుంచి పెద్ద ఉత్తరం వచ్చింది. పత్రికలో ప్రచురించిన తన కథ గురించి చాలా రాసి, కొంచెం కోపాన్ని అభినయిస్తూ ఉత్తరాలకి జవాబులు వ్రాయని పెద్ద రచయిత అన్నగారు, దీనికైనా తీరుబడి చేసుకుని జవాబు వ్రాయకపోతే నిరాహారదీక్ష ప్రారంభించడం ఖాయమనే ఆల్టిమేటమ్‌తో పూర్తి చేసింది.

గౌరీపతి నొచ్చుకున్నాడు. ఇంత చనువుగా వ్రాస్తున్న సావిత్రి నేనా తుకారాం అనుమానిస్తే ? ఆ పిల్లనేనా తక్కువచేసి చూస్తాడుత ?

ఇంతా అనుకున్న గౌరీపతి ఆ ఉత్తరానిక్గూడా జవాబు వ్రాయి లేదు. ఆ రాత్రి పడుకునే ముందుమాత్రం సావిత్రి ఉత్తరం గురించీ, తన ప్రవర్తన గురించీ రెండు ముక్కలు డైరిలో వ్రాసుకున్నాడు.

నాలుగు రోజుల తర్వాత సావిత్రి దగ్గర్నుంచి వచ్చిన మరో ఉత్తరాన్ని చదవటానికి బదులు ఒంటరిగా కూర్చుని ఏడ్చేడు. చదవకుండానే చింపి పారేశాడు. ఆ రాత్రి డైరీలో వ్రాసుకున్నాడు :

'సావిత్రి ఉత్తరం చదవకుండానే చింపేను. ఉత్తరమైతే చింపగలిగేనుగానీ....దాన్లో వ్రాసిన ప్రతి అక్షరాన్నీ వూహించగలను. తుకారాం గుర్తుకొస్తూంటే భయంగా వుంది. వాడు మా పాలిట యముడు.'

ఫాన్సీ కార్నర్‌లో తుకారాం చాలామార్లు కనుపించేడుగానీ చూడనట్లు తప్పించుకు వొచ్చేవాడు పతి. కాని ఓ ఆదివారం ఉదయం స్వయంగా తుకారామే గౌరీపతి యింటికి వచ్చేడు. వొచ్చీ రావడంలోనే ప్రారంభించేడు —

"నన్ను క్షమించు గురూ ! ఏదో ఉద్రేకంలో నిన్ను మాటలని నొప్పించినమాట నిజమే కావచ్చు. అంతమాత్రంచేత పగబట్టినట్లు నన్ను చూచిగూడా తప్పించుకు పోతున్నావు నువ్వు. ఒకటీ రెండు రోజులైతే సహించగలను. చూస్తూంటే నెలలు గడిచినా నీ పద్ధతి మార్చుకునేట్లులేవు. మరిచిపోయావు. మన నాలుగేళ్ళ స్నేహాన్ని దూరం చేయకు బ్రదర్ ! సావిత్రి అనే ఆడపిల్ల గురించి మనిద్దరం ఏకాభిప్రాయానికి రాలేదనే నెపంకొద్దీ నన్ను వెలివేయకు. నీకూ తెలుసు నేను చాలా మంచివాడినని. స్నేహమంటే ప్రాణం పెట్టే మనిషిననీ. నాకు నీ స్నేహం కావాలి. మన అభిప్రాయాలు గాలికి వదిలిపెడదాం. నువ్వు నన్నూ, నేను నిన్నూ ద్వేషించుకోవద్దు."

ఆ మాటలంటూండగా తుకారాం కళ్ళల్లో నీళ్ళు చిందేయి. గౌరీపతి తుకారాం భుజంతట్టి మెల్లిగా నవ్వేశాడు. తుకారాం కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు :

"చాలు బ్రదర్ ! ఇప్పుడు వెయ్యేనుగుల బలమొచ్చింది నాకు. చాలా సంతోషంగా వుంది."

గౌరీపతి భవదీయుడికి బాగా తెలుసు. ప్రస్తుతం అతను తోటి కథకుడు, తోటి ఉద్యోగీను. బక్కగా, రివటలా, ఎత్తుగా, ఎర్రగా వుంటాడు. అతని మీసాలు మరింత ముచ్చటగానూ, ఆ ఆకారానికో హోదాగానూ వుంటాయి. అతను నిజానికి చాలా మంచివాడు; కొంచెం పసిమనసు గలవాడూను.

పతి మావూరివాడు. నాతోపాటు చదువుకున్నాడు. నా చదువు పూర్తికావడంతోనే ఉద్యోగరీత్యా నేనీ వూరు రావడంతో మా యిద్దరి మధ్య కొంచెం దూరంలాంటిది కలిగింది.

కానీ, పోనాళ్ళు ఆఫీసు ఆర్డరు చూచి గంతులేశాను. పతి అన

బడే నా స్నేహితుడు ప్రమోషనుమీద మా ఆఫీసుకి బదిలీ కావడం నాకు నిజంగా సంతోషం కలిగించింది.

పతి ఈ ఊరికి రాకపోతే మా ఊళ్ళో జరిగిన పై కథ నాకు తెలిసేదికాదు. అంతమాత్రం చాత అతనొచ్చిన వెంటనే నాకీ కథ చెప్ప లేదు.

నాలుగు రోజులపాటు అతను మా అద్దెగదిలో 'గెస్టు'గా ఉన్నాడు. అప్పటికే నాలుగు జీవాలు మా గదిలో నివసించడంవల్ల అతనికోసం ప్రత్యేకంగా మరోగది వేట తప్పనిసరైంది. కానీ ఓ పట్టాన దొరికింది కాదు.

ఓ రోజు దయం పదకొండు గంటల ప్రాంతాల మా ఆఫీసుకి ఓ పొడుగుపాటి అమ్మాయి వొచ్చింది. రెండు జడలూ. ఓ జడలో గులాబి పువ్వూ. ఎడమచేతికి వాచీ. ఖరీదైన దుస్తులూ. దప్పున చెప్పొచ్చు కాలే జీలో చదువుతూన్న. కాలేజీ మొన్నీ మధ్యనే వొదిలిన ఆడపిల్లని.

మా ఆఫీసులో కుర్రవాళ్ళెక్కువ. ఆ అమ్మాయిని చూడగానే ఆఫీసు వాతావరణంలో చెప్పుకోదగ్గ మార్పు కనిపించింది. ఆ అమ్మాయి ఆఫీసంతటినీ కాసేపు తన అందమైన కళ్ళతో పరీక్షించింది. ఆఫీసు ప్యూన్ మునుస్వామి నేదో అడిగింది.

మునుస్వామి గబగబా గౌరీపతి సీటు దగ్గిరికొచ్చి ఏదో మెల్లిగా చెప్పేడు. గౌరీపతి మా ఆఫీసుకి కొత్తవాడవడం మూలంగానూ, అతని కోసం ఓ సివిలైజ్డ్ యువతి ఆఫీసుకి రావడంతోనూ మా వాళ్ళందరూ సస్పెన్సులో మునిగిపోయేరు.

పతి సీట్లోంచి లేచేడు. ఆ అమ్మాయి దగ్గరి కెళ్ళాడు. మరి కాసే పట్లో యిద్దరూ కలిసి బైటకెళ్ళిపోయేరు. నిజం చెప్పద్దూ-ఆ క్షణంలో పతిమీద 'ఇది' అని చెప్పలేని భావమేదో కలిగిందిగానీ, వెంటనే దాన్ని మర్చిపోటానికి సర్వవిధాలా ప్రయత్నించేను.

ఆ సాయంత్రం రూముకొస్తూ దార్లో ఆమె గురించి చెప్పేడు పతి. ఆమె పేరు సావిత్రిట. కొన్నాళ్ళ క్రితం అతనికి కలం స్నేహితు రాలుట. తను ఈ ఊరి ఆఫీసుకి బదిలీ అయినట్టు తెలిసి చూడటానికి వొచ్చిందిట.

ఈ రాత్రి పడుక్కునేముందు గౌరీపతి మిగతా కథకూడా చెప్పేడు. కథలో పరిచయమైన తుకారాంని, అతని నిజాయితీని మెచ్చుకోక తప్పింది కాదు. తన అభిప్రాయాల్ని తప్పొప్పుల్తో పరిమేయం లేకుండా కుండ బద్దలుకొట్టినట్టు చెప్పుకోగల తాహతు ఎందరికుంది ? పతి ఈ ఊరొస్తు న్నట్టు సావిత్రికి ఉత్తరం వ్రాసింది తుకారాంట !

మరునటి రోజు పతి అన్నాడు :

"నా కెలాగో రూముకావాలి. మొదట్లో సావిత్రిని వశకరించ రాదనే అనుకున్నానుగానీ, యిప్పుడు రూములేక నే పడుతూన్న అవస్థ కంటె సావిత్రి వాళ్ళింట్లో ఓ గది తీసుకోవడం మంచిదనుకుంటున్నాను"

"నువ్వీ విషయం ఆ అమ్మాయితో చెప్పేవా ?"

"సావిత్రే నన్ను అడిగింది - అభ్యంతరం లేకపోతే వాళ్ళింట్లో వుండిపోవచ్చని. ఆఫ్ కోర్స్.... రెంట్ పే జేస్తాననుకో."

"అదృష్ట జాతకుడివి. ఒక అందమైన ఆడపిల్ల యింట్లో కాపురం అందరికీ దొరకమంటే దొరుకుతుందా ?" అనేశాను. కాదంటే అలా అని నోరు జారాను.

నే నీ మాట అనడంలో అతను చాలా సీరియస్‌గా మారిపోయేడు. తల దించుకుని నిష్ఠూరంగా అన్నాడు :

"నువ్వూ తుకారాంలాటి మనిషివే. మీ కందరికీ చాలా దారుణమైన ఆలోచనలున్నాయి."

నేనేం మాటాడలేదు. నే నన్నది తప్పని వొప్పుకోడానికి సిగ్గు

పడను. కానీ నేను తుకారాంలాటి మనిషిని కాను. సాధ్యమైనంతవరకూ నా అభిప్రాయాలు దాచుకోడం అలవాటు నాకు.

* * *

గౌరీపతి సావిత్రి వాళ్ళింట్లో మకాం పెట్టినట్టు వారం రోజులు తిరక్కుండానే ఆఫీసంతటికీ తెలిసింది. వాళ్ళ 'దారుణమైన ఆలోచనలు' నేనూ విన్నాను. గౌరీపతి విషయం తెలిసినవాడిని గనక వాళ్ళని హెచ్చరించడం గూడా జరిగింది. ఏమైతేనేం 'క్రొత్త పక్షి దేవాంతకుడు' అనే కామెంట్ ఆఫీసులో విజృంభించేసింది:

ఏదో సభలో విన్నాను. వివరాలన్నీ గుర్తుకు లేవుగానీ మనసుకి నచ్చిన ఈ ఒక్క వివరమూ గుర్తుకున్నది. 'నేటి కథా సాహిత్యం' అనే విషయంపైన వయస్సుల్లో పండిపోయిన పెద్ద రచయితలు మాట్లాడుతూ ఈనాటి యువ రచయితలమీద ఓ విసురు విసిరేరు. యిప్పుడు కథలు రాసే కుర్రాళ్ళు కేవలం 'లవ్ స్టోరీస్' వ్రాసి ఆడపిల్లల దగ్గర్నుంచి ఉత్తరాలు రాబట్టుకోడమే ఒక ధ్యేయంగా పెట్టుకున్నారని ఉద్ఘాటించారు.

ఇది విన్న ఓ యువ రచయిత చప్పున వేదిక ఎక్కి తన ఆవేశాన్ని గంభీరోపన్యాసం ద్వారా తెలియజేశాడు. పెద్దలన్నట్టు ఆడపిల్లల మన్ననలు పొందుతూన్న కుర్ర రచయిత నిజానికి అదృష్టవంతుడనీ, ఆ రోజుల్లో వూరికో రచయితైతే ఈనాడు ఇంటికో రచయితై 'కాంపిటీషన్' పెరిగి రోజురోజుకీ నూతనమైన ప్రయోగాల్తో కొత్త కొత్త పద్ధతుల్ని ప్రవేశపెట్టి కథా రచన స్థాయిని పెంచిన కుర్ర రచయితకి వొస్తూన్న ఈ అభినందనలని సహించలేక పోటీలు లేని ఆ రోజుల్లో ఘనుల మనిపించుకున్న 'పెద్దయ్య' గార్ల విసురులో కేవలం ఈర్ష్యే కనిపిస్తుందని తిరిగి అంటించాడు.

ఏతావాతా చెప్పే దేమిటంటే గౌరీపతి కిదంతా తెలుసు. అలాంటప్పుడు జనం ఏమనుకుంటేనేం అని తుడిచిపెట్టుకు తిరగాలి. కానీ అలా జరగడంలేదు. అదీగాక అతను సావిత్రితోపాటు షికార్లకి వెళ్ళేది నిజం. వాళ్ళింట్లో వారానికి రెండురోజులు భోంచేసేది నిజం. తీరిక సమయాల్లో ఆమెతో చీట్లాట ఆడేది నిజం. జనం అనుకునేందుకివి చాలవు ?

గౌరీపతి సావిత్రిని సొంత తోబుట్టువులా చూస్తున్నా నంటాడు. చెల్లీ అని పిలుస్తూన్నా నంటాడు. ఇది నాకు నచ్చదు. నాతోపాటు పుట్టిన ఆడపిల్లనే చెల్లీ అనుకుని నా చుట్టూ "పరిమితి"ని కట్టుకున్న నాలాటివాడు పరాయి ఆడపిల్లని స్నేహితురా లంటాడు. గాని 'చెల్లీ' అనడానికి చప్పున వొప్పుకోడు. చెల్లీ అనే దాన్లో ఉన్న పవిత్రత నేస్తురాలనే దాన్లో లేదంటే నే నొప్పుకోను. ఇదీ నా అభిప్రాయం. అవుతే అంత మాత్రాన నాకు నచ్చిన కాకరకాయ పులుసు అందరికీ నచ్చాలని ఎక్కడుంది ? కొందరికది చేదుగానూ వుండవచ్చుగదా !

ఏమైతేనేం గౌరీపతి నాకు విడ్డూరంగానే కనిపించేడు. అతని చర్యలన్నీ చిత్రంగానే ఉన్నాయి. ఒకనాడు తుకారాం ములుకుల్లాటి పలుకులు విని భయపడి సావిత్రికి ఉత్తరాలే వ్రాయకూడదని నిర్ణయించుకున్న గౌరీపతి, ఆ పిల్ల వొచ్చి ఆహ్వానించగానే ఆ యింట్లో చేరేడు; అతి చనువుతో తిరుగుతున్నాడు.

విశ్వనాథం సావిత్రి మేనత్త కొడుకు. అతను విశాఖపట్టణంలో ఎమ్మే చదువుతున్నాడు. సెలవులకి ఈ వూరొచ్చాడు. చాలా నెమ్మదస్తుడు. అమాయకుడన్నా నాకేం అభ్యంతరంలేదు. జీనియస్సులంతా అమాయకులేనని ఉదాహరణలిచ్చి గూడా అతన్ని సమర్థించగలను. బావ కాబట్టి, బావైన తరువాత కొంత చనువుంటుంది గనుక సావిత్రి అతన్ని

వేళాకోళం చేయవచ్చు. అంత మాత్రానికే పతి సంబరపడిపోయేవాడు. తనూ అతన్ని వేళాకోళం చేయడానికి ప్రయత్నం చేశాడు.

కథలు వ్రాసేవాళ్ళలో నూటికి తొంభై మంది మంచి మాటకారులని ఓ మాటకారి కథా రచయిత అతని సన్మాన సభలో కళ్ళజోడు తీసి మరీ చెప్పేడు. గనుక ఆ థియరీ ప్రకారం పతి మంచి మాటకారే కావచ్చు. అవుతే ఆ మాటకారితనం విశ్వనథం మీద కావాలని ప్రయోగించడం థియరీ చెప్పిన పెద్దమనిషి ఒప్పుకోడు.

ఓనాడు సాయంత్రం విశ్వనాథం మా రూము కొచ్చేడు. గుమ్మం దగ్గరెంతసేపట్నుంచి తచ్చాడుతున్నాడో గాని, నేను స్నానంచేసి రూంలోకి వొస్తూ అతన్ని చూసేను. లోపలికి రండని పిలుస్తేనేగానీ అతను లోపలికి రాలేదు. సిగ్గుపడుతూన్నే వొచ్చాడు. బట్టలు మార్చుకున్నాను. ఇద్దరం చాపమీద కూర్చున్నాం. సిగరెట్టు ముట్టించేను నేను చూస్తుండగా విశ్వనాథ మెప్పుడూ సిగరెట్టు కాల్చలేదు. కానీ ఆనాడు అతనూ సిగరెట్టు ముట్టించేడు. ఆ వాలకం చూస్తుంటే కొత్త పిస్తునిపించింది.

"ఇది మొదటిసారిగా కాల్చడ మనుకుంటాను" అడిగేశాను. అతను తలూపి —

"అవునండీ! మగాడు సిగరెట్టు కాల్చితేనే ప్రయోజకుడట. మీ గౌరీపతిగారు తెగ కాల్చేస్తారు" అన్నాడు దగ్గుతూ.

"అవుతే ఇంకేం. ఇంకాస్త ప్రయోజకులు కావాలనుకుంటే నాలుగు కథలూ వ్రాయండి" అన్నాను నవ్వేస్తూ.

"నాకే గనక కథలు వ్రాయడమొస్తే రెండేళ్ళ క్రితమే సావిత్రిని పెళ్ళి చేసుకునేవాడిని."

నవ్వూ. జాలీ రెండూ కలిగేయి. టాపిక్ మార్చాలన్న వుద్దేశంతో—

"ఈ వేళప్పుడు హాయిగా ఇంటిదగ్గర కూర్చుని మీ సావిత్రి గారితో ఖబుర్లు చెప్పుకోక యిలా వొచ్చేశారేం ?"

"బలేవారే ! సావిత్రి ఇప్పుడు మన్తో ఎందుకు మాటాడుతుంది మాస్టారూ ? అందుకు కైమేదసలు ! మీ పతిగారూను, ఆవిడానూ సినిమాకి వెళ్ళిపోయారు."

"పోనీ.... మీరూ వెళ్ళలేకపోయారా?"

"అందుకేగా ఇక్కడికి కొస్తా. రండి, మనమూ వెడదాం."

అతని కేమని చెప్పాలి ? ఎలా చెప్పాలి?

"సావిత్రివాళ్ళు వెళ్ళిన సినిమాకే వెడదామా ?" అడిగేను.

"వాళ్ళు ఇంగ్లీషు సినిమా కెళ్ళారు. నాకా సినిమాలు నచ్చవనే మాట నిజమేననుకోండి. కంపెనీగా వెళ్ళేందుకు గూడా పనికిరానా ? నేను రానక్కర్లేదని సావిత్రి అన్నది. ఏదైనా తెలుగు సినిమా కెళ్ళమని గౌరీపతిగారు నాకు సలహా యిచ్చేరు" అన్నాడు దిగులుగా.

"మీరేం బాధపడక్కర్లేదు. ఆకాడికి వాళ్ళిద్దరికీ ఇంగ్లీషు సినిమాలు అర్థమౌతాయనుకుంటున్నారా? అదో రకమైన మోజంతే. పోనీండి. మనిద్దరం హాయిగా మల్లీశ్వరికే వెడదాం. సరేనా ?" అన్నాను.

అతను తలూపాడు. ఇద్దరం మల్లీశ్వరికే వెళ్ళేము. ఒక మనిషిని ఏద్దేవా చేయడం సులువైనపనే గావచ్చు. మనిషికున్న పిలువల జోలికి పోయి ధర కట్టడం అన్యాయం. ఎంత మంచి మనిషికైనా సహనమనేది పరిమితిలో వుంటుంది. ఆ మంచితనంమీద ఎదటివాడు విరుచుకుపడి అపహాస్యం చేస్తే ఏమో చెప్పలేను. పగపట్టిన మనిషి ఎన్ని దారుణాలైన చేయగలడని చరిత్ర చెబుతూనే వుంది.

ఇంత మాత్రంచేత సావిత్రినీ, గౌరీపతినీ నిందించడంగానీ, నా విశాల హృదయాన్ని చాటి చెప్పాలనే తాపత్రయంగానీ, విశ్వనాథాన్ని హీరో చేయాలనే తపనగానీ పై అభిప్రాయం తెలీజేయదు.

ఆరోజు అలా గడిచింది.

మరో చిత్రాతి చిత్రమైన సన్నివేశంలో పతి యిరుక్కున్నాడు. మా ఆఫీసుకోనాడు రెండుజడల సావిత్రి ఒచ్చినట్టే ఆనాడూ మరో యువతి పతికోసం వచ్చింది. ఆఫీసులో కడుపుమండిన ఆసామి కాస్త బిగ్గరగానే అనేశాడు :

"అయినా యింత పిచ్చి పనికిరాదు సుమాండి."

ఆ ఆసామి మాటవిని నేనే నొచ్చుకున్నాను. పతి వినివుంటే అతనికోపం తారస్థాయి నందుకోవాలి. కానీ అలా జరగలేదు. ఆ అమ్మాయితో మాట్లాడివచ్చిన తర్వాత సీట్లో కూర్చుంటూ అన్నాడు :

"రాజ్యలక్ష్మి అని మా పిన్ని కూతురు. వాళ్ళఫ్రెండు పెళ్ళికి వూరొచ్చిందట, వెంట మరో యిద్దరు చెలికత్తెలతోసహా. ఈ రాత్రి పదిన్నరకి కారుమీద తిరుగు ప్రయాణంట. ఫస్టుషో సినిమాకి రమ్మంది. దాంతో సినిమా చూడటం నా కిష్టంలేదు. నేను రానని చెప్పేను. ఇదీ జరిగిన కథ కానీ మనవూర్సకి మాత్రం బుద్ధుల్లేవు."

అదే సాయంత్రం విశ్వనాథం మా రూమ్కొచ్చేడు. వచ్చీ రావడంతోనే వాచీ చూసుకుని వెలుగుతూన్న సిగరెట్టు పారేసి అన్నాడు —

"ఏమైనా సరే! మనం ఈ వేళ ఇంగ్లీషు సినిమాకే వెడదాం. వాళ్ళిద్దరూ వెళ్ళారు."

"పతి గూడానా ?"

"వాళ్ళిద్దరంటే సావిత్రీ, అతనే గదండీ!" అన్నాడు మరో సిగరెట్టు ముట్టిస్తో.

ఇంతకుముందే రాజ్యలక్ష్మి వాళ్ళన్నయ్య పతని సినిమాకి వెడదామని అడిగింది. అతనికి ఆ అమ్మాయితో సినిమా చూడటం ఇష్టం

లేదని చెప్పేడు. ఇప్పుడు అతని చెల్లి సావిత్రితోపాటు ఇంగ్లీషు సినిమా కెడుతున్నాడు.

రాజ్యలక్ష్మి పిన్నికూతురు—అసగా—చెల్లి. సావిత్రి స్నేహితురాలు. నామాంతరం - సోదరి. అతని అభిప్రాయాల ప్రకారం అతనికి ఈ ఇద్దరూ చెల్లాయిలే! అంతవరకూ బాగానే వుంది. రాజ్యలక్ష్మితో సినిమాకెళ్ళడం యిష్టంలేదుగానీ సావిత్రితో వెళ్ళడానికిష్టపడ్డాడు. నిజమే - నా మట్టుకు నాకు చెల్లాయితో బజారుకెళ్ళడంగానీ, సినిమా చూడటంగానీ ఇష్టంలేదు. కారణాలు అనేకం. ఆ విధంగా పతి రాజ్యలక్ష్మితో సినిమాకెళ్ళ లేదంటే ఒప్పుకుంటాను. కానీ ఈ చెల్లి సావిత్రితో సినిమా చూడటంలో అతనికి ఇబ్బందులేమీ వుండవా? ఉన్నా అవి నిజమైన యిబ్బందులు కావా? ఇదీ నా ప్రశ్న.

ఓ పక్క—విశ్వనాథం సినిమాకి వెళ్ళే తొందరలో నన్ను తొందరచేశాడు. గబగబా బట్టలు మార్చుకుని బైటపడ్డాను. ఇద్దరమూ థియేటరు దగ్గర రిక్షా దిగాం. అప్పుడే సావిత్రీ, పతీ థియేటర్లోకి వెడుతున్నారు.

విశ్వనాథం పళ్ళు నూరాడు. అతని కళ్ళలో కోపం ప్రస్ఫుటంగా కనిపించింది. సినిమా మానేద్దామనుకున్నాను. కానీ ఆసరికే విశ్వనాథం టిక్కెట్లు తీసేసుకున్నాడు.

లోపలికి వెళ్ళాం. సీట్లో కూర్చోబోతూ నా ముందు సీట్లో ఉన్న అమ్మాయిని చూచి ఉలిక్కిపడ్డాను. ఆమె రాజ్యలక్ష్మి! ఆమె కిరువైపులా పతి చెప్పిన చెలికత్తెలూను.

లైట్లు ఆర్పి న్యూస్‌రీలు ప్రారంభించారు. నా పక్కన కూర్చున్న విశ్వనాథం సినిమా చూడటం మాని వెనగ్గా కూర్చున్న సావిత్రీ, పతుల వైపు చూస్తున్నాడు. రాజ్యలక్ష్మి కేరింతలు కొడుతూనే వుంది.

ఇంటర్వెల్లో అనుకున్నంతా అయ్యింది. పతినీ, సావిత్రినీ రాజ్య

లక్ష్మి చూచింది. చూచినవెంటనే లేచి అటువైపు నడిచింది. విశ్వనాథంతోపాటు బైటకొచ్చేశాను. సిగరెట్లు కాల్చుకుంటూండగా రాజ్యలక్ష్మి పతులు బైటకొచ్చేరు. మాకొక్క_స్త దూరంగా నించున్నారు.

"ఎవర్రా ఆ పిల్ల ?"

"నా స్నేహితురాలు."

"నాతో సినిమాకి రానని చెప్పి ఇప్పుడెందు కొచ్చావ్ ?"

"............"

"ఇంత మారిపోతావనుకోలేదు. దొడ్డమ్మకి విషయం తెలుస్తే...."

"అబ్బ. అట్టే మాటాడకు నీ పుణ్యమాయిరి. ముందు లోపలికి పద."

విశ్వనాథం చేయి పుచ్చుకుని గేటు దాటేను. రిక్షా ఎక్కి మా రూము కొచ్చేశాము. పతి ఎలాంటి ఇరకాటంలో నలిగిపోయి ఉంటాడో ఊహించడానికే భయంగా వుంది. దానికి తగ్గట్టుగా విశ్వనాథం పతిమీద విరుచుక పడ్డాడు. చివరికి కొస మెరుపన్నట్టు—

"నేను అతని డైరీ సంపాయించాను మాస్టారూ చూడండి. దీన్లో మా సావిత్రి గురించి అతనెంత దారుణంగా వ్రాసుకున్నారో మీరే చదవండి" అతని జేబులోంచి డైరీ తీశాడు.

అదిరిపడ్డాను.

"మీకెలా దొరికిందీ డైరీ ?"

నవ్వడం మాత్రం అమాయికంగా నవ్వేడు.

"నన్నందరూ ఫూల్ నన్నారు. కానీ పేగులు లెక్క_పెట్టగలను. మీ పతి గురించి ఊహించలేనంత చవటనుగాను. అవుతే గట్టిగా వాగుతే కలిగే నష్టం మాకే గనుక మౌనం వహించేను మావయ్య సావిత్రిని నెత్తి నెక్కించుకున్నాడు. ఆ కపిల్లకి బలిగారాం నేర్పాడు...."

ఇంకేదో అనబోయాడు. అతని ఆవేశం చూచిన తర్వాత నాకే భయం కలిగింది. అంచేత అతని మాటకి అడ్డుపడి అన్నాను :

"జరిగిందేదో జరిగిపోయింది. పరాయివాళ్ళ డైరీని చదవడం తప్పు. దయచేసి మీరా డైరీని అతని కిచ్చేయండి. అది మర్యాద."

"ఎవరికివ్వాలో నాకూ తెలుసు మాస్టారూ !" అన్నాడు సిగరెట్టు ముట్టిస్తూ. ఆ తర్వాత అతను లేచి నిలబడి 'గుడ్‌నైట్' చెప్పి, డైరీ తీసుకుని వేగంగా వెళ్ళిపోయాడు.

అవమానాన్ని మనిషి సహించలేడు. అందునా సాక్షాత్తూ ఒక ఆడ పిల్లా, ఒక కుర్రాడు కలిసి మరో కుర్రాడిని ఎద్దేనా చేయడం ?

విశ్వనాథం రుద్రుడయ్యాడు. ఇదిమాత్రం నిజం.

* * *

ఈ కథకి ముగింపు అతి భయంకరముగా వ్రాయాలని మొదట్నుంచీ అనిపించలేదు. దీన్లో ప్రత్యేకంగా నేనెవర్నీ దూషించనూలేదు. పతి అనేవ్యక్తి-కాలం కలిసి రాకపోతే నేనే కావచ్చు. కథలు వ్రాసే వాళ్ళలోనే పతి వుంటాడనీ నా అభిప్రాయంకాదు. ఆ మాటకొస్తే స్వజాతిమీద వల్లమాలిన పక్షపాత బుద్ధి నాకు.

ఇప్పటికీ విశ్వనాథం పతి గురించి అంటాడు.

"అతను రెండు రకాల మనిషి. 'సోదరీ' అని అతని పరిచయాన్ని ప్రారంభించకపోతే-ఏమో సావిత్రి నాకు దక్కేదికాదేమో, కానీ అంత ధైర్యం అతనికెక్కడేడ్చింది మాస్టారూ ! వీళ్ళంతా ముసుగులో దాక్కున్న దొంగలు !"

గౌరీపతిలాంటి మనిషిమీద జాలి ప్రదర్శించేది నేను ఒక్కణ్నే నేమో !

o—o

# మనిషి పగ

మనసుచెడి, తీర్థయాత్రలనే నెపంమీద తిరుగుతున్న చలానికి వేదాంతిలా మెరిసిపోయే జనార్దనరావ్ వాల్తేరు స్టేషనులో కనుపించేడు. పూరీ వెళ్ళే ప్రయాణాన్ని వాయిదా వేసి అక్కడ దిగిపోయేడు చలం. జనార్దనరావ్‌తో పాటు అతని గదికి వెళ్ళేడు.

గదిలో కూర్చున్న తర్వాత వాళ్ళిద్దరి మధ్యా అతి భయంకరమైన సంభాషణ జరిగింది. దాన్లో ముఖ్యమైన కొన్ని మాటల్ని ఇక్కడ వ్రాయడం అవసరం. జనార్దనరావ్ అడిగేడు ..

"మరిచి పోయారా ?"

"లేదు గుర్తుకొస్తుందేమిటాని బాధగావుంది."

"పోనీ మరిచి పోవటానికి ప్రయత్నం చెయ్యగూడదూ ?"

"చాతగావడంలేదు. రెండుసార్లు కృష్ణలో దూకి చావాలనుకున్నాను. చివరికి చావలేక పోయాను."

"చచ్చేం సాధిస్తారు ?"

"బ్రతికేం చేయగలను ?"

4-12-64 ఆంధ్ర సచిత్ర వారపత్రిక

"పిచ్చి."

"కాదు. నిజం."

"నవ్వేదా?"

"ఎందుకు?"

"కేవలం ఒక ఆడపిల్ల గురించి -"

"కాదు. నా జీవితానికి వెల్తురునిచ్చే ఓ జ్యోతిగురించి అనండి."

"నిజం చెప్తున్నావ్ బ్రదర్! మనిద్దరం ఒకే పడవ ఎక్కాం" అనుకున్నాడు జనార్దనరావ్.

"చూడండి! నేను చాలా అందమైన కుర్రాణ్ణి. ఈ రెండు నెలల్లో నే నెంత మారిపోయానో గమనించారా? తలుచుకుంటే జాలి కలుగుతోంది. జా....లి" అన్నాడు చలం.

"వరలక్ష్మి మీకిప్పుడు కనిపిస్తే?"

"ఎక్కడుంది?"

"చూడాలని వుందా?"

"కాదు. చంపాలనివుంది."

"నిజంగా చంపగలవా?"

"అంతకంటే వేరే మార్గములేదు ఈ జ్ఞాపకాల వలనుంచి నేను తప్పుకోవాలంటే-వరలక్ష్మిని. ఆమె భర్తనీ చంపి నేనూ చావాలి. అంతే."

"నమ్మొచ్చునా?"

"ఏం. మీకుమాత్రం చంపాలని లేదా?"

"చంపగలను. కానీ దానివల్ల నేను చావకూడదు."

"ఏం?"

"నే నిప్పుడు ప్రయోజకుడను కావాలని వుంది. ప్రయోజకుడ్న

యిన తర్వాత నన్నేడిపించిన జనాన్ని కష్టించాలని వుంది. నేను నవ్వుతూ వాళ్ళని ఏడిపించాలని వుంది. అందుచేత నేను చావకూడదు."

"అయితే వరలక్ష్మి వాళ్ళమీద మీపగ ఎప్పటికి చల్లారుతుంది?"

"వరం మీదేకాదు....నాకు చాలామందిమీద వుంది పగ. అవుతే అందర్నీ పేరు పేరున చంపడానికి నాకు టైంలేదు. చట్టం అంతవరకూ నోరుమూసు కూర్చోదు."

జనార్దనరావ్ నడుం వాల్చేడు. కాలుమీద కాలు వేసుకోవాలనే కోరిక కలిగింది. నవ్వేస్తూ అన్నాడు :

"రాజులా బ్రతికేవాడిని. దేవుడు నాకు కీడు చేశాడు. ఓ కాలు తీసేశాడు."

చలం ఏమీ మాటాడలేదు. మళ్ళా జనార్దనరావే అడిగేడు—

"అవునూ! మీరు వరాన్నీ, దాని మొగుడ్నీ చంపుతానన్నారే—దానికి మీ ప్లానేమి టసలు ?"

"వినాలని వుందా ?"

"అవును."

"ఏంలేదు. ముందు వరలక్ష్మి భర్తని మంచి చేసుకుంటాను. మంచితో విషం తినిపించవొచ్చుట."

"మీ దగ్గర విషం వుందా ?"

"లేదు."

అప్పటిగ్గాని జనార్దనరావ్ బైటపడలేదు.

"నా దగ్గరుంది. దాచిపెట్టాను. అవుతే ఎల్లా వుపయోగించాలో తెలీక వాయిదాలు వేస్తున్నాను. మీకు తెలీదేమో—నే నీ మధ్య అతి దారుణంగా మారిపోయేను. రాక్షసుడ్నవుతున్నాను."

"లేదు. మీరు కాలేరు. మీలో భయం చావలేదింకా. నా విషయం

వేరు. నే నన్నింటికీ తెగించేను. ఏదైనా చేస్తాను. ఏమీ, ఆ విషం ఇల్లా ఇవ్వండి. ప్రయోగించి పీడ వొదిలించుకుంటాను."

"వరలక్ష్మి ఇక్కడలేదు. కాకినాడలో వుంది."

పర్వాలేదు. రే పుదయం తిరుగు బండిలో కాకినాడే వెడతాను!"

"నిజమా?"

"నిజం."

"అయితే సరి. ఈ రాత్రికి కమ్మగా నిద్రపోండి."

చలం నిద్రపోలేదు. అంతమాత్రంచేత మేలుకుని జనార్దన రావ్‌ని ప్రశ్నల్తో వేధించనూ లేదు. చేయబోయే కార్యక్రమాన్ని వూహించుకుంటున్నాడు.

జనార్దనరావూ నిద్రపోలేదు. వరలక్ష్మి మీద మనసు పోయింది. కుంటి కుర్రాడిమీద జాలి చూపించిన వరలక్ష్మి, దిక్కులేని ఓ పక్షితో కబుర్లుచెప్పి ఆశలు నేర్పిన వరలక్ష్మి, ఎవరూ లేరనుకునే తనలాంటి దౌర్భాగ్యునికి అన్నీ నేనే నవిపించేటంత వరలక్ష్మి - ఇకముందుండదు. ఉండనీడు చలం.

• • • •

జ్ఞాపకానికి నిలిచేవి కొన్ని. దాన్లో రెండు రకాలు. బాధ కలిగించేవీ, సుఖాన్నిచ్చేవీను. మొదటి రకాన్ని సొంతం చేసుకున్న మనిషి నూటికి నూరుపాళ్ళు దురదృష్టవంతుడు. అనుక్షణం వాటిని మరిచిపోవాలనే తపన, ప్రయత్నమూ ఫలించక నలిగిపోడమనేది సిసలైన చిత్రవధ. అవునా?

జవాబు అవునని వొస్తే జనార్దనరావ్ గురించి అప్పుడే కొంత చెప్పడం జరిగిందన్నమాట. జనార్దనరావ్‌కి కోరికలెన్నో లెవు. వున్న కొన్నింటిలోనూ వరలక్ష్మిని పెళ్ళాడాలనేది మొదటిదీ, ముఖ్యమైనదీని.

తల్లిదండ్రులు లేరతనికి. వాళ్ళ మావయ్య అతన్ని పెంచేడు. లోకానికి తెలిసిందీ, తను గట్టిగా నమ్మేదీ దేన్నానూ ఒకటి కాలేక పోయినా—తన వెనుకనున్న కొద్ది ఆస్తినీ చేతుల్లో పెట్టుకున్న తర్వాత గానీ మావయ్య తన పెంపకపు బాధ్యత తీసుకోలేదనేది మాత్రం రెండు పక్షాలూ వొప్పుకున్నాయి.

మావయ్యకి పిల్లలు చాలామంది వున్నారు. వాళ్ళందర్లోనూ వరలక్ష్మిపైనే జనార్దనరావ్‌కి అభిమానం. ఎందుచేతనంటే - కారణం ఎదటివాడికి నచ్చినా నచ్చకున్నా తను గట్టిగా నిజమని భావిస్తున్న మాట 'వరలక్ష్మి ఆ యింట్లో తప్పబుట్టిం దనేది'. అమ్మ ఎలాటిదో తనకి తెలీదు. వరలక్ష్మికి అమ్మపోలిక లొచ్చాయని తెలీడంతో అత నుప్పొంగి పోయేవాడు.

అతను థర్డ్‌ఫారం చదువుకునే రోజుల్లో వరలక్ష్మి చాలా చిన్న పిల్ల. వోమాటు ఆ అమ్మాయికి పెద్ద జ్వరం వచ్చింది. ఎన్నో మందులు వాడేరు. తగ్గే సూచనలేవీ కనుపించలేదు. జనార్దనరావ్‌కి భయం వేసింది. తనతో నేస్తంగట్టే పిల్ల, మనసు విప్పకు హాయిగా మాట్లాడే అందాల భరిణ, రేపు దూరమైపోతే తన బ్రతుకేంగాను ? యింక. ఆ యింట్లో మాటాడేందుకు ఏ పక్షి సిద్ధపడుతుంది ?

చెరువుగట్టు గంగాణమ్మ గుడికివెళ్ళి ఆమెకు మొక్కుకున్నాడు. వరలక్ష్మి జ్వరం నయమైతే అయిదు రూపాయలు ముట్టచెప్పకుంటాను అవటాని. అదేం చిత్రమోగాని, రెండోరోజుకే వరలక్ష్మి జ్వరం తగ్గి పోయింది. మరి కొద్ది రోజుల్లో ఆ పిల్ల మంచందిగి ఆడుకోడం ప్రారంభించింది.

గంగాణమ్మకి అయిదు రూపాయలు బాకీ పడిన సంగతి గుర్తు

కొచ్చినప్పుడల్లా అతను వాణికిపోయేవాడు. తీర్చడానికి డబ్బులేవి ? అరిపగి పెట్టినా కాణీగూడా యిచ్చేవాడు కాదు మావయ్య.

ఓరోజు - అదృష్టవశాత్తు వాళ్ళ క్లాసువాళ్ళంతా పక్క వూరికి విహారయాత్రకి వెళ్ళాలని తీర్మానించుకోడం జరిగింది. తలో అయిదు రూపాయలు తెచ్చుకోమని మాస్టారు చెప్పేరు. మావయ్యని అడిగితే ముందు ఇవ్వనన్నాడేగానీ, ప్రయాణమనగా - ఏ పురుగు పనిచేసిందో గాని అయిదు రూపాయలూ యిచ్చేడు. చేతిలో డబ్బు కనిపించగనే అతని మనసు విహారయాత్రమీదకి పోయింది. తాత్కాలికంగా గంగాణమ్మ బాకీ విషయం మరిచిపోయేడు. కానీ -ఆవేళ ఉదయం రైలెక్కే ముందు తనొక్కడూ చీలిపోయి గుడిదగ్గరికి వొచ్చి ఆ దేవత బాకీ తీర్చేడు. చేతిలో దమ్మిడీ లేదు. ఇంటికి వెడితే చివాట్లు తప్పవు. అందుచేత ఆ రాత్రింతా అభోజనంగా ఆ గుడిలోనే ఉండిపోయేడు.

ఇది చిన్నతనంలో కేవలం వరలక్ష్మి కోసరం చేసిన ఒకానొక మహత్తరమైన త్యాగానికి ఉదాహరణ. మనిషిమీద పగబట్టినట్టు జీవితమనే దెయ్యం భయపెడితే చెదిరిపోయేంత భీరువుగాదు గానీ, తోటి మనుషులు ఎద్దేవా చేస్తే సహించేటంత మంచివాడు మాత్రం కాదు.

కుంటివాడు ఎందుకూ పనికిరాని చవటని ఏ శాస్త్రంలోనైనా రాసివుందా ? కుంటివాడే జనార్దనరావ్ ! అందరి పిల్లల్లా చెట్లెక్కి ఆడుకునే అదృష్టాన్ని నోచుకోలేదతను. అయితే అంతమాత్రంచేత వీళ్ళందరూ కలిసి తనని గేలి చేసేయడమేనా ? వాళ్ళకి రెండు కాళ్ళూ విక్షేపంగా ఉన్నాయి. గనక ఆడుతున్నారు. తనొక్కడికీ ఒకే కాలు చొప్పునుంటే తెలిసొచ్చేది. వాళ్ళు చెడుగుడు ఆడేవాళ్ళు. పరుగుపందేలు వేసుకునేవారు. కేరింతాలు కొట్టేవాళ్ళు. ఎవ్వళ్ళూ తనని లెక్కచేసేవారేగాదు.

అలాంటి సమయంలో వరలక్ష్మి గనక తన జత లేకపోతే ఏం

గాను ? చిన్నప్పుడే ఆత్మహత్య చేసుకునుండేవాడు. బైట కుర్రాళ్ళు తనంటే గిట్టక యూ గీ చేసేవారు. మావయ్య సంతానానికేమొచ్చె తెగులు ? వాళ్ళు నోరు పారేసుకోడమేగా ?

నిజమే - తనకి వాళ్ళందరితో ఆడుకోవాలని. వాళ్ళలా గెంతు లేయాలని మనసులో పీకుతూనే వుంటుంది. ఒకవక్క కెలుకుతూన్న ఈ బాధ కితోడు వాళ్ళ ఈసడింపులు గూడానా ?

తల్లీ దండ్రి లేకపోడమే ఒక పెద్ద లోపం. అది చాలదన్నట్టు ఈ అంగవైకల్యం మొకటి. నరనర్లో నీరసం, నెత్తుర్లో నిస్సత్తువ నింపేసింది.

వరలక్ష్మి అనబడే వరాలమందే గనక తనకి దొరక్కపోతే?—

అందుకే అతనికి వరలక్ష్మిమీద అంత అభిమానం. అందుకే ఎమ్మే పరీక్షల్ని గూడా లెక్కచేయకుండా రెక్కలుకట్టుకు యింత దూరంవొచ్చి "నువ్వు నాకు కావాలి వరం ! నన్నొదిలి వెళ్ళకు !" అని ప్రాధేయపడ్డాడు.

వరలక్ష్మి నిర్లక్ష్యం చేసింది. అంత నిర్లక్ష్యాన్ని యిన్నేళ్ళు దాచుకున్నదో లేక పెంచుకున్నదో తెలీదుగాని. రాక్షసిలా వికృతంగా, దెయ్యంలా కటువుగా అన్నది. 'నువ్వు కుంటివాడివి బావా! అదే నాకు నచ్చనిది' అని.

ఇది తలుచుకుంటూన్న కుంటి జనార్దనరావ్ కళ్ళల్లో నీళ్లు తిరిగేయి.

పరీక్షలముందు మావయ్య ఉత్తరం రాసేడు. 'వరలక్ష్మిని వో లక్షాధికారి పెళ్ళాడబోతూన్నాట్ట. లక్షాధికారి'. 'మావయ్యా! నువ్వు మొదట్నుంచీ నా బతుక్కి తింటున్నావు సుమా !' అనుకున్నాడు. ఉత్తరం చదివి. ఆడపిల్లని, అందునా కన్నకూతుర్ని తనవేపు తిప్పుకోడం, తన

మాటకి ొంగదీసుకోడం మావయ్యలాటి మహాపుభావులకి చాతకాని దేమీ కాదని భావించాడేగానీ - "అతి సున్నితంగా గొంతులుకోసే నేర్పరురాలు వరలక్ష్మి" అని యిక్కడికొచ్చిన తర్వాతనే తెలిసింది.

జనార్దనరావ్ గంగాణమ్మవేపు చూసేడు. ఆ దేవత నవ్వు తున్నట్టే కనిపిస్తోంది. మావయ్య వాళ్ళింటో పెళ్ళి భజంత్రీలు మిన్నంటేట్టు మోగుతున్నాయి. అతని గుండెల్లో నిప్పు రాజుకుంటున్నట్టూ, అతని మిగిలిన కాలుకూడా విరిగిపోతున్నట్టూ సర్వ ప్రపంచం తనకి కీడు తలపెడుతున్నట్టూ భావన కలిగింది. చేతుల్లో మొహాన్ని దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తూండగా చలం వచ్చేడు.

ఆవేశం ఎక్కువ. ఆలోచన తక్కువ బాపతు మనిషి చలం. పూర్తి పేరు శోభనాచలం. అతను అందగాడు. అందగాడననే అహంభావం మూర్తీభవించిన మనిషి. తను కన్నెత్తి చూడడుగానీ, చూస్తే అందమైన ఆడపిల్ల సలాము చేస్తుందని అతని నమ్మిక. ఆ నమ్మకమే అతన్ని పాడుచేసింది.

వరలక్ష్మి అతని క్లాసుమేటు. అంతమందిలోనూ వరలక్ష్మినే ఎన్నుకొని ప్రాణం పెట్టడమే నేరమైంది. ఆ ఎన్నికలోనే ఘోరమైన పొరపాటు జరిగిపోయింది. ఇంత అనురాగమూ, వృధా అయిపోయిందని అనుకోగానే కోపం, దుఃఖం, కసి అన్నీ ఒక్కుమ్మడిగా విజృంభించేయి.

తనకెన్నో కబుర్లు చెప్పింది.శపథం చేసింది.నువ్వే నా సర్వస్వమన్నది. చాలా అన్నది. ఒక్కటీ నిలబెట్టుకోలేని కేవలం అబల వరలక్ష్మి। తండ్రిమాట కెదురాడలేక తలవంచింది. 'క్షమించు చలం. నన్ను మరిచిపో!' అనేసింది. అతను లక్షాధికారి అనేగా వరలక్ష్మి మనసు నమ్ముకున్నది. లక్షలకోసం కలలుకనే ఆడపిల్లకి అతను ఆటవస్తువై పోయాడు ఇంతకంటే నామోషీ ఇంకేదైనా వుందా?

పెళ్ళి చేసుకుని వరలక్ష్మి ఏం సుఖపడుతుందిలే!

ఆ అమ్మాయి చాలా మారిపోయింది. గుర్తుచేయాలి. ఆమె భర్త ముందే ఆమె చేసిన గారడీని గుర్తుచేసి ఆ సంసారంలో నిప్పులు పోయాలి. 'నువ్వు మోసగింపు బడ్డావు నాయనా!' అని ఆ మొగుడికిని హెచ్చరించాలి. రెచ్చగొట్టబడిన మనిషి మనసులో చెలరేగుతున్న అశాంతిని చూడగల చాతుర్యం వరలక్ష్మికి వుండి వుంటే ఈ పెళ్ళికి వప్పుకునేదే కాదు. ఎంత తండ్రియ్యేదీ, తాతయ్యేదీ మనసు నమ్ముకుని బ్రతకడం తమాషానా?

మనసులోవున్న అందమైన ఊహాగానాలకీ, బంగారు కలలకీ దూరమైపోతూన్న ఈ వరలక్ష్మి నేం చేయాలి? ఇదే ప్రశ్న. ఈఒక్క-ప్రశ్నే అతన్ని కలవరపెడుతున్నదీ? నరనరాన్నీ కత్తితో కోసి పారేస్తున్నదీను.

ఆహ్వానం లేకపోయినా పనిగట్టుకు యిక్కడికి కొచ్చేడతను. వరలక్ష్మి వధువుగా ఊహించలేని మరో వరుడి పక్కన కూర్చునుండటం అతను సహించలేకపోయాడు. తన రెండు కళ్ళనీ శూలంతో పొడుచుకుని, ఆనక యింత విషం తిని చావాలనిపించింది. పెళ్ళి పందిట్లోంచి వేగంగా నడిచి కాలువ ఒడ్డు చేరుకున్నాడు. అక్కడ కాసేపు గడిపి గంగాణమ్మ గుడికి వచ్చేడు. అక్కడ అతనికి కనిపించింది జనార్దనరావ్!

దూరంగా వినిపించే సన్నాయి రొదలో, ఆ నిశీధిలో ఊరికి చివర్న వున్న ఆ గుడి దగ్గర యిద్దరు మనుషులు కలుసుకున్నారు. మండిపోయే హృదయాలు రెండు. అవమానంతో కుంచించుకపోయే శరీరాలు రెండు. కసితో బుసలు కొట్టే పాముల్లాటి జీవులు రెండు.

అదే వాళ్ళ పరిచయానికి శ్రీకారం!

* * *

కాకినాడలో అందమైన ఒకానొక హోటల్లో పదమూడో గదిలో వున్న చలానికి ఓ క్షణంగూడా తోచలేదు. మనసునిండా ఆందోళన. ఏదో చేసేయాలనే తపన. గదిలో కాలుకాలిన పిల్లిలా పదినిమిషాలు తిరిగేశాడు. ఆగి, కాసేపు కూర్చున్నాడు. మళ్ళాలేచి తిరగడం మొదలు పెట్టాడు.

గది తలుపు గడియపెట్టి సూటుకేసులోంచి ద్రాక్షరసం సీసా తీసుకున్నాడు. మూడు గ్లాసులు టీపాయ్ మీదుంచేడు. తను వో కుర్చీ మీద కూర్చున్నాడు. తన ముందున్న గ్లాసుల్ని ముగ్గురికీ పంచినట్టు పంచాడు.

"మీ పెళ్ళినాడు వచ్చాను. అర్జంటు పనివల్ల మాటాడేందుకు వీలుచిక్కక వెంటనే తిరిగి వెళ్ళిపోయేను. ఈ ఊర్లో మిమ్మల్ని చూచి నే నెంత ఆనందిస్తున్నానో చెప్పలేను." లోన అనుకుంటూ గ్లాసులో ద్రాక్షరసం పోసేడు.

"తాగండి. నా సంతోషానికి చిహ్నంగా ఈ పానీయాన్ని సమర్పించుకుంటున్నాను." అని ఇంగ్లీషులోనూ అనుకున్నాడు.

తర్వాత తనొక్కడూ ఆ మూడు గ్లాసులూ పూర్తిచేశాడు.

"ఇప్పుడు మనం తాగినవాంట్లో జనార్దనరావిచ్చిన విషం కలవలేదు గనక మన ముగ్గురం చావలేదు.ముగ్గురం కలిసి కట్టుగ చచ్చేరోజు అతి త్వరలో వస్తుందని ఆశిస్తున్నాను. మిష్టర్ అండ్ మిసెస్ సుధాకరం."

చలం సిగరెట్టు ముట్టించాడు. పక్కమీద పడుకున్నాడు. అయినా విశ్రాంతి తీసుకోవాలనే ఉద్దేశానికి తావివ్వలేదతను. ప్రయాణం తాలూకు బడలిక తీరనూలేదు. ఇంకా మగతగానూ వుంది.

సరిగ్గా మూడు గంటలకి ఆ హోటల్నుంచి బైటకొచ్చాడు. జనా

ర్ధనరావ్ ఇచ్చిన అడ్రస్సు పుచ్చుకుని కాకినాడ వీధులవెంట నడవడం ప్రారంభించాడు.

మరో గంటకి అతను వాళ్ళిల్లు కనుక్కున్నాడు. వాళ్ళిల్లు చాలా బావుంది. ఇల్లు అనే దానికంటె చక్కని భవనమని చెప్పడం మంచిది. ఆవరణలో కాలు పెడుతూండగా పూల మొక్కల్నుంచి వచ్చే గాలి మనసుకి పరవశం కలిగించింది. అక్కడే, ఆ మొక్కల దగ్గరే పచ్చ గడ్డిమీద కాసేపు కూర్చుంటే ఎంత బాగుంటుంది అనుకున్నాడు. ఇంత శ్రద్ధ తీసుకుని ఆ మొక్కల్ని నాటింపించింది వరలక్ష్మి అయి వుంటుంది.

అతను కాలింగ్ బెల్లుమీద చేయుంచేడు. మరో క్షణంలో తొమ్మిదేళ్ళ కుర్రాడు ముక్కు తుడుచుకుంటూ తలుపు తీశాడు.

"ఎవరు కావాలి ?"

"............"

"మా నాన్నగారు కేంప్ వెళ్ళేరు. లేరు."

"సుధాకరం__"

"రండి. లోపలికి రండి. అమ్మా ! బాబాయి కోసం ఎవరో వచ్చారే !" అంటూ వాడు అక్కడే వున్న మరో గదిలోకి వెళ్లేడు.

ఆవిడ వచ్చింది. ఆవిడకి ముప్పైయేళ్ళ పైబడి వయస్సుంటుంది. ఆకర్షించగల సౌమ్యత ఆవిడలో కొట్టొచ్చినట్టు కనుపిస్తోంది.

"అతనూ వాళ్ళావిడా ఒక గంటక్రితం ఊళ్ళోకి వెళ్ళేరు. వచ్చే వేళయింది. కాసేపు కూర్చోండి."

"............"

"ఒరే, చిన్నీ ! బాబాయి గదిలో పుస్తకాలున్నాయిగానీ వారి కివ్వు. చదువుకుంటారు" అని మళ్ళా గదిలోకి వెళ్ళిపోయింది.

చిన్ని అనబడే తొమ్మిదేళ్ళ కుర్రాడు చాలా పుస్తకాలు తెచ్చేడు. తెచ్చి సోఫాలో పెట్టి అన్నాడు :

"మా బాబాయి చాలా బాగా పాడతాడండీ.మీరివి చదువుతూండండీ. నేను రికార్డు వేస్తాను."

వాడు అక్కడ దగ్గర్లోవున్న టేప్ రికార్డర్ని ఆన్‌చేసేడు. సుధాకరం కాబోలు చాలా హాయిగా పాడుతున్నాడు. అతని గొంతులో ఇంత అమృతముందని తెలీడం యిదే మొదటిసారి.

పాటైన తర్వాత కాసేపటికి ఏదో సంభాషణ వినిపించింది—

'ఇదిగో అమ్మాయ్ ? నువ్వు పాడకపోతే నేనూరుకునేది లేదు. కదరా చిన్నీ !' అన్నాడు సుధాకరం.

'అవును. అంతే పాడాలి' అన్నాడు చిన్ని.

"ఊహుం. నేపాడను. పాడనన్న తర్వాత పాడను. అంతే" అన్నది వరలక్ష్మి.

చిన్ని వాళ్ళమ్మ అక్కడికి గబగబా వచ్చి, టేప్ రికార్డర్‌ని ఆఫ్ చేసి చిన్నితో అన్నది :

"తప్పుకదూ !"

"అది కాదమ్మా !"

"చాల్లే ఊరుకో. వీడు వట్టి చిలిపి వాడండి. వాడికితోచదు.చెబితే వినడు. వాళ్ళ నాన్నగారూ, బాబాయీ బాగా గారాం నేర్పేరు."

"............"

"ఒక్కక్షణం....ఇప్పుదే కాఫీ తీసుకొస్తాను."

"మీకు చాలా శ్రమనిస్తున్నాను."

ఆవిడ నవ్వేసి వెళ్ళిపోయింది.

చిన్ని చలం పక్కకొచ్చి కూర్చున్నాడు. వాడి మధ్య చూచిన

సినిమా గురించి చెప్పడం మొదలెట్టాడు. చిన్ని ముద్దుగా వుంటాడు,వాడి మాటలూ తనివితీరా వినాలనిపిస్తాయి.

చిన్ని వాళ్ళమ్మ కాఫీ తీసుకొచ్చి యివ్వడం, వైట కారాగిన శబ్దమూ ఒకేసారి జరిగేయి. చిన్ని సోఫానుంచి దిగి :

"బాబాయ్ వాళ్ళు వచ్చారండోయ్" అంటూ లేడిపిల్లలా పరుగెత్తుకు పోయేడు.

వాళ్ళు హాల్లో కాలుపెట్టేసరికి చలం తాపీగా కాఫీ తాగుతున్నాడు. వరలక్ష్మి అతన్ని చూడగానే అదిరింది.

"అరె.... ఎప్పుడొచ్చేరు ?"

చలం నవ్వులాటిద్ది మొహాన్ని నింపేసుకున్నాడు.

"మీకు చెప్పానే చలమని."

"యస్. గుర్తుంది. హేపీ టూ సీయూ" అన్నాడు సుధాకరం.

చలం తల పంకించేడు.

"మీగురించి చాలా చెప్పింది. నేనొక్కటిగూడా మరిచిపోలేము సుమండీ ! ఎప్పుడొచ్చేరు."

"ఉదయం."

"చాలా థాంక్సండి" అన్నది వరలక్ష్మి.

"సరిసరి నీ థాంక్సకే మొచ్చెగానీ, ముందు వారి స్నానానికి...."

"అన్నీ హోటల్లో ముగించే వచ్చాను"

"మీరు హోటల్లో దిగేరా ? అయితే వరలక్ష్మి అబద్ధం చెప్పి వుండాలి. మీరు మంచి స్నేహితులనీ...."

"ఆయన అనడానికీ, నువ్వు చెప్పడానికీ సరిపోయింది సుధా ! ఇప్పుడు మాత్రం మించిపోయిందేముంది ? ఇక మళ్ళా ఆ హోటల్ మొహం చూడరు. అంతే" అన్నారు వదినగారు.

చలం మీనమేషాలు లెక్కపెడుతున్నాడు. మధ్య మధ్య సుధాకరం అడిగే ప్రశ్నలకి అవునూ, కాదూ అని సమాధానాలు చెబుతున్నాడు. ఎప్పుడు ప్రారంభమైందో గాని సుధాకరం కథని మధ్య నుంచి వినగలిగేడు చలం.

"యమ్మెస్సీ పాసయ్యాను. అన్నయ్య మాట ప్రకారం వ్యాపారం మొదలేట్టేను. నన్ను పెంచింది అన్నయ్య. అదృష్టవంతుడ్నని వదిన ఎప్పుడూ నన్ను పొగుడుతుంది. కేవలం పొగడ్తలే అనుకున్నాను గానీ వరలక్ష్మితో పెళ్ళయిన తర్వాత నిజమని వప్పుకోక తప్పిందికాదు. ఏమంటావే వరాలూ...."

వరలక్ష్మి సిగ్గుపడిపోయి తలొంచుకుంది. వరలక్ష్మిని ఇంకేం అడిగేవాడో తెలీదుగానీ ఫోన్ మోగడంతో అంతరాయం కలిగింది. ఫోన్ తీసుకున్నాడు సుధాకరం. అతను ఫోన్‌లో చెప్పిన మాటలివి :

"సారీ బ్రదర్. మాట తప్పాల్సొచ్చింది. ఈవేళ వో ఫ్రెండ్ వచ్చారు. గనక మన ప్రోగ్రాంకి తిలోదకాలు. క్షమించు."

చలం నీళ్ళు నమిలాడు. సుధాకరం వచ్చి కూర్చుని అన్నాడు:

"అచ్చా సార్! ఈవేళ ఫస్టుషోకి వెడదాం. అంతవరకూ.... బైదిబై మీకు పేకాట ఆడటం వచ్చుటగా. వరలక్ష్మి చెప్పిందిలేండి. కమాన్. ఒక వరస వేద్దాం. ఏమంటావ్ వరాలూ!"

వరలక్ష్మి పేక తీసుకు రావడానికి లోపలికెళ్ళింది.

* * *

జరిగిందంతా గుర్తు చేసుకుంటూంటే చలానికి ఏడుపు ముంచుకొస్తోంది. అతన్లో ఓ మూల దాగిన రాక్షసత్వానికి సిగ్గుపడిపోతున్నాడు. ప్రాయశ్చిత్తం కావాలి.

హత్య చేయడం అంత సులభమైన పనికాదు. ఉద్రేకం మనిషిని

హంతకుడ్నిగా చేయవచ్చుగానీ....కొంచెం ఆలోచించడానికి వ్యవధి దొరుకుతే మనిషి మంచివాడుగానే మిగిలిపోతాడు.

ఆ హోటల్ గదిలో అతనొక్కడే వున్నాడు. తలుపు గడియ వేశాడు. టీపాయ్‌మీద మూడుగ్లాసులు పెట్టబడి వున్నాయి. మూడి ట్లోనూ ద్రాక్షరసం పోసేడు. సూటుకేసులోంచి చిన్న పొట్లాం తీసేడు. దాన్లోని పొడినంతా ఒకేగ్లాసులో వంచుకున్నాడు. ఆ గ్లాసుని తాను తీసుకున్నాడు.

"అన్నివిధాలా వోడిపోయిన వెధవని. కసిగట్టి మిమ్మల్ని చంపుదామని వచ్చేను. అవునా? కానీ....వద్దు. మీరు ఆనందంగా బ్రతకండి. ఇంత ఘాతుకం తలపెట్టిన నన్ను చావనివ్వండి. ఆల్‌రైట్ మీరు ఆ గ్లాసుల్లోది తాగండి నేనిది తాగుతాను. నాకిదే కావాలి. బై."

అతను కళ్ళు మూసుకున్నాడు కానీ కన్నీటిని అదుపులో పెట్టుకోలేక పోయేడు. గ్లాసులోని ద్రాక్షరసం నోట్లో చేరింది. అలాగే ఒరిగి పోయేడు.

తెల్లవారుతూండగా జనార్దనరావ్ అదే హోటల్‌గది తలుపు తట్టేడు. నిక్షేపంలాటి తన ఒంటికాలితో నేలమీద వింత దరువు వేస్తూ మరొకమాటు తట్టేడు. తలుపు తెరుచుకుంది. తలుపు తీసిన చలం ఆశ్చర్యంతో స్థాణువులా నించుండి పోయేడు.

"మనం బ్రతుకుదాం. వాళ్ళనీ బ్రతకనిద్దాం. సరేనా?" అన్నాడు జనార్దనరావ్.

చలానికి ఏం చెప్పాలో వెంటనే తోచింది కాదు.

0---0

# జగన్నాధం ప్రేమించాడు

జగన్నాధాన్ని తలుచుకుంటుంటే ఆశ్చర్యంగా వుంది. ఓ సామాన్యమైన పల్లెటూళ్ళో పుట్టి, ఒకళ్ళ పంచనవాళ్ళ దయా దాక్షిణ్యాలమీద బ్రతికిన జగన్నాధంలో యింతటి తెగువ, యింతటి ప్రత్యేకత వున్నాయని చూసిన వాడిని కాబట్టి నమ్మక తప్పడం లేదు.

జగన్నాధం గురించి ఒక కథంటూ రాయవలసి వొస్తుందనీ, ఆ రోజున వాడి వ్యక్తిత్వాన్ని హర్షించవలసి వొస్తుందనీ, నే నింతకు మునుపు కలనైనా అనుకోలేదు.

జగన్నాధం మా నాన్నగారి దగ్గర పెరిగి పెద్దవాడయ్యాడు. అతను మావయ్యగారబ్బాయి. వాడి దురదృష్టంకొద్దీ వాడు భూమ్మీదపడ్డ సంవత్సరంలోనే తల్లీ దండ్రీ దూరమయ్యారు. మావయ్యకి వ్యసనాలు చాలా వుండేవనీ, ఆ వ్యసనాలతోటే ఆయన పతనమై పోయారనీ, పెరిగి ప్రయోజకు డవాల్సిన కొడుక్కి ఆస్తి రూపేణా కాణీగూడా మిగిల్చి పోలేదనీ మా ఊళ్ళో అనుకునేవారు. మావయ్యపట్ల నాన్నకున్న అభిమాన మనండీ, జగన్నాధంలాటి అభాగ్యుడ్ని చేరదీసి పదిమందిలోనూ

1963, జూలై - జ్యోతి

'భేష్' అనిపించుకోవాలనే తాపత్రయం అనండీ, లేదూ కేవలం ఆ పసికూనమీద వల్లమాలిన అనురాగమనండీ మీ యిష్టం - నాన్న వాడిని చేరదీసి మాతోపాటు పెంచేరు.

చదువుపట్ల వాడికి విపరీతమైన బద్ధకం వుండేది. దానికితోడు ప్రతి దానిమీదా అలక్ష్యభావం ఒకటి. వాడి నరనరాల్లోనూ పనిచేయడం మూలంగా "భ్రష్టుడు" అనే పదాన్ని వాడినెత్తిన రుద్దడం జరిగింది.

చాటుగా నాన్నని చాలామంది అనేవారు. "కొడుకుల సుఖాలు కావలసిన ఆ పెద్దమనిషికి వాడెవడసలూ ? ఏనాడు, ఏ ముహూర్తంలో పుట్టాడోగాని జగన్నాథం దౌర్భాగ్యుడే సుమండి" అని.

నాన్నవరకూ యీ 'సరస సంభాషణ' వొచ్చినా ఆయన పట్టించుకునేవారు కాదు. ఆయనకి మరొకళ్ళు చెప్పే పద్ధతీ అంటే తగని మంట. అలాటి అవసరం రానే కూడదంటా డాయన. ఆయనకై ఆయన నమ్మేది శాస్త్రం. ఆయన చేసేది న్యాయం. తను నిర్మించుకున్న పరిధిని దాటి బయటపడి "అయ్యా తమరి ఉద్దేశ్యమేమిటో సెలవిచ్చారు గాదూ" అని అడిగే తత్త్వం బొత్తిగా నయించ దాయనకి.

కాబట్టి జగన్నాథం గురించీ, మా నాన్నగారి గురించీ టూకీగా వివరించానన్న మాటేగా.

అనన్య సామాన్యులైన మా నాన్నదగ్గర పెరిగిన అతిసామాన్యుడైన మా జగన్నాథం యింత ఘనకార్యం చేశాడంటే ఒక పట్టాన నమ్మలేకపోయాను. కళ్ళు తిరిగేలా ఆశ్చర్య పోయేను.

అప్పట్లో బందరు కాలేజీలో బి. కాం. ఫైనలియరు చదువుకుంటున్నాను. బందర్లోనే ఒక చివరిని చిలకలపూడి అని చెప్పి ఒక పేట వుంది. ఆ పేటని గాఖైత్తు పండరీపురమని యిప్పటికీ పిలుస్తూంటారు జనం. అక్కడ పాండురంగ విఠల్ ఉత్సవాలు బ్రహ్మాండంగా,

కన్నుల పండువగా ప్రతి సంవత్సరమూ జరుపుతుంటారు. ఉత్త రోజుల్లో బందరంటే గిట్టని చాలామంది ఆ ఉత్సవాల్లో మాత్రం బందరు పురాన్ని పావనం చేసేందుకు ఎక్కడెక్కడ్నుంచో వొస్తుంటారు.

ఒకనాటి సాయంత్రం నా రూమ్ దగ్గర రిక్షా ఆగింది. దాంట్లోంచి జగన్నాథం ఒక్కడే దిగుతే నా తల దిమ్మెత్తేదిగాదు - వాడితోపాటు ఒక చక్కటి ఆడకూతురూ దిగడంతో విశేషమనిపించి ఉలిక్కిపడక తప్పిందికాదు. ఒకమాటు కళ్ళు నులుముకుని మళ్ళా చూసేను. నిజమే-వాడితోపాటు దిగినది ఆడపిల్లే.

జగన్నాథం గబగబా లోపలి కొచ్చేడు. ఆ అమ్మాయి మాత్రం అరుగు పక్కనే నిలుచుండిపోయింది.

"తిరనాళ్ళకి వొచ్చాం" అన్నాడు వాడు.

"కనపడుతూనే వుంది" అన్నాను నేను.

"మళ్ళా రేప్పొద్దున వెళ్ళిపోతాం"

"అలాగా"

"ఈ రాత్రికి సినిమా చూచుకుని. యిక్కడే నిద్రపోయి తెల్లారి వెళ్ళిపోతాం"

"వొచ్చాం" "పోతాం" అనే పదాలు వాడు అయినకాడికి ఉపయోగించడంతో గుటకలు మింగటం నావంతు అయింది. నాకు తెలిసినంతవరకూ జగన్నాథ మనబడే మా మావయ్య కొడుకు ఒక్కనాడు గూడా "పరాయి మనిషి"తో మాట్లాడినట్టు జ్ఞాపకంలేదు. అలాటిది వయస్సులోవున్న ఒక ఆడపిల్లని వెంటబెట్టుకు తిరణాల కొచ్చేమనీ, సినిమా చూస్తామనీ, రాత్రికి యిక్కడే వుంటామనీ, తెల్లారిగట్ల వెళ్ళిపోతామనీ చెప్పేస్తూంటే వినేవాడికి నాకెలా వుంటుంది ? ఆ పిల్లవైపు చూస్తూ వాడే అన్నాడు.

"రా సీతా ! అక్కడే నిలబడిపోయావే ? మావాడేలే. దొడ్లో నీళ్ళుంటాయిగాని మొహం కడుక్కో."

సీత మహలావు సిగ్గుపడిపోయింది. ఆడపిల్లకి సిగ్గే అందమన్నారని చెప్పడం కాదుగాని, ఆపిల్ల అలా సిగ్గుపడిపోతూంటే అందంలో ఆమెకు సాటి యెవరూ అని ఛాలెంజి చేసినట్టుంది.

ఇంతకీ ఆ పిల్లెవరో, జగన్నాధానికీ, ఆ పిల్లకీ సంబంధమేమిటో తెలీకుండానే వుంది. జగన్నాధాన్ని నాకై నేను అడిగి తెలుసుకోవాలనే ఉద్దేశ్యం లేనేలేదు.

సీత దొడ్లోకి వెళ్ళింది. జగన్నాధానికి సబ్బూ, టవలూ యిచ్చి పంపాను. వీధి అరుగుమీద కూర్చుని సిగరెట్టు ముట్టించేను.

"సీత చాలా మంచి పిల్లరా చిన్నా !" అన్నాడు జగన్నాధం, దొడ్లోనుంచి వొచ్చి నా వెనక నిలబడి.

వాడివైపు చూశాను.

"పాపం, తిరునాళ్ళు చూడాలని ముచ్చట పడితేనూ,నాకూ చూడాలని వుందనుకో; ఎలాగో నువ్విక్కడే వుంటున్నావ్ గనుక, యిబ్బంది పడక్కర్లేదు రమ్మని తీసుకొచ్చాను."

ఈ మాత్రం నేనూ ఊహించలేననుకున్నాడో ఏమో, ఇంతకీ యీసోది చెపుతాడేగాని సీత యెవరు? ఆపిల్లకీ వీడికీ వున్న సంబంధం యేమిటీ వగైరాలు చెప్పనే చెప్పడు.

"మా నాన్నకి చెప్పే వొచ్చేవా ?"

"చెప్పాను."

"ఏమిటీ, మీరిద్దరూ కలిసి యిలా వొస్తున్నట్టు ?" రెట్టించి అడిగేను.

"అదెందుకు చెప్పాలి ? ముసలయ్యంటే మీ నాన్నకి బొత్తిగా

పడదు. ముసలయ్య కూతుర్తో వెళ్తానని చెపుతే నన్ను పంపుతారనే అను కున్నావా ?" అని దొడ్లోకి వెళ్ళిపోయాడు జగన్నాధం.

రైటో. డొంక కదిలింది. ఇప్పటిగ్గాని సీత యెవరో అర్థమైంది కాదు. ముసలయ్య మా పక్క ఊర్లో వుంటూన్న ఒకానొక బాగా చితికి పోయిన రైతు. అశాస్త్రీ నాన్నగారికి బాకీపడి రెండుమూడుమాట్లు చివాట్లు పెట్టించుకున్న వైనమూ, చివరికి ఆ బాకీ బాకీగానే నిలిచిపోయిన విష యమూ నేనింకా మరిచిపోలేదు.

ముసలయ్యకి యింత చక్కని కూతురున్నదని నాకు తెలీనే తెలీదు. పల్లెటూళ్ళో పుట్టినా సంవత్సర కాలంలో చాలా నెలలు బందరు లాంటి బస్తీల్లో గడిపే నా లాంటి వాడికి మా ఊళ్ళో ఎవరు ఎవరో తెలీదని చెప్తే మీ రెందుకు నమ్మరు ? అలాటిది మా ప్రక్క ఊళ్ళో జనాభా వివరాలు నా కేం తెలుసు ? ముసలయ్యంటే నాన్నకి బాకీ పడ్డ ఆసామి కాబట్టీ, సాక్షాత్తూ నా ఎదుటనే ఆయన్ని నాన్నగారు చివాట్లు పెట్టడం జరిగింది గాబట్టీ - ఆ వ్యక్తి అయినా తెలుసు. ఆ ముసలయ్య కో కూతురుందనీ ఆ కూతురు చాలా చక్కటి పిల్లనీ, పిల్లపేరు సీత మ్మనీ - యివన్నీ నా కెలా తెలుస్తాయి ? కాబట్టి - ఈ తెలీకపోడంలో మన్నించరాని నేరం లేదనేగా మరి.

నేను ముసలయ్య గురించి లోగడే కొంత వినివున్నాను. అతను దగుల్బాజీ - ఇది మా నాన్న అనగా విన్నది. అతను తాగుబోతు - మా వూరి జనం అనేవారు. అత నెందుకూ పనికిరాని చవట - నాన్నకి ఆప్తులైన యిద్దరు ముగ్గురు (చవటలంటే గిట్టని) స్నేహితులు మనవి చేసు కునేవారు.

నేను విన్న ముసలయ్య అలాంటివాడు, ఆ ముసలయ్య కూతురు సీత సీత అందమైనపిల్ల. అందమైన జగన్నాధంతో తిరనాళ్ళకి

వచ్చింది. ఆ పిల్ల జగన్నాథంతో వొచ్చిందని నాన్నకి తెలీదు. తెలుస్తే జగన్నాథాన్ని చంపకపోను. ఏతా వాతా సీత కథ ఏమిటయ్యా-అంటే మీ రప్పుడే అర్థం చేసుకున్నారు-కథని.

అయినా మనకో మోడెస్టీ అంటూ ఒహటి వుంటుంది చూడండి. అది అడ్డుపడి "వారే జగన్నాథం నువ్వా పిల్లని కొంపతీసి లవ్ చేసే వేమిటా?" అని అడగనివ్వదు. చప్పుకుంటాడుగా.

ఇక కథ;

సీత లోపలికివచ్చి ఒక చేత్తో అద్దం పట్టుకుని మరోచేత్తో టవల్ పుచ్చుకుని అద్దంలో చూస్తూ మొహం తుడుచుకుంటోంది. మధ్య మధ్య దొడ్లోఉన్న జగన్నాథాన్ని తొంగి తొంగి చూస్తూను.

చెప్పద్దూ నాకు జాలి కలిగిన మాట నిజం. పాపం వాళ్ళు అమాయక ప్రేమికులే! వాళ్ళ మధ్య అడ్డుగోడలూ. నిబంధనలూనా? ప్చ్.... పూర్ ఫెలోస్. వాళ్ళ కథేమైపోనూ? రేప్పొద్దున్న మా నాన్న గారికి ఈ ఉదంతం తెలిస్తే జగన్నాథం డొక్క చీల్చేస్తారు గదా? ఈ విషయం వాడికి మాత్రం తెలీదా? మరి తెలిసిగూడా ఈ ఎమరీత ఏమిటో? ఒక్కటా. లక్షాతొంభై ప్రశ్నలూ, ఆ పైన వాళ్ళమీద కొండంత సానుభూతీను.

జగన్నాథం ఒకానొక ప్రేమికుడు. అతని ప్రేమ పవిత్రమైనదీ, స్వచ్ఛమైనదీను. అతని హృదయంలో సీత తప్ప మరే వస్తువుకీ స్థానం లేదు. అతను ఎవరినీ లక్ష్యపెట్టడు. కాబట్టి వో కథ రాసే యువకుడా! వాళ్ళ ప్రేమ జయించును. అని యీ వరసతో ఆకాశ వాణి నాకు ధైర్యం చెప్తే బావుండునని పించింది.

ప్రేమికులిద్దరూ ముఖ ప్రక్షాళణం ముగించేరు. అప్పటిగ్గాని

గుర్తుకు రాలేదు అతిథి దేవుళ్ళని సత్కరించడమనే మాట మరచిపోయే నని. గోడకున్న ఫ్లాస్కు తీసి దాన్లో మిగిలివున్న కాస్త కాఫీనీ యిద్దరికీ పంచియిచ్చేను.

జగన్నాథమైతే చప్పున పుచ్చుకున్నాడుగానీ. సీత మాత్రం కాస్త తటపటాయించింది.

"తాగు.... అయినా ఏమిటా సిగ్గు. ఇది మనిల్లే అనుకో" అన్నాడు జగన్నాథం.

"అంతే, అంతే" అన్నాను ఏమనాలో తెలీక.

ఎలాగైతేనేం ఆ పిల్లగూడా కాఫీ పుచ్చుకుంది. నా మనసు తృప్తి చెందింది.

"అయితే మేం సినిమా కెళ్ళొస్తాంరా!"

"తొందరగా రండి. మీకోసం ఎదురు చూస్తూంటా"

"పద సీతా! టైమవుతోంది" అనేసి సీతను తీసుకుని వెళ్ళిపోయాడు జగన్నాథం.

ఒక గాలీవాన వొచ్చింది. ఎడాపెడా దబదబా బాది వదిలిపెట్టి వెళ్ళింది. బెదిరిపోయి ఈ సంఘటన ఏ వింత పరిణామాలకు దారి తీస్తుందోనని భయపడి పోడం ఒకానొక చదువుకునే కాలేజి కుర్రాడి వంతయ్యింది.

ఆ కాలేజీ కుర్రాడికి ఈ ప్రేమ కథలు తెలీకకాదు భయపడింది. అతనికి చాలా కథలు తెలుసు. గుళ్ళో పెళ్ళిళ్ళు చూశాడు. మదరాసో. మరొకవూరో ఉడాయించడాలూ విన్నాడు 'నాన్నా. నీ ఆస్తిలో కాణీగూడా వొద్దు. ప్రేమలేని బ్రతుకు ఒక బ్రతుకేనా? ఈ విశాల ప్రపంచకంలో మాకు బ్రతకటానికి చోటులేక పోలేదు. ఆశీర్వదించు వొస్తాం' అని రేపో మాపో వాళ్ళింటో ఉపన్యాసం యివ్వటానికి రెడీగావున్న మిత్రులు అతని కున్నారు. అర్ధరాత్రి బావిలోపడి 'ప్రేమహత్య' చేసు

కున్న నీలవేణినీ, దానికి కారణమై చదువూ,ఆరోగ్యమూ పాడుచేసుకుని దేశాటనంలో వున్న నరసింహారావునీ ఆ కుర్రాడు మరచిపోలేడు.

అయితే వాళ్ళందరూ వేరు. మా జగన్నాథం విషయం వేరూను. రేపొద్దున మావాడి ఘభాయిత్యం తెగిసి 'నాయనా నీదారి నీది' అని ఆ కాస్త మాట మానాన్న అనేస్తే వీడెలా బ్రతగ్గలడు ? ఒక్క ప్రేమతోనే బ్రతకడం దుస్సాధ్యం కాదా. వాడి చేతిలో తాడూ బొంగరాల్లో ఏ ఒక్కటీ లేనేలేవుగదా! వాళ్ళంటే, వాళ్ళు చదువుకున్నవారు కాబట్టి ఎలాగోలా బ్రతకగలరు. మరి మావాడో ?

వెధవది - నాలుగేళ్ళపాటు కాలేజీలో చదువుతూ, అనువైన వాతావరణంలో పెరుగుతూన్న నేను చెయ్యలేని పనిని, ఎక్కడో దేశానికి మారుమూల ఒక కుగ్రామంలో పుట్టి పెరిగిన జగన్నాథం ప్రేమాయణం సాగించాడంటే, చెప్పద్దూ—కాస్త ఈర్ష్య, కాస్త ద్వేషమూ, మరి కాస్త 'జాలీ' పుట్టుకొచ్చేయి.

పని మనిషిచేత కారియర్ తెప్పించి, తర్వాత తీరుబడిగా ఆలోచించడం మొదలుపెట్టాను.

పదిన్నరకి గాని సినిమాకి వెళ్ళినవాళ్ళు తిరిగి రాలేదు. రాగానే యిద్దరికీ వడ్డించాను. వాళ్ళు హాయిగా భోంచేస్తూంటే వోపక్క దిగులుగా వున్నా (మరేంలేదు—ముందేవవుతుందా ?) మరోపక్క తృప్తి చెందాను.

వాళ్ళ భోజనాలైన తర్వాత నేనూ నాలుగు మెతుకులు ఎంగిలి పడ్డాను. ఆ దరిమిలా మావాడి దగ్గరికి వొచ్చేను. 'తమరి ఆజ్ఞ ఏమిటి ప్రభో !' అన్నట్లు వాడివైపు చూపు నిలిపాను.

వాడు ఆజ్ఞ యిచ్చాడు.

"అబ్బాయ్ ! తిరిగి తిరిగి మావాళ్ళు హూనమైంది. నిద్ర ముంచు

కొస్తుంది. కాబట్టి పడుకుందాం. సీత ఆ గదిలో పడుకుంటుంది. మనిద్దరం వీధి అరుగుమీద పడుకుందాం" అని.

ఆ విధంగానే పక్కలు ఏర్పాటు చేశాం. నడుములు వాల్చాం. నిద్ర ముంచుకొస్తుందని చెప్పిన జగన్నాధం నిద్రమాని వాడు ఆ పిల్లని ఎంత యిదిగా ప్రేమించిందీ, ప్రేమించబోయేదీ చెప్తున్నాడు ముందు గమనించలేదుగాని వాడు మాకాలేజీ ప్రేమికుల తాలూకు ప్రేమని అధిగమించాడు.

బైట పడుక్కోటం అలవాటు లేదేమో, అందులో చలిగాలి రివ్వున వీస్తుందేమో.దానికి తగినట్టు భవదీయుడి సంసారంలో దుప్పట్లు నిండుకున్నాయేమో ఆ రాత్రింతా యమయాతన అనుభవించేను. అయినా జగన్నాధం కథలో యివన్నీ మరిచిపోయేను.

ఎప్పుడు నిద్రపట్టిందో గమ్మత్తుగా పట్టేసింది. ఉదయం సీత వొచ్చి జగన్నాధాన్ని లేపుతూండగా మేలుకున్నాను. వాడికంటె ముందు నేను నిద్రలేవడం చూసి ఆ పిల్ల గుమ్మంవాయికి వెళ్ళిపోయింది.

ఆ మర్యాదా, ఆ మన్ననా నన్ను ముగ్ధుణ్ణి చేసిన మాట నిజం.

జగన్నాధాన్ని లేపాను. వాడు వొళ్ళు విరుచుకుంటూ, గట్టిగా ఆవులించి, అష్టవంకరలు తిరుగుతూ కళ్ళు విప్పాడు.

"అప్పుడే తెల్లారిందిటార్రి ...సీతా...." అని గావుకేక పెట్టాడు.

"ఆ అమ్మాయి ఎప్పుడో లేచిందోయ్" అన్నాను.

కాలకృత్యాలు ముగించుకున్న పిదప కాఫీగటార్రి పుచ్చుకొని వెళ్ళిపోయాను వాళ్ళు. వెళ్ళేముందు కృతజ్ఞా సూచకంగా సీత తన రెండు చేతులూ జోడించి నాకు నమస్కరించింది.

"ఎంత చక్కటి పిల్లకి మరెంత చక్కటి సంస్కారమూ" అని ఎంతో మురిసిపోయాను. భగవంతుడ్ని ధ్యానించి రెండు చేతులూ జోడించి _

"భగవంతుడా! నువ్వన్నమాట నిజమని గట్టిగా నమ్మేవాళ్ళల్లో నే నొకడ్ని. నీ మీద పూర్తి విశ్వాసముంచాను. ఈ ఒక్క మేలు చేయి చాలు. అసి నా గురించి కానేకాదు. ఆ జగన్నాథం, సీత-ఇద్దర్నీ చల్లగా చూడు. వాళ్ళని అనురాగ దంపతులుగా చేసే బాధ్యత నీది. ఇది నీ తలకు మించిన కార్యమేమీ కాదు. కాదూ?...."

• • • •

బందరు పట్టణాన్ని వొదిలిపెట్టలేని నేను (సెలవల్లో) తప్పని సరిగా భావించి మా వూరు వెళ్ళేను. మా ఊరు ఏమీ మారలేదు. దెయ్యాలబావి, భూతాల రావిచెట్టూ, గంగానమ్మ గుడీ, ఆచారిగారి బడీ, ఆ పక్కనే చింతచెట్టూ,చింతచెట్టు ముందు మా ఇల్లూ అన్నీ సవ్యంగా క్షేమంగా వున్నాయి.

చిన్నప్పటి స్నేహితులూ, కాస్త పెద్దయిన తర్వాత కలిసిన పెద్దలూ అందరూ నవ్వుతూ పలుకరించేరు. చావుకి సిద్ధపడిన మరి కొందరు తాతయ్యలు "బాగా మారిపోయావోయ్ చిన్నా!" అన్నారు.

రాజారావుగారు నన్ను చూడగానే ఆయన మొహంనిండా నవ్వు పులుముకోవడం పెద్ద అలవాటు. నవ్వు పులుముకున్న తర్వాత "ఏలా వున్నావోయ్! కులాసాయేనా? చదువేలా వుందీ? (అదీ కులాసాయేనా?) ఆఁ (అయ్!)" అని నిండుగా పలుకరించడం ఆయ నొక్కడికే చేతనవును. వెర్రిమొహంపెట్టి "ఇహీ" అనడం నాకూ చాతొచ్చు.

ఆ సాయంత్రం ఆయనే చాలా విషయాలు ముచ్చటించారు. ఆ తర్వాత బందర్లో ఆడుతున్న సినిమాలు మొదలుకొని, వొచ్చే ఎన్నికల్లో ఎవరెవరు నుంచుంటున్నదీ చెప్పమన్నారు. ప్రస్తుతం కూర్చున్న వాళ్ళల్లో ఎవరు నించుంటారో నాకేం తెలుసు.

కానీ నా అవస్థ గమనించో, లేక తన ప్రయోజకత్వాన్ని నా

ముందు ప్రదర్శించాలనో, ఆయనే చెప్పేశారు పేరు పేరునా. ఎవ రెవరు ఏ పార్టీ తరపున నిలబడబోతున్నారో.

అనుకుంటున్నారుగానీ ఈ రోజుల్లో పల్లెటూళ్ళు వెనకటి పల్లె టూళ్ళు కాదు మాస్టారూ! తెలివి మీరిపోయాయి. బస్తీజనానికి పీళ్ళేం తీసిపోరు. వాళ్ళ గుడీ అంటే వీళ్ళ గుళ్ళో లింగమూ అంటారు.

వెనకటికి హైస్కూల్లో "నేటి మన గ్రామాలు" అనే విషయం పైన చిన్న చర్చ జరిగింది. దాంట్లో విశ్వంభర శర్మ అనిచెప్పి నా ఫ్రండొకడు (వాడి నందరూ అగ్గిపిడుగనేవారు) "మన గ్రామాలేం తక్కువకాదు. పాలిటిక్సు అక్కడే పుట్టి అక్కడే పెరుగుతాయి. రాజ్య పరిపాలనా దక్షత - మరేమో - జానపదులకే బాగా తెలుసు. ఆ తర్వాత" ఇలా గబ గబా చెప్పేస్తూంటే, యింత పరిశీలనా శక్తి అప్పట్లో లేక పోవడంవలన "పీడి బొందలే.... నోటికొచ్చినట్లల్లా వాగేస్తున్నాడు" అని వాడ్ని అపార్థం చేసుకున్నాను. ఎంత తప్పు జరిగిపోయిందీ?

రాజారావుగారు కుటుంబ విషయాలు తీసుకొచ్చి, చాలా చెప్పి ఆయన ఉపన్యాసానికి కొసమెరుపు అన్నట్టు వాళ్ళమ్మాది చేత కాస్త కాఫీ యిప్పించి, ఆ పిల్ల కాఫీ ఎలా చేస్తుందో చెప్పి వెళ్ళిరమ్మని సెల విచ్చారు.

ఇంటికొచ్చిం తర్వాత నాన్న అడిగేరు - "రాజారావు గారింటి కెళ్ళావా" అని. నా కిలాంటి ఎత్తులంటే మహచెడ్డ చిరాకు.

నేను మావూరు వెళ్ళిన రెండో రోజుల వరకూ యీ పరామర్శలూ, పలకరింపుల్లోటే జరిగిపోయాయి. జగన్నాధంతో పట్టుమని పదినిమిషా లైనా మాటాడేందుకు అవకాశం చిక్కనేలేదు.

మూడోరోజు —

బాగా చీకటిపడిన తర్వాత జగన్నాథాన్ని వెంటేసుకుని కాలువ

గట్టువైపు వెళ్ళాను. జగన్నాథంలో మార్పు కొట్టొచ్చినట్టు కనుపించింది. వాడు మునుపటిలా ఉత్సాహంగా లేడు. వాడి మొహంలో దిగులూ, వాడి మాటలో తొట్రుపాటూను. కారణం వాడే చెప్పేడు

మా జగన్నాథం కథలోకి విలనుడు వొచ్చేడు. వాడిపేరు వసంత రావు. ఉద్యోగం, మునలయ్య వాళ్ళ ఊళ్ళోవున్న దేరా హాల్లో బుకింగ్ క్లార్కు. అభిరుచి, అందాన్ని ఆస్వాదించడం (ఈ ముక్క తప్పని సరిగా రాయాల్సిందే మరి.) ఆశయం వీలైనంత త్వరలో మహా పట్ట ణంలో మకాంపెట్టి తెలివితేట లుపయోగించి సొంతంగా ఏదైనా వ్యాపా రం పెట్టుకోడం.

ఈ వసంతరావు మునలయ్యతో మంచి స్నేహం సంపాయించు కున్నాట్ట. తనుపయోగించే 'సీమ మందు' మునలయ్యకి రుచి చూపించి "కంట్రీసరుకు"ని తిట్టిపోసి, "మరేటనుకున్నావ్" అని తన ప్రయోజ కత్వం నిరూపించుకున్నాడట.

మునలయ్య వసంతరావుని మెచ్చుకున్నాడు. ఇంతటి మేధావీ, నవనాగరికుడూ తన సొంత మనిషైతే ఎంత బావుండునని ఆశపడిపోతూ న్నాట్ట.

జగన్నాథం కాలువగట్టున కూర్చుని, వెన్నెల్లో మెరుస్తూన్న నీళ్ళ ల్లోకి చూస్తూ-

"మునలయ్య అఖండుడు. ఎత్తులు వేయడంలో అతన్ని మించిన వాళ్ళు లేరు. వాట్టి కర్కశ ప్రకం. నాలుగు సీసాలు చేతిలో పెడితే, చెయ్యమన్న పనిని ఆలోచించకుండా చేసేస్తాడు.సీతకి వాళ్ళ నాన్నంటే భయం. మునలయ్య గీసిన గీత దాటదు" అన్నాడు.

"అది సరేగాని, మీ ప్రేమ విషయం మా నాన్న కిప్పటికైనా తెలుసా ?" అని అడిగేను.

"ఈ మధ్యనే తెలిసింది"

"ఏమైనా అన్నాడా ?"

"లేదు. అసలా విషయం నా ముందెప్పుడూ ఎత్తలేదు.

మావాడి వ్యవహారం తాడోపేడో తేల్చుకోవడం మంచిది ఇలాటి వాటిల్లో. ఓ పక్క మబ్బులు కమ్ముకుంటూన్నా. జాప్యం చెయ్యడం పనికిరాదు. ఏమైనాసరే నాన్నగారితో జగన్నాథం గురించి చెప్పాలి.ఎలాగైనా ఆయన్ని వొప్పించి, మునలయ్యతో మాటాడాలి, తప్పదు.

అక్కడా కాలువగట్టున మా జగన్నాథం పక్కనే కూర్చుని ఆలోచించి ఈ నిర్ణయానికి వొచ్చాను.

ఆ మరుసటి రోజు మా నాన్నగారితో ఈ విషయం కదిపాను.

"జగన్నాథానికి సీతంటే ప్రాణం."

"తెలుసు. తిరునాళ్ళలో దాన్ని వెంటేసుకు తిరిగాడటగా. నువ్వు వాళ్ళకి అతిథి మర్యాదలూ చేశావుట. నాకన్నీ తెలిశాయి" అన్నారాయన.

ఉలిక్కిపడ్డాను. మళ్ళీ అంతలోనే సర్దుకున్నాను.

"జగన్నాథం పెళ్ళి సీతతోనే జరగాలి."

"అంటే నీ ఉద్దేశ్యం ?"

ఆయన నా ఉద్దేశ్యం తెలుసుకోవాలని అడిగేసరికి కాస్త భయపడిన మాట నిజమే. కానీ అన్నీ ఆలోచించి ఒక నిర్ణయానికి వొచ్చిన తర్వాత వెనక్కి తగ్గడం ఏం బావుంటుంది ? ధైర్యం పుంజుకుని అన్నాను :

"వాళ్ళ పెళ్ళి జరగడమే మంచిది. లేకపోతే జగన్నాథం మనకి దక్కడు."

ఆయన ఉగ్రులయ్యారు.సాక్ష్యంగా ఆయన కళ్ళు ఎర్రపడ్డాయి.

"అయితే ఎవడికోయ్ నష్టం ? ఎవడికి చెప్పి ప్రేమించాడూ ? అయినా యీ వెధవకి ప్రేమేవిటోయ్ ప్రేమ. ప్రతి అడ్డమైన వాడూ అడ్డమైన దానినీ ప్రేమిస్తే దానికి బాధ్యులెవరు ? నేను వాడి గురించి వినదలుచుకోలేదు."

"జగన్నాధం మనకు పరాయిమనిషికాడు.నేను మీకెలాగో వాడూ అంతే."

"చాల్లే....మాటలు నేర్చావ్. నోరుమూసుకుని నీ పని నువ్వు చూచుకో. అనవసరమైన హాటిల్లో తల దూర్చకు."

"ఇది అనవసరమైనది కాదు" (నా ధైర్యానికి నేనే భయపడ్డాను) ఆయన నావైపు ఎగాదిగా చూసేరు. ఏదో అనబోయి ఆగిపోయారు.మళ్ళీ కాసేపటికి అనేశారు ముక్తసరిగా.—

"అయితే మీరంతా ఏ గంగలోనైనా దూకి చావండి."

ఈ సలహా చెప్పి వెళ్ళిపోయారు. ఆయనలా వెళ్ళగానే యిటు జగన్నాధం వొచ్చాడు.తల వొంచుకుని గుమ్మం దగ్గరే వుండిపోయాడు. గబగబా వాడి దగ్గరికి వెళ్ళాను.

"భయపడకురా ! ఇదెంతవరకొస్తుందో నేనూ చూస్తాను" అన్నాను.

వాడు తలెత్తి నావంక చూసేడు.

"నాకులేని ధైర్యం నీ కెక్కడ్నుంచి వొచ్చిందిరా చిన్నా !" అన్నాడు.

"లేకపోతే యిన్నేళ్ళు వొచ్చినా యింకా కుర్రకుంకలూ, చేతకాని సన్నాసులూ అని అనిపించుకోమంటావా ? మర్యాద కోసం,ఆయన మీద గౌరవంకొద్దీ చెప్పి చూశాం. వినరూ. తర్వాత చేసే పనేదో చేసి చూపిస్తాం" అన్నాను.

జగన్నాధం నా చేతులు పట్టుకున్నాడు. నా కళ్ళల్లోకి తిన్నగా చూస్తున్నాడేగాని, వాడి కనుకొనల నీరు నిండుకోవడం వాడు గమనించ లేదు. గమనించిన నేను కలతచెందేను. ఏదో కీడు శంకించేను.

"ఇంత చొరవ ముందేవుంటే పరిస్థితి యింతవరకూ వొచ్చేదే గాదు" అన్నాడు బాధగా.

"ఇప్పుడు మాత్రం మించిపోయిం దే ముందిలే. రేపు ముసలయ్య యింటికి వెడదాం. అన్నీ చెప్దాం. వింటాడా వింటాడు. ఎదురు తిరుగు తాడా—వుండనేవుంది గాంధర్వ వివాహం. ఏది ఏమైనా మీ యిద్దరి పెళ్ళి చేసే బాధ్యత నాది" అన్నాను ఉద్రేకంగా.

వాడు ఏడుస్తూంటే అదిరిపడ్డాను. ఏమిటి వీడూ?

"సీతో చాలా విషయాలు చెప్పలేదురా చిన్నా. అంతా అయి పోయింది. పదిరోజుల క్రితం నన్ను ముసలయ్య తిట్టాడు. నేను దిక్కు లేని వాడినట. కాణీ విలువ చెయ్యని వాడినట-చాలా అన్నాడు. చెప్పరా నువ్వు చెప్పు....మీరందరూ వుండగా నాకు దిక్కులేదా, కాణీ విలువ చెయ్యనా?"

"...................."

"ఆరు నూరైనా నూరు ఆరైనా సీత పెళ్ళి వసంతరావుతో చేస్తా నన్నాడు. సీత దగ్గరకెళ్ళి అడిగేను. ఏడ్చి ఊరుకుంది" అన్నాడు జగ న్నాధం.

నా తల కొట్టేసినంత పనయ్యింది. నా నవనాడులూ కృంగి పోయాయి. కుప్పలా కూలపడ్డాను.

"కానీ . నువ్వు ఈ మాత్రం మాట సాయం చేస్తావని తెలిస్తే ఆ వసంతరావుగాడు రాకముందే మా పెళ్ళి జరిగుందేది. అయిపోయిం

దిరా చిన్నా! నే నొట్టి దద్దమ్మని" అనేసి గబగబా వెళ్ళిపోయాడు జగన్నాధం.

జగన్నాధం భగ్న ప్రేమికు డయ్యాడు. మరొహడూ మరొహ డైతే నా కంత దిగులుండేది కాదు. సాక్షాత్తు మా జగన్నాధం. ఒక అమాయకుడు. ఒక అభాగ్యుడు - ప్రేమించాడు. ప్రేమించిన పిల్లతోనే స్వర్గమనుకున్నాడు. అలాటి వాడికి ఎదురు దెబ్బేమిటి?

నాకు చాలామంది ప్రేమికులు తెలుసు ననే మాట ముందే మనవి చేసుకున్నాను. మా క్లాసుమేటు బుచ్చినాయన (వాడి అసలు పేరు వెంకటాద్రిప్) ప్రేమించి వాళ్ళింట్లోనూ ప్రియురాలి తాలూకు వాళ్ళింట్లోనూ గోలవటి భగ్న ప్రేమికుడయ్యాడు. ఆ దరిమిలా ప్రియురాలి నాన్నగారికి ట్రాన్స్ఫరైతే మరో వూరికి వెళ్ళిపోయారు వాళ్ళు. బుచ్చినాయన బ్రతకడను కున్నాం. ఖర్చురాసే అవసరం వొచ్చిందను కున్నాం. మా పిచ్చి కాకపోతే వాడు విశాల హృదయుడన్న విషయం గుర్తించకపోవడం అన్యాయమే మరి. ఆ అమ్మడు దూరమైన తర్వాత మరి కొన్నాళ్ళకి బుచ్చినాయన మరో అమ్మడితో హృదయమని. అదనీ యిదనీ భాష మాటాడాడు. ఈ వరస బుచ్చినాయన నాన్నగారికి నచ్చక, వాడి చదువు మాన్పించి, పెళ్ళిచేసి ఒక యింటివాడిని చేసేడు. మొన్ననే తెలిసింది వాడొక తండ్రి అయ్యాడని.

ఈ రకం ప్రేమలైతే నేను వర్రీకాను. జగన్నాధం బుచ్చి నాన్నలా కాలేదు. మరలాంటప్పుడు జగన్నాధానికి దారేమిటి?

ఆ రాత్రి భోజనాల దగ్గర నాన్న అమ్మతో అన్నాడు.

"రేపు రాజారావుగారికి ఖబురు పెట్టించాలి. కాస్త కనుమరుగైతే చాలు మనకే బుద్ధులు చెప్పడం మొదలు పెట్టాడు సుపుత్రుడు. ఎవడో ప్రేమించడం ఏమిటి, వాడిని వీపు వెనకేసుకు రావడమేమిటి? తన

పెళ్ళి, తన బాగూ లేదుగానీ - ఎవడిపెళ్ళో ఎవడిబానో కావలసి ఒచ్చిం దట హుం."

నాన్నగారి మీద కోపం వొచ్చింది. ఏమిటీయన ధీమా ? ఆయన చెప్పినట్టల్లా వింటున్నాననే గదా ? నేనూ ప్రేమా ప్రేమా అంటూ నినా దాలుచేసి, రోడ్లవెంట తిరిగి నలుగు రైదుగుర్ని ప్రేమిస్తే తెలిసేది నాన్నకి కొడుకెంత ప్రయోజకుడైనదీను.అవేం లేకుండా బుద్ధిగా చదువు కుంటున్నాననేగా నా మీద యింత అధికారం, యింత శ్రద్ధాను.

ఆ మరుసటి రోజే బందరు వెళ్ళిపోయాను. నా పైచదువు లయ్యేంతవరకూ, నా పెళ్ళిమాట (దయచేసి) ఎత్తరాదని ఇంటికి ఉత్త రం రాశాను.

రిజల్ట్సు వొచ్చేయి, ప్యాసయ్యాను. యూనివర్సిటీ చదువు కొరకు విశాఖపట్టణం వెళ్ళాను. ఈ మధ్యకాలంలో సీత వసంతరావుని పెళ్ళిచేసుకుని అతన్తోపాటు హైదాబ్రాద్ వెళ్ళిపోయింది. మా వాడు జీవితాన్ని తిట్టుకుని, విధిని కసితీరా శపించి మళ్ళీ మామూలు మని షయ్యేందుకు ప్రయత్నిస్తున్నాడని విన్నాను.

ఇక్కడితో కథ అయిపోతే నిజానికి-యీ కథని యింత త్వరగా రాసేవాడిని కానేమో. నన్ను అమితంగా ఆకర్షించిన అంశం యీ రెండో భాగంలో వుంది. ఇది జరిగుండకపోతే కథ రాయటానిక్కావల సిన యిన్స్పిరేషన్ వొచ్చేది కాదేమో.

అసలు జరిగినదిది.

నాన్న ఉత్తరం రాసేరు. ఆయనుత్తరాలని పట్టించుకోలేదు ఇంతకు మునుపు. "ఇక్కడ కులాసా. అక్కడ నీ క్షేమం వ్రాయవలెను." "ఇంతడబ్బు ఏం చేస్తున్నట్టు ? సంపాయించేవాడికి తెలుస్తుంది డబ్బు విలువ. జాగ్రత్తగా వాడుకో." "ఆరోగ్యం జాగ్రత్త.అతిగా తిరక్కు.

శ్రద్ధగా చదువుకో"— ఎప్పుడూ చదివినా యిలాటి ఉత్తరాలే. వెరైటీ అంటూ ఛస్తే వుండదు.

కానీ - ఇప్పుడు నాన్న రాసిన వుత్తరంలో చిత్రమైన వార్త లున్నాయి. మచ్చుకి....

"వారం రోజులక్రితం సీత మొగుడ్నొదిలి వొచ్చేసింది. జగన్నాథాన్నైనా యిలాగే చేసేదిగా! అందుకనే పెద్దవాళ్ళమాట వినమని చెప్తుంటారు. ముసలయ్యగాడి వంట్లో ఏమీ బాగుండలేదు. ఆ వెధవ సుఖపడతాడన్న నమ్మకం ఎవరికీ లేదు. అందరి ఉసురూ వాన్న పడ్డాడు. యిప్పుడు సీత కుంపటైె కూర్చుంది. మల మల మాడి చస్తున్నారు.

జగన్నాధానికి విడుమోలు సంబంధం కుదుర్చుకు వొచ్చాను. పిల్ల లక్ష్మీదేవిలాగుంటుంది. కట్నం కానుకలూ, లాంఛనాలూ బాగానే ముట్టచెప్పేటట్టున్నారు. ఇన్నాళ్ళూ వాడికి నేనేదో అన్యాయం చేసినట్టు జనం ఏడ్చారు. యిప్పుడు వాళ్ళ నమ్మాలసి, నన్ను ఆకాశానికెత్తి పారేయాలని నాకులేదు. వాడి నా యింటివాడిని చేసి, కాలవ పక్క రెండెకరాలూ వాడిపేరని రాసి నీ సంసారం నువ్వు చూసుకోమని చెప్తాను. ఎవడైనా యింతకంటే ఏం చేస్తాడు?"

అవునుమరి యింకేం చేస్తారు! ఈ మాత్రానికి మా జగన్నాథం సుఖపడతాడనే నమ్మకం నాకులేదు. ఈ సంగతి మా నాన్నకి తెలీదా? తెలిసి పట్టించుకోడం లేదా?

ఏడవాలో నవ్వాలో అర్థంకాలేదు. సీత మొగుడిని వదిలి వొచ్చినందుకు ఏడవాలో, లేక మావాడు ఒక యింటివాడవుతున్నందుకు నవ్వాలో?

సీత గొంతు కోసిన వాళ్ళల్లో ముఖ్యుడు ముసలయ్య. సీత గొంతుకోసిన ముసలయ్య మంచాన పడ్డాడు. అతనూ సుఖించేదేమీ లేదు.

దైవ సంకల్పం కడువిత్రంగా వుంటుందని చెప్పటానికి ఈ విదర్శనం చాలదూ?

నాన్న ఉత్తరం వొచ్చిన సరిగ్గా పదిహేను రోజులకి మహో చిత్రాతిచిత్రమైన సన్నివేశాన్ని చూశాను. ఆ రోజున బజారు వెళదా మనుకుంటూండగా మా రూం ముందు రిక్షా ఆగింది. జగన్నాధం, సీతా రిక్షా దిగారు. వాళ్ళిద్దరూ చిలకలపూడి తిరనాళ్ళ కొచ్చిన రోజుకంటె ఎక్కువగా ఆశ్చర్యపోయాను.

జగన్నాధం, సీతా యిద్దరూ అరుగుకిందే నిలబడ్డారు.

"అప్పుడు తిరనాళ్ళ కొచ్చిన రోజున నీ దగ్గరికి ధైర్యంగా వొచ్చేం. ఇప్పుడు యింత జరిగిన తర్వాత....ముసలయ్య పోయాడు. సీతను వెంటబెట్టుకొచ్చాను చిన్నా. చెప్పు నేను అన్నీ వదులుకుని వొచ్చేను. మీనాన్న నన్ను వెళ్ళగొట్టాడు. సీతలేని బ్రతుకు బ్రతుకు గాదు.నా సీత కష్టాలు నేను చూడలేను. బ్రతకటానికి వొచ్చాం. మార్గం చూపించి పుణ్యం కట్టుకుంటావో, లేక అందరిలాగా కసిరికొడతావో చెప్పరా చిన్నా!" అన్నాడు ఉద్రేకంగా.

మా జగన్నాధం నన్నింతవరకూ అర్థం చేసుకోలేదన్న మాట. నిజమే. తండ్రిచాటు కుర్రాడినైతే గావచ్చు. అవుతే - అంతమాత్రం చేత నా వ్యక్తిత్వం తగలబడి పోయిందా?

నా మనసు చివుక్కుమంది.

"జగన్నాధం....నన్నింకా అనుమానిస్తూన్నావుటార!" అన్నాను. ఇంకా ఏం చెప్పాలో తెలీలేదు.

వాడు అమాంతంగా నన్ను కావిలించుకున్నాడు.

"చిన్నా! చాలు నాకీ మాట" వాడి ముఖంలోకి తిన్నగా చూసేను.

వాడి కళ్ళల్లో నీళ్ళు నిలిచాయన్న మాటేగానీ, ఆ కళ్ళల్లో తొణికిసలాడుతున్న ఆత్మవిశ్వాసం, గుండెనిబ్బరం నన్ను ఆనందపరిచాయి.

"సెభాస్ జగన్నాథం! ఒక మామూలు మనిషి చేయలేని త్యాగాన్ని నువ్వు చేశావ్! నువ్వు 'ఏ' క్లాసు ప్రేమికుడివి"

నిజమూ అదేగా మాస్టారూ!

o---o

# బ్రతకనివ్వండి

ఎవరి గురించో యెందుకు ? నా గురించి నేనే వ్రాసుకుంటాను.

ఎవడి గురించి వాడే వ్రాసుకోడంలో గల యిబ్బంది మరొహడి గురించి వ్రాయడంలో వుండదు. ఎదటివాడి గొప్పతనాన్ని ఎత్తి చూపుతే కాబోసనుకోవచ్చు. తన గొప్పతనం గురించి ఏ కొంచెం వ్రాసుకున్నా అతిశయోక్తి అనేస్తారు. కనక తన గురించి తనే వ్రాసుకోడం ప్రారంభిస్తే తగిన జాగ్రత్త తీసుకోడం చాలా అవసరం. ఈ అవసరాన్ని తూ. చ. తప్పకుండా పాటించేను.

కథావస్తువు సర్వ సాధారణమైనది. ఈ వస్తువు గురించి 'మంచి కథలూ,' 'మంచి'గా వ్రాయలేని కథలూ యింతకుమునుపే వచ్చి వుండొచ్చు. ఈ కథాంతం నన్నాకర్షించకపోతే ఈ కథ వ్రాసివుండే వాడిని కాదు. పైగా యిది నా కథ !

ఆఫీసనబడే నాలుగ్గోడల మధ్య కొంద రదృష్టవంతులూ, మరి కొందరు దురదృష్టవంతులూ వాళ్ళవాళ్ళ తలవంచుకుని పనిచేయడమనేది కొత్త విషయం కాదు. కాబట్టి ఆఫీసు వాతావరణాన్ని రెండు

1965, మార్చి - భారతి

రకాలుగా భాగించవచ్చు. మొదటి కొందరికి స్వర్గంగానూ, రెండో కొందరికి నరకంగానూ మారుతుంటుంది. రెండోదాని గురించి లోగ డెప్పుడో వ్రాసియుండటం చాత ఈ కథ నిప్పుడు తప్పనిసరిగా మొదటి రకానికి అంకితం చేస్తున్నాను. మీదు మిక్కిలి ఈ వస్తువూ దానికి సంబంధించిందేను.

కాలేజీ వదిలి (దాని గురించీ కొన్ని కథలు వ్రాయడం జరిగింది) నాలుగేళ్ళు పూర్తయ్యాయి. అప్పట్లో నాకో సరదా వుండేది. క్లాసు జరుగుతున్నప్పుడు వెనక బెంచీలో కూర్చుని 'పారిస్' గురించి కలలు కనే కుర్రాళ్ళల్లో నే నొకడ్ని. ఇతర దేశాల్లో కాలం గడిపే జాతకుల అదృష్టాన్ని అభినందించే వాళ్ళల్లో నేను మొదటివాడిని. బందరనబడే కేవలం తెలుగు పట్టణంలో కూర్చుని ఆ యూదేశాల వాతావరణం,ఆచార వ్యవహారాల గురించి ఆలోచనలు చేస్తూ, దానిద్వారా లభ్యమయ్యే మహత్తరానందాన్ని సంపాయించుకున్న కలల మనిషిని.

ఆ రోజుల్లో టెక్నికలర్‌లో కల లొస్తుండేవి. సరదాగా వున్నప్పుడు నా చుట్టూ చేరిన నా మిత్రులకి మనసు విప్పుకుని నా కలల గురించి చెప్తుండేవాడిని. వింటూన్న కాస్సేపూ శ్రద్ధగా విని,వెళ్ళిపోతూ భుజం చరిచి అనేవారు-'వారేవ్ రావూ! నువ్వు కథలు రాసే ప్రమాదానికి దిగజారిపోగలవు సుమా' అని.

నా కలల్నే కథలుగా వ్రాయసింది. లేదూ అనుభవాలనే వ్రాయసింది. నా మిత్రులన్న మాటల్ని నిజంచేసి ఈ కలల మనిషి కథల మనిషిగా మారిపోయేడు. ఇప్పటికీ పై నుదహరించిన 'అవస్థ' నుంచి దూరంకాలేదు. పైగా స్థాయిని పెంచుకున్నాడు గూడాను.

నా కిష్టమైన ప్రపంచాన్ని తప్పనిసరిగా వదులుకుని రోజుకి

యిన్ని గంటలని చెప్పి ఆఫీసనబడే జైల్లో ఎలా బ్రతికేది ? ఉద్యోగంలో కాలుపెట్టిన మరుక్షణం కలిగిన ఈ రకమైన ప్రశ్నకి అనుభవం కొంచెం లేటుగా జవాబు చెప్పింది. ఆఫీసు తలుపులు తెరుచుకుంటాయి. మళ్ళ అయిదున్నరకి మూసుకుంటాయనేది అనుభవం నేర్పిన సిద్ధాంతం. ఈ సిద్ధాంతం ప్రకారం ఒక్క నిమిషం ముందుగానీ మరోక్షణం వెనగ్గానీ కాలాన్ని ఖర్చు చేయలేదు.

విదేశాల్లో గడపాలనే పగటి కల దుమ్ముకొట్టుకు పోయిందేమాని తెలుసుకుని కుమిలిపోయేంత చాతకాని మనిషిని కాను. దాని ఫలితంగా ఏర్పడిన 'కసి'ని నన్ను పోషిస్తున్న ఉద్యోగమ్మీద రుద్దేంత తెలివి తక్కువవాడినీ కాను.

నవోత్సాహాన్నీ, రంగుల లోకాల్నీ చూపించే కథారంగం నన్ను దూరం చేసుకోదు. నేను దూరం కాలేను. ఈ స్థితిలో రోజుకున్న ఇరవై నాలుగ్గంటల్లో ఆరు గంటలు మరో వ్యాపకాన్ని నెత్తినెట్టుకు పూజించడం పెద్ద శిక్ష ! ఒప్పుకుంటాను. కానీ అలా అని చెప్పి నా శ్రమకి ప్రతిఫలమిస్తో. నా కృషిపట్ల నమ్మకం పెట్టుకున్న ఉద్యోగానికి అన్యాయం చేయడం నా ధర్మంకాదు.

శ్రద్ధగా రాసే కథకీ,నడుంవంచి చేసే ఉద్యోగానికీ తోటి మనిషి మెచ్చుకోకున్నా మెచ్చుకున్నా లోపలున్న ఆత్మారాముడు తృప్తిపడి సర్టిఫికేటిస్తే అంతకన్నా మించిన ఆనందం మరెక్కడుంటుందనేది నా అభిప్రాయం. అందుచేత ఆఫీసుకి కేటాయించిన కాలాన్ని తూ. చ. తప్పకుండా పాటించడం జరుగుతోంది. దేవుదొచ్చేది. ఆ కాలాన్ని వృధాచేయడం నా కిష్టంలేదు.

అయిదున్నరకి సరిగ్గా బైటికొస్తాను. అడుగు బైట పెట్టంగానే కళ్యాంలేని ఆలోచనల గుర్రం నాకోసం సిద్ధంగా వుంటుంది. రోజులో

మిగిలిన కాలమంతా దానిమీదనే స్వారీ చేస్తాను. దేవు డొచ్చేది. ఆ గుర్రం మరి దిగను.

ఆఫీసులో రాజకీయాలు చోటు చేసుకోవచ్చు. ఒకళ్ళంటే మరోళ్ళకి వల్లమాలిన విరోధం గావచ్చు. పైవాళ్ళ అభిమానంకొరకు వెకిలి వేషాలు పెరిగిపోవచ్చు. వీటన్నిటికీ నేను అతీతుడిని. నా లోకం వొక్క ఆఫీసేకాదు. నా కర్తవ్యం, నా క్షేమం, నా భవిష్యత్తు వగైరాలు కేవలం ఆఫీసుకే అంకితం కాదు. నేను మరికొంచెం వరాయి మనిషిని. ఎక్కువగా ఇతర రంగానికి సంబంధించినవాడిని. నాకున్న వోపిక మొత్తాన్నీ ఆఫీసుకే ధారపోస్తే నాగతేంగాను ? నా కలలేంగాను ?

ఇదీ గుమాస్తాగా, కథకుడిగా నాటూకీ పరిచయం.

ఉద్యోగంలో చేరిన కొత్తరోజులు కొంచెం దడగా గడిచేయి. నా మనసు నర్థంచేసుకుని నాకో స్థాన మివ్వగలదా ఈ బృందమని భయ పడ్డాను. కానీ అదృష్టవశాత్తూ నే ననుకున్నంత నరకం కాలేదు మా ఆఫీసు. అన్ని రకాలవాళ్ళూ వున్నా ఎవరి పరిధుల్లో వాళ్ళున్నారు గనుక నాకు రక్షణ కలిగింది.

నా సీటు గురించిగూడా కొంచెం చెప్తాను. లక్షల్తో తూగుతున్న మనిషికి వందలు సంపాయించే మరో మనిషితో తలమునిగేంత పనుం టుందని తెలిసిన మరుక్షణం నేనెంతో ఆశ్చర్యపోయేను. మనుషుల్నే కొనగల తాహతు వాళ్ళది. కేవలం 'సర్వీసు' నాది. చిత్రం. అందు చేతనే అంటారు. సృష్టిలో పనికిరాని చవట వస్తువు ఒక్కటీలేదని. కవిత్వానికి అదే సూత్రం. ఉపయోగించగల నేర్పుండాలేగానీ అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా, కుక్కపిల్లా మొదలైనవేవీ నిషేధాలు కావుల.

రోజూ వచ్చే పోయేవారితో మా ఆఫీసు రద్దీగా వుంటుంది. వొచ్చేవాళ్ళల్లో ఎక్కువభాగం నాకోసమే. మర్యాదగా మాటాడినంత

కాలమూ మర్యాదగానే నడిచ. శృతిమించిన మరుక్షణం తగ్గ సమాధాన మివ్వడం అలవాటు నాకు. కురర్రివాడినీ, వేడి నెత్తురు కలవాడినీ, పైపెచ్చు కథలు వ్రాస్తున్నవాడినీ గనక నరనరాన్న ఈ గుణం బాగా పనిచేస్తోంది. సంగతి తెలుసుకొని మరీ నాతో వ్యవహరించే వారు వచ్చే 'లక్షల మనుషులు.'

ఆఫీసు పరంగా ఆ సీటుకున్న గౌరవం నాకు దక్కింది. దానికి తోడు ఆఫీసరు మనసున్న మనిషి.నావెనుక కొండంత అండగా నించునే వారు.

చాలా నెలలు గడిచేయి. చాలా అనుభవాలు గడించేను. చాలా మంది చేత 'మంచి' అనిపించుకున్నాను. ఫైళ్ళు సీట్లో పెరిగిపోవడం యిష్టంలేదు. ప్రతి కాగితం వెంటనే కదలడం సరదా. ఆఫీసులో పెరిగిన పాపం బయట నా మనసుని తినేస్తే నా గుర్రిపుస్వారీ ఏంగాను ?

ఈ చేతులు లక్షలు వ్రాసి లక్షాధికారుల అవసరాలకి సాయపడ్డాయి. ఈ చేతులు వాళ్ళందరిచేతా మన్ననలు పొందేయి. అంతేగాని, ఈ చేతులకి సంకెళ్ళు వేసుకోవడం తెలీదు. ఈ చేతులు మరొహాళ్ళ చెప్పుచేతల్లో నలిగిపోడం తెలీదు. ఆ పరిస్థితి కలుగుతే వేడినెత్తురు పల్లబడి గుండె ఆగుతుంది. లక్ష లిస్తున్నప్పుడు అదే కారణంగా 'ఆశ'చెందడం సాంప్రదాయమైతే. ఆ సాంప్రదాయాన్ని అసహ్యించుకోడం నా గుణం.లక్షల్ని నా సంస్థ యిస్తున్నది. అలా యిచ్చేందుకు నాలాటి మర మనుషుల్ని ఏర్పాటుచేసుకున్నది. మరలు పనిచేస్తాయి. సంస్థ ప్రతిఫల మిస్తుంది. మరలకీ సంస్థకీ మధ్య లక్షల మనుషుల్తో ప్రమేయంలేదు. ఆ అవకాశాన్ని మర స్వయంగా యిస్తే ఆ మర చెడిపోయిందనే చెప్పాలి. దాన్ని సంస్థ అనబడే యంత్రంనుంచి తొలగించాలనే అనాలి.

అందుచేత నేను లక్షల మనుషుల దగ్గర 'ఆశ' చూపించేవాడిని

కాదు. వాళ్ళు వస్తే పలుకరించేవాడిని. చాతనైతే వాళ్ళకావల్సిన పని చేసేవాడిని. లేదూ ఖచ్చితంగా వాయిదా వేసేవాడిని.

— తన గురించి తనే వ్రాసుకోడంలో గల యిబ్బందిని గమనించి. కావల్సిన జాగ్రత్త తీసుకున్న మీదట తయారైన ఉపోద్ఘాతంపై నుదహరించాను. అది మేకుల్తో బిగించి మరీ వ్రాసింది.

అయిదున్నర తర్వాత నాకున్న వ్యాపకం ముందే మనవిచేశాను. దానికి సంబంధించిన మనుషులు కొందరు ఒక చిన్న సమావేశం లాటిది ఏర్పాటు చేయడం మూలంగా; పోనాడు, అక్కడికి వెళ్ళడం జరిగింది. ఆ సమావేశంలో నాకు పరిచయమైన కుర్రాడి పేరు రాజు. అతనికి కథలు చదవడం చాలా యిష్టంట. కాలం కలిసివస్తే అతనూ మాలాగా తయారవ్వాలని ఉద్దేశంట. అతనిది తణుకుట. తెలిసిన మిత్రుడెవరో మా సమావేశం గురించి చెప్పగా విని వచ్చాట్ట.

సమావేశం ముగిసిన తర్వాత అతను నాతోపాటు మా రూముకి వచ్చేడు. నా కథల గురించి చాలాసేపు మాట్లాడేడు. మా హోటల్లోనే భోజనం చేశాం. 'హెలియన్స్' సినీమా గూడా చూసినట్టు జ్ఞాపకం. అతనేదో లాడ్జింగ్‌లో గది తీసుకోడం మూలంగా అత నెళ్ళిపోయేడు. ఆ రాత్రి అలా గడిచింది.

ఆ మర్నాడు అతను మా ఆఫీసుకి, నా సీటుకి వచ్చినప్పుడు నే నెంత ఆశ్చర్యపోయేనో అతనంత కలవరపాటు చెందేడు. అతనొచ్చిన పని టూకీగా చెప్పేడు. ఆ పని నిన్ననే చేసినట్టు చెప్పగా విని మెరిసే కళ్ళతో తన కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. రాజూ వాళ్ళ నాన్నగారు పేరొందిన పెద్ద కాంట్రాక్టరు. ఆంధ్రలో ఆయనకి మంచి పేరున్నది. ఆయనకి మా సంస్థ చాలా డబ్బు యిచ్చింది. ఇస్తూనే వుంది. అందు నిమిత్తం అవసరమైనప్పుడల్లా తండ్రి తరఫున రాజూ ి వస్తూంటాట్ట.

రాజుతో ఆనాటి నా పరిచయం యింత థ్రిల్‌గా జరిగింది. తర్వాత చాలాసార్లు వచ్చేడు. వచ్చిన ప్రతిసారీ కేవలం నేటి కథలూ, వాటి కథకులూ గురించి మాట్లాడేవాడు. అప్పుడప్పుడూ తనవెంట అతను వ్రాసిన కథలూ తీసుకొచ్చేవాడు.

ఇదీ రాజు.... నా సీటుతో పనున్న పెద్దమనుషులందర్లోనూ రాజు మీదనే నాకు అమితమైన అభిమానం. కారణం ప్రత్యేకించి వ్రాయక్కర్లే దనుకుంటాను.

వోనాటి సాయంత్రం ఏమీ తోచని వేళ అద్దెగదిలో కూర్చున్నాను. సమయానికి రూమ్మేటూ లేడు. చీకటి పడేంతవరకూ తలా తోకాలేని ఆలోచనల్లో కుస్తీ పట్టేను. ఏదింటిక్కాబోలు భగవద్గీత తీసి చదవడం ప్రారంభించేను. రూము ముందు రిక్షా ఆగిన చప్పుడైతే అటు వేపు చూసేను. రాజు వొచ్చేడు.

రాజులో ఒక ప్రత్యేకత వుంది. అతనెప్పుడూ నవ్వుతూంటాడు. అంత అందమైన మనిషి మరింత అందంగా నవ్వుతే జెలసీలాటి ఆనందం నాకు. అతనిమల్లె నవ్వాలని, నవ్వి అద్దంలో చూసుకుని ఆ ప్రయత్నాన్ని విరమించిన ఘడియ నాకు బాగా జ్ఞాపకం.

"ఏమిటండి, బాబోయ్ ! భగవద్గీత చదివేస్తున్నారు" అన్నాడు.

"రండి. రండి ఏం తోచక బోరుకొట్టి చస్తున్నాను. సమయానికి శ్రీకృష్ణ పరమాత్మలా వొచ్చేరు."

అతను నా ట్రంకుపెట్టెమీద కూర్చుని కాలుమీద కాలు వేసుకుని కళ్ళల్లో ఆశ్చర్యాన్ని నింపుకుని మరీ అడిగేడు—

"తోచకపోవడమా ? మీకా ? నన్ను నమ్మమనే ?"

"నమ్మలేరా ?"

"వూహూం. చస్తే నమ్మలేను." ఆడపిల్లలా కులుకుతూ అన్నాడు.

"పోనీలేండి." భగవద్గీత అల్మారులో పెట్టి సిగరెట్టు పేకెట్టు విప్పేను. నేనోటి ముట్టించుకుని అతని కో సిగరెట్టు యివ్వబోయాను.

"వొద్దండి. మాని రెండురోజు లైంది."

ఆశ్చర్యపోయాను.

"మాని రెండురోజులైందా? మీరా? నన్ను నమ్మమనే?" అతన్ని అనుకరిస్తో అన్నాను.

"నమ్మలేరా?" నన్నతను బాగా అనుకరించేడు.

ఆడపిల్లలా కులుకుతూ 'వూహుం....చస్తే నమ్మలేను' అని అందా మనుకున్నాను గానీ బాతకాదని గ్రహించి వూరుకున్నాను.

"మా నాన్నగారికీ నాకూ మొన్నామధ్య పెద్ద యుద్ధం జరిగింది."

అతనన్న ఆ మాటని తేలిగ్గా తీసుకోడం నా తప్పుకాదు. సిగరెట్లు గురించి యిలాంటి యుద్ధాలు చాలా విన్నాను గనుక నే నది పట్టించుకోలేదు. కానీ ఆ యుద్ధం సిగరెట్ల గురించి కాదని అతనే చెప్పాడు.

"ఈ పెద్దవాళ్ళ పట్టుదలలు మరీ అసహ్యంగా ఉంటాయండి. మన మనసులు అర్థంచేసుకోలేరు. వాళ్ళ మాట వాళ్ళదేగానీ మన మాట వినిపించుకోరు. అవునాండి?"

"కావచ్చు."

"నాకూ హృదయముంది గనక ప్రేమించాను. వాళ్ళు స్థితిపరులు కాకపోవచ్చు. అంతమాత్రంచేత ఆ పిల్ల నాకు దూరం కావల్సిందేనా?"

ఎంతకీ అంతస్థూ, కులం ఈ రెంటినీ ముఖ్య కారణాలుగా తీసుకుని కుమిలిపోయే భగ్నప్రేమికుల అవస్థ రాను రాను బోరుకొట్టేస్తుంది. వెరైటీ కోసమైనా మరో అందమైన డిస్క్వాలిఫికేషను ఎవిని పించడంలేదు. గనక రాజా చెప్పే ప్రేమాయణం పట్ల ఆసక్తి తగ్గడం తప్పనిసరి. ఇది గమనించేడు కాబోలు వాళ్ళ వ్యాపారం గురించి మాట్లాడాడు. ప్రస్తుతం వాళ్ళు కొంచెం కష్టాల్లో ఉన్నారట.

లక్షాధికారుల కష్టాలు నాకు తెలీవు. కానీ అతను చెప్తూన్న వాళ్ళ కష్టాలు వింటూంటే నిజాని కవి బలమైనవేనా అని అనుమానం కలిగింది.

దీన్లోనూ నా ఆసక్తి ప్రదర్శించకపోవడంతో కథల్లోకి సంభాషణ మార్చాడు.ఆ సంభాషణ ఎనిమిదిన్నర వరకూ నిరాటంకంగా సాగింది. రాజా పేర్రామాయణంగానీ, వాళ్ళ నాన్నగారి కష్టాలుగానీ ఈ చర్చముందు నిలవవు. దీన్లోవున్న శక్తి చెప్పినంత మాత్రాన అర్థమయ్యేది కాదు. నిమిషాలు, గంటలు, రోజులూ గడిచిపోతున్నా 'విషయం' తరగనిది. క్షణక్షణానికీ రంగుమార్చుకుని నిత్యనూతనంగా కనుపించే మహత్తరమైనటువంటిదీని.

ఆ రాత్రి భోజనం చేస్తున్నా, సినిమా చూస్తున్నా మా కథల కబుర్లు తగ్గలేదు. మళ్ళా రూముకొచ్చి నడుం వంచేమన్న మాటేగానీ కంటికి నిద్ర రానూలేదు.

ఆ ఉదయం కొంచెం ఆలస్యంగా నిద్రలేచాము. ఆఫీసుకి వేళవడంమూలంగా గబ గబా తయారయ్యాను. ఇద్దరం హోటల్లో కూర్చుని కాఫీ తాగుతున్నవేళ పదిగంటలైంది.

కాఫీ ముగించి బయటకొచ్చి రిక్షా ఎక్కుతూ అతనన్నాడు:

"నాకు వేళవుతుంది. నే నుంటాను. మళ్ళా ఎప్పుడైనా కలుసుకుందాంలేండి."

అతన్తో కరచలనం చేసేందుకు చేయిముందుకు చాపేను. కరచలనం ముగిసింది. అతనిరిక్షా కదిలింది. నా గుప్పెట్లో ఓ కొత్త అనుభవం భయంకరంగా దాక్కునుంది.

ఈ కథకిదే కథావొస్తును !

భయం వేస్తోంది. రోడ్డుమీద నడుస్తున్న జనం నన్ను తీక్ష

ణంగా చూస్తున్నట్టు అనుమానం కలిగింది. చేతులు వొణుకుతున్నాయి. గుండెల్లో ఓ మూల దడగా వుంది. భూమిమీద నించునే వోపిక తక్కువవుతోంది.

నేను నమ్మినమనిషి, నన్ను అభిమానించేమనిషి మనసుకినచ్చి స్నేహితం నటించి ఇంత ద్రోహం తలపెట్టేందుకు అతని ఆత్మక్షోభించ లేదాని, ఆ కాసేపట్లో కొన్నివందల తడవు లనుకున్నాను.

రాజానా యింత పనిచేస్త ?

గుప్పెట విప్పడానికి భయంగా వుంది. నా చేతిలో దాక్కున్న దయ్యాన్ని చూడటానికి గట్సులేవు. గుప్పెటని జేబులో దాచేశాను. కళ్ళల్లో నీళ్ళు తిరుగుతూండగా నెమ్మదిగా ఆఫీసుకొచ్చేను. నా సీట్లో కూర్చుని ఎవరూ చూడకుండా గుప్పెట విప్పేను.

రెండు పచ్చనోట్లు !

వెంటనే గుప్పిట మూసేను.గుండె వేగం మరింత ఎక్కువైంది. మనసు ఆఫీసులోలేదు. రాజు టెరిలిన్ చొక్కా లోపల దాక్కున్న శరీరంలో వో మూలనున్న చిన్న సైజు అతని 'గుండె'ని దేనితో తయారు చేశాడా దేముడని ఆలోచిస్తోంది.మిత్రుడై నాదగ్గర ఓ స్థానాన్ని సంపాయించుకుని బ్రతికిపోయేడు. ఇప్పుడు నేనేం జేయాలి ? ఏం చేయాలి ?

సెలవు పెడుతూండగా హెడ్ క్లార్కు అడిగేడు. వంట్లో బాగో లేదని చెప్పేను.

"అంటే మరో కొత్త కథేమైనా వ్రాస్తూన్నారా ?"

నవ్వేసి ఊరుకున్నాను.

నా వంట్లో బాగోలేదన్నా, నాకీవేళ సెలవు కావాలన్నా, ఆఫీసులో ఎప్పుడైనా పరాకుగావున్నా వాళ్ళందరూ భావించేది ఒక్కటే-రావ్ ఏదో కథ వ్రాయబోతూన్నాడు !

ఇంత నమ్మకాన్నీ, గౌరవాన్నీ సంపాయించుకున్న నేను యిప్పు డేం చేయబోతున్నాను. ఏం చేశాను. చేసింది దాచుకుని మామూలు మని షిలా తిరుగుతే, రేపొద్దున ఈ విషయం పదిమందికీ తెలిసి భగవంతుడా రాజుని చంపేందుకు యింకా ఆలస్యం చేస్తావెందుకు ?

రూమ్‌వేపు నడుస్తున్నాను. రూముని దాటి వెళ్ళిన సంగతి గమ నించిన క్షణం వెల్‌కంహోటల్ ముందు నించున్నాను. లోపలికెళ్ళి కూర్చుని కాఫీకి ఆర్డరిచ్చేను.

జీవితంలో యింత డబ్బుని చూడక కాదు నేనింత భయపడత ! దీనికెన్నో రెట్ల డబ్బుని చూసేను. ఖర్చు పెట్టేను. జీతం డబ్బు స్వేచ్ఛగా ఖర్చుపెట్టుకునే అధికారమూ, దర్జాగా తీసుకునే అర్హతా వున్నాయి. కథలు వ్రాస్తున్నాను. వాటి ప్రతిఫలాన్ని ఆనందంగా స్వీక రిస్తాను. గర్వంగా ఖర్చుపెట్టుకుంటాను. దేవుడిలాటి నాన్న, కొండలాటి అన్న యిద్దరూ నన్ను అమితంగా అభిమానిస్తారు. నోరు తెరుచుకు అడ గాలేగానీ రాజూ యిచ్చిన డబ్బుకి పదిరెట్లు మరుక్షణాన్న నా ముందుంచు తారు.

గుండెల్లో కత్తిదూసినా యింత బాధ కలగదేమో ! నేను అమి తంగా గౌరవించిన ఒకానొక వ్యక్తి చేతుల్లో నా పరువూని వ్యక్తి త్వాన్ని పెట్టి, వెలకట్టి చూడండి, మాస్టారూ ! అని ప్రాధేయపడేంత దౌర్భాగ్యం మళ్ళా వచ్చే జన్మకీ వద్దు.

ఆ సాయంత్రింవరకూ భోజనం చేయలేదు.ఆ మాటకొస్తే రూమ్ నుంచి బైటకు రానూలేదు. ఆఫీసు మూసేవేళకి ఆఫీసు కెళ్ళేను.ఆఫీసర్ని కలుసుకున్నాను. ఆయన నవ్వుతూ అడిగేరు :

"సెలవు పెట్టారుట."

"అవునండి"

"రెస్టు తీసుకోకుండా మళ్ళా ఎందుకొచ్చేరు ?"

"మీతో నేను కొంచెం మాట్లాడాలి."

"నిరభ్యంతరంగా మాట్లావొచ్చు."

"నన్ని సీట్లోంచి మార్చండి."

"ఎం. కనిట ?"

ఏమని చెప్పుకోను ? నిప్పులాటి మనిషియుందు నా నీచత్వాన్ని విప్పి చెప్పుకున్న తర్వాత క్షమించమనేమాట అటుంచి, నాచేత ఆ క్షణంలో ఆత్మహత్య జరిగే అవకాశం తప్పకుండా చోటు చేసుకుం టుంది. అందుచేత నిజాన్ని దాచేను.

"సీట్లో పని ఒత్తిడి ఎక్కువైంది" అనేశాను.

"ఇన్నాళ్ళా ఎలా చేయగలిగేరు ?"

అవును ఎలా చేయగలిగేను ? నిజానికి పని ఒత్తిడనే చిన్న కారణాన్ని భూతద్దంలోంచి చూచి భయపడేంత పిరికిపాడిని కానేకాను. ఈ మనిషి కేమని చెప్పాలి ? ఎలా నచ్చచెప్పాలి ?

"చూడండి - వ్ ! మీ నెత్తురు తాగాలని యిక్కడ ఎవ్వరూ కూర్చోలేదు. మీపని మీరు చేసుకుపొండి. ఒత్తిడనేది ఇలాటి ఆఫీసుల్లో సర్వసాధారణమైనది. అందుకని చెప్పి మీలాటి యువకులు భయపడితే జీవితంలో మీరు సాధించే దేముంటుంది. అల్ రైట్! మీ నిజమైన సక్రీస్ ఏమిటో చెప్పేందుకు అభ్యంతరమైతే దాచుకోండి. మరో నాలుగు రోజులు సెలవుపెట్టి రెస్టు తీసుకోండి. అన్నీ అనుకూలమైనప్పుడే మళ్లా ఆఫీసుకి రండి. హేపీగా వుండండి రావ్. మీరే దిగులుపడిపోతే ఎట్లా ? వెళ్ళరండి."

ఆయనకేం ? ఆయన ఎన్ని నీతులైనా చెప్పగలరు. నాకా వల్సిన వోదార్పు ఈ రకమైనదికాదు. నా మనసు నీతితప్పి కుళ్ళి పోతోంది. ఈ మందులు దానికి పనిచేయవు.

ఆ రాత్రి నిద్రపట్టలేదు. తెల్లవారింది. తెల్లవారుతూనే వో నిర్ణయాని కొచ్చేను. తణుకు ప్రయాణం కట్టేను. అనుకోకుండా బస్సులో వో మిత్రుడు కనుపించేడు. అత నడిగేడు.

"ఎందాకా ?"

"తణుకు"

"పని ?"

"ప్రత్యేకంగా ఏమీ లేదు"

"ఏమైనా సన్మానమా ?"

"అలాంటిదే"

"నీకేం గురూ ! వెలిగిపోతున్నావ్."

— నామీద అతనికి జెలసీ ! ఏం చూసి జెలసీవో ? నీతిగా బ్రతుకుతున్నాననా ? 'బ్రదర్ ! నా గురించి ఎత్తు ఆలోచనలు చేయకు' అని చెప్దామనుకున్నాను. అతను ఏలూర్లో దిగిపోయేప్పుడు గూడా చెప్పనేలేదు.

తణుకులో దిగేను. రాజూ వాళ్ళింటి గురించి వాకబు చేశాను. వో సోడా షాపతను వో కుర్రాడ్నిచ్చి వాళ్ళింటికి పంపేడు.

రాజూ వాళ్ళ యిల్లు అతనిలా డాబుసరిగా వుంది. అతని ఆకారానికది చక్కటి పోలిక. మే మా యింట్లోకి వెళుతూండగా వో నల్లకారు నన్ను దూసుకుపోయింది. అందులోవున్న వో బట్టతలాయన నన్ను చూచిగూడా పట్టించుకోనట్టు చుట్ట కాల్చుకోడంలో నిమగ్నుడై వున్నాడు. అతను రాజూ వాళ్ళ నాన్నగారని షాపు కుర్రాడు చెప్పేడు. తల పంకించేను.

షాపు కుర్రాడు యింట్లోకివెళ్ళి మరో అయిదు నిమిషాల్లో పద్దెనిమిదేళ్ళ కుర్రాడితో తిరిగొచ్చేడు. మా ఇద్దర్నీ వరండాలో నించోబెట్టి తన దారిని తను వెళ్ళిపోయేడు.

అతను నన్ను పలుకరించలేదు. అతని చేతిలో కాగితం, కలం వున్నాయి. రాజు పోలికలు అతన్లో స్పష్టంగా కనిపిస్తున్నాయి. బహూశా అతని తమ్ముడై వుంటాడు. చందమామలాగానే వున్నాడుగానీ మర్యాదా. మన్ననా బొత్తిగా తెలీని రాతియుగపు మనిషిలా కనిపించేడు. చెట్టంతటి వాడిని కాకపోయినా పరాయి మనిషిని, పనిగట్టుకు యింతదూరం వచ్చిన వాడిని కనీసం 'మీ పేరేమిటి ? ఎవరికోసం వచ్చారు?' అని అడగటం లేదు. పైపెచ్చు ఎవరికో ఉత్తరం వ్రాసే ఘనుడిలా అదే పెద్ద రాచ కార్యంగా భావించి 'నీ వెధవ పనేమిటో చెప్పు. నా కవతల తల మునిగేంత పనుంది.' అనే తత్తర చూపులూ వాడూను.

అభిమానం దెబ్బతిన్నది.కార్యార్థిని, ఒక గాడిద కాళ్ళు పట్టుకునే నిమిత్తం వచ్చిన అతి సామాన్యుడ్ని. అందుచేత నేనే ముందుగా అన్నాను.

"రాజుకోసం వచ్చేను. అతన్ని చూడాలి."

నామాట వినిగూడా అతను నోరు విప్పలేదు. గబగబా కాగితం మీద ఏదో వ్రాసి నాకు చూపించేరు. దాన్లో యిలా వుంది :

'రాజన్నయ్య పది నిమిషాల్లో వస్తాడు. లోపలికొచ్చి కూర్చోండి'

చదివి అతని మొహంలోకి చూసేను. అతను చిన్నగా నవ్వేడు. ఆ నవ్వు నాకు అర్థమైంది. నవ్వు కాదది. నోరులేని మనిషి కళ్ళకు కల్పించే మహత్తర కార్యమైన ఆదరణ ! చలించిపోయేను.

అతన్తోపాటు లోపలికెళ్ళి కూర్చున్నాను.

గదిలో కూర్చుంటూ గదినంతా పరిశీలించేను. అది రాజు గదని చెప్పేందుకు రాజు ఫోటోలు నాలుగైదు కనిపించేయి. వో మూల పుస్తకాలు షెల్పున్నది. మరోపక్క అందమైన రేడియో వున్నది.

అతను వాల్యూమ్ తగ్గించి రేడియో ఆన్ చేశాడు. లోపలికెళ్ళి

కాఫీతో తిరిగొచ్చేడు. కాఫీ యిచ్చి నా ముందు కూర్చున్నాడు. నేను కాఫీ తాగుతుండగా అతనేదో రాస్తున్నాడు. అతను రాసేది చదవాలన్న తాపత్రియం కలిగింది. కాఫీ ముగించేను. ఈమాటు కొంచెం ఎక్కువగా రాసేడు.

'ఇప్పుడు చెప్పండి. మా రాజన్నయ్య మీకెలా తెలుసు. మీదే ఊరు ? నా పేరు ప్రభు. గ్రహించే వుంటారు. దేముడు నా నోరు కట్టేశాడు. లేకపోతే మీతో చాలా మాట్లాడేవాడినే. ఒక్కోసారి గొంతెత్తి ఏదో పిచ్చిగా పాడేయాలన్నంత కోరిక కలుగుతుంది.వెంటనే ఏడుపొస్తుంది. పోనీలెండి_మీ సంగతులు చెప్పండి వింటాను.'

అనుభవాని కొచ్చిన దారుణాల్లో యిదొకటి అతని ఉత్సాహాన్నీ, కోరికనీ, మంచి మనసునీ ఈ విధంగా అన్యాయం చేసిన దేవుడు జాలి లేని రాయనే చెప్తాను. కానీ ఆ యింట్లో రాజ్యం చేస్తోన్న అవినీతికీ, దురాలోచనకీ సాక్ష్యంగా ఈ జీవిని సృష్టించి వుంటాడనేది నిజం.

ప్రభుమీద జాలి కలిగింది. నే నొచ్చిన పని సవివరంగా చెప్దామనుకున్నాను. ఇంత మంచి కుర్రాడికి కథ తెలీకూడదని చెప్పలేదు. నా పేరు చెప్పేను. నా ఊరు చెప్పేను. ప్రయాణంలో వో మాటు రాజుని చూచిపోదామని వచ్చినట్టు చెప్పేను.

అంతలో రాజు వచ్చేడు.రాజు రావడంతో ప్రభు వెళ్ళిపోయేడు. రాజు కూర్చుంటూ అన్నాడు.

"ఇంతదూరం మీరు రావాలా ? కాకితో ఖబురంపితే స్వయంగా నేనే వచ్చేవాడినిగా."

"ఎందుకు ? మరి రెండు పచ్చ కాగితాలు చేతిలో కుక్కి నా పీక నొక్కేదానికా రాజూ ! చాలు. నీ స్నేహం గుణపాఠమైంది. నీ వేషం

దగాచేసింది. తీసుకో, ఈ నరకం నేను భరించలేను. నన్ను మంచిగా బ్రతకనివ్వు. ఆ మాత్రం మేలుచేయి. బాబు" అన్నాను ఉద్రేకంగా.

ఆ పాపిష్టి డబ్బు టీపాయ్ మీదుంచేను.

అతను సోఫాలో తలవాల్చి చాలా బాధ పడుతున్నట్టు నటించి అన్నాడు —

"నన్ను అర్థం చేసుకోండి. తండ్రిచాటు మనిషిని. వ్యాపార దక్షత యిప్పుడిప్పుడే నేర్చుకుంటున్నవాడిని."

"సెలవు" అన్నాను నించుని.

అతను చివాలునలేచి నా రెండు చేతులూ పుచ్చుకున్నాడు.

"మీరు వెళ్ళద్దు. ఒక్కక్షణం ఆగండి" అని చెప్పి గబగబా తన పుస్తకాల్లోంచి డైరీతీసి, వో పేజీ తిప్పి నా చేతిలో వుంచేడు. చదివేను.

'ఇంటి కొచ్చేను.నాన్నతో అన్నాను—ఆయన నా డబ్బునీ, నన్నూ అవమానించేరు. ఆయన్ని పాడుచేయడం నా కిష్టంలేదు. నా డబ్బు నా మొహాన్న కొట్టిన ఆ మంచి మనిషికి చేతులెత్తి నమస్కారం చేశాను. నన్ను మళ్ళా ఆ పాడుపనికి పంపకండి. నేనిక వెళ్ళను'—అని.

అదిరిపోయేను. అతని కళ్ళల్లోకి తిన్నగా చూశాను. అతనేదో చెప్పబోతూండగా పరిభు రెండు యాపిల్ పళ్ళతో మా గదిలోకి వచ్చేడు.



o—o



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 105 B 144 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 193 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | 4,6,192 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | prathyusha |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |